మహిళా ఉద్యమ కరదీపిక



# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

జూలై - సెప్టెంబర్, 2007



స్వేచ్ఛా భారతికి అరవై ఏళ్ళు

## తొలి మహిళా రాష్ట్రపతి

## శ్రీమతి ప్రతిభా పాటిల్



నిరవధిక దీక్షల్లో
రాష్ట్ర నాయకులు

195 ప్రజా సంఘాల
నాయకులు




యనగందుల వీరన్న


చిట్టూరి బాబూరావు


పసుపులేటి కుటుంబరావు


కత్తుల పెదలక్ష్మి


బంకా గోపయ్య


ఉసికల గోపయ్య


జంగం బాలస్వామి

# అత్యున్నత పీఠంపై తొలి మహిళ



## సంపాదకీయం...

అరవై ఏళ్ల స్వతంత్ర భారత చరిత్రలో, తొలి మహిళా దేశాధినేతగా ప్రతిభా పాటిల్ ఎన్నిక చారిత్రక విజయం. 45 ఏళ్ళ రాజకీయ జీవితంలో, ఏ ఎన్నికల్లోనూ ఓటమనేది ఎరుగని ప్రతిభ ఇప్పుడు సరికొత్త రికార్డును సృష్టించారు. భారతదేశ తొలి మహిళా అధ్యక్షురాలిగా ప్రతిభా పాటిల్ సెప్టెంబర్ 23న బాధ్యతలు చేపట్టిన సందర్భంగా మానవి హృదయ పూర్వకంగా అభినందిస్తోంది. గత ఎన్నికల్లో భారత అధ్యక్ష పదవికి పోటీపడిన తొలి మహిళగా కెప్టెన్ లక్ష్మీ సెహగల్ రికార్డు సృష్టిస్తే, నేడు ప్రతిభా పాటిల్ గెలుపు వెనుక సమాజంలో సగభాగపు ఆశల చిగుళ్ళున్నాయి.

మహిళా సాధికారత, చట్ట సభల్లో మహిళలకు భాగస్వామ్యం తదితర లక్ష్యాల పట్ల, పాలక వర్గం నిత్యం హామీలు గుప్పించడం తప్ప, ఇప్పటి వరకూ చేసిందేమీ లేదు. అత్యున్నత స్థానానికి ప్రతిభా పాటిల్ ఎంపికే "మహిళా సాధికారత దిశగా గొప్ప ముందడుగు" అని స్వోత్కర్షలు చేసుకుంటే సరిపోదు.

ప్రతిభా పాటిల్ దేశాధ్యక్షురాలిగా ప్రమాణం చేస్తూ "అణగారిన వర్గాలకు అభివృద్ధి ఫలాలు అందాలి. మతతత్వం, కులతత్వం, ఉగ్రవాదం వంటి విచ్ఛిన్నకర ధోరణులకు వ్యతిరేకంగా, ఐక్యంగా పోరాడాలని మహిళా సాధికారతకు పెద్దపీట వేస్తాను. పౌష్టికాహార లోపం, శిశుమరణాలు, భ్రూణ హత్యలు ఇతర సామాజిక రుగ్మతలకు తెరదించాలి. ఆధునిక విద్య వ్యాసాంగపు వెలుగులు దేశంలోని ప్రతి బాలుడు, బాలిక, ప్రతి స్త్రీకి, పురుషుడుకి చేరాలి. భావి భారత పౌరులకు, అత్యున్నతమైన భవిష్యత్తును అందించే క్రమంలో పేదరికం, అజ్ఞానం, రోగాలపై అవిశ్రాంత పోరాటాన్ని సాగించాలి... నేను రబ్బరు స్టాంపును కాను...., ప్రజా సమస్యలపై ప్రభుత్వానికి సలహాలిస్తాను" అని నొక్కి వక్కాణించిన ఆమె ప్రసంగం దేశ ప్రజల్లో, ముఖ్యంగా మహిళల్లో సంతోషాన్ని నింపింది.

ప్రస్తుతం దేశంముందు వున్న సవాళ్లను ఒక్కసారి పరికిస్తే...

స్త్రీల పరిస్థితి నానాటికి దిగజారుతూ వుంది. నూతన ఆర్థిక విధానాల ఫలితంగా ఉపాధి కోల్పోతున్నారు. వేతనాలు పడిపోయాయి. వ్యవసాయ కూలీల పరిస్థితి మరింత దుర్భరంగా మారింది. మొత్తం శ్రమలో 2/3 వంతు వరకు స్త్రీలు చేస్తున్నారు. కానివారి శ్రమకు గుర్తింపు లేదు.

ఆహార భద్రత లేదు. గోడౌన్లలో నిల్వలు పేరుకుపోతున్నాయి. కాని పేదలకు తిండి గింజలు లేవు. పని సంపాదించడం కోసం, బతకడం కోసం స్త్రీలు శరీరాన్ని అమ్ముకునే దుస్థితికి నెట్టబడుతూ వున్నారు. వలసలు పెరిగాయి. ఎయిడ్స్ పెరిగింది.

చట్ట సభల్లో మహిళా రిజర్వేషన్ బిల్లు 10 సం॥ల నుండి పార్లమెంటు గదుల్లో వేలాడుతూ వుంది.

మహిళల పట్ల వున్న వివక్షత, అభద్రత, వరకట్నం, అత్యాచారాలు, వేధింపులు మొ॥ కారణాల వల్ల ఆడపిల్లను వద్దనుకునే స్థితికి సమాజం నెట్టబడుతువుంది. భ్రూణ హత్యలు పెరిగి స్త్రీ పురుష నిష్పత్తి 1000 : 933గా వుంది.

విద్య, వైద్య రంగాలలో స్త్రీల స్థితి శోచనీయంగా వుంది. మహిళా అక్షరాస్యత 56%నికి మించలేదు. సగం మంది మహిళల్లో రక్తహీనత వుంది. స్త్రీల పట్ల వివక్షత విద్యకు, వైద్యానికి, ఆరోగ్యానికి దూరం చేస్తూవుంది. ఇక మహిళా సాధికారత, అందని ద్రాక్షలా వెక్కిరిస్తూ వుంది.

సగభాగంగా వున్న స్త్రీల జనోద్ధరణ జరగకుండ సమాజం ముందుకు పోజాలదు. దేశ అత్యున్నత స్థానానికి ప్రతిభా పాటిల్ ఎంపిక, మరియు ఆమె తొలి పలుకులు నేటి సమాజానికి దిశా నిర్దేశంగా వున్నవి. ప్రతిభా పాటిల్ తన పరిధిలో మాటలకు కాక చేతలకు తావిస్తూ, లౌకికవాదాన్ని పరిరక్షించడానికి మరియు మహిళా సాధికారత కోసం కృషి చేస్తారని ఆశిద్దాం.





ఈ సంచికలో...




అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం
1-8-538/4, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20.
ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

సంపాదకులు
ఎస్. పుణ్యవతి

మేనేజర్
ఎం. సుధ

సంపాదక వర్గం
మల్లు స్వరాజ్యం
అల్లూరి మన్మోహిని
టి. జ్యోతి
కె. స్వరూపరాణి

విరాళం రూ : 5/-

ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్‌ప్రెస్, ముషీరాబాద్,
హైదరాబాద్ - 500 020




జాతీయపతాకం రూపకర్త : పింగళి వెంకయ్య

## జాతీయ గీతం

జన గణ మన అధినాయక జయహే
భారత భాగ్య విధాతా
పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కళ వంగా
వింధ్య హిమాచల, యమునా, గంగా
ఉచ్ఛల జలధితరంగ
తవ శుభ నామే
జాగే తవ శుభ ఆశిషమాగే
గాహే తవ జయ గాథా
జనగణ మంగళ దాయక జయహే
భారత భాగ్య విధాతా
జయహే! జయహే! జయహే!
జయ జయ జయ జయహే!

- శ్రీ రవీంద్రనాథ్ ఠాకూర్

# భూమి పోరాటంలో మహిళలు

కె. స్వరూప రాణి

195 ప్రజా సంఘాలు, వామపక్షాల ఆధ్వర్యంలో ఇళ్ళ స్థలాలు, సాగుభూమి కొరకు జరుగుతున్న ఉద్యమంలో పెద్ద సంఖ్యలో మహిళలు పాల్గొంటున్నారు. తెలంగాణా పోరాటంలో వెట్టి చాకిరికి వ్యతిరేకంగా, దున్నేవానికే భూమి కోసం జరిగిన పోరాటంలో మహిళలు వీరోచిత పాత్ర నిర్వహించారు. ఆ తర్వాత రాష్ట్ర వ్యాప్తంగా జరిగిన సారా మద్య నిషేధ ఉద్యమంలోనూ, అంగన్‌వాడి సమస్యల పైనా ప్రభుత్వ నిర్బంధాన్ని సైతం ఎదురించి పోరాదారు. గూడు, సాగు భూమికోసం మే నెల నుండి జరుగుతున్న ఆందోళనలో మహిళలు పోలీసుల లాఠీలు, అరెస్టులు, జైళ్ళను కూడా లెక్క చేయటం లేదు. ఇళ్ళ స్థలాల ఉద్యమంలో పట్టణాలలో 90 శాతం మంది, గ్రామాల్లో 50 శాతం పైగా మహిళలు పాల్గొంటున్నారు. భూమి, ఇంటి సమస్య మహిళల సమస్యగా మారింది. ఈనాడు 35-40 శాతం కుటుంబ భారాన్ని మహిళలే మోస్తున్నారు.

## వై.ఎస్. ఎన్నికల వరాలు

ఎన్నికల ప్రచారంలో, ఎన్నికల ప్రణాళికలో శ్రీ వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి మహిళలకు ఎన్నికల వరాలు కురిపించారు. మహిళలకు ఇళ్ళు, ఇళ్ళ స్థలం, భూమి, పావలా వడ్డీకే రుణాలు, దశలవారీగా మద్యం నియంత్రణ, రేషన్ కార్డులు మొదలైనవి ఉన్నాయి. స్వంత ఇంటి కల నిజమౌతుందని, దున్నుకునేందుకు భూమి లభిస్తుందని, కష్టాలు కడతేరుతాయని పేదలు ఆశించారు. అధికారంలోకి వచ్చి 3 సం॥రాలు దాటింది. ప్రభుత్వం భూములు పంచామని, ఇళ్ళు కట్టిస్తున్నామని ఆర్భాటపు ప్రచారం చేస్తుంది. అనేక సంవత్సరాలుగా పేదలు సాగుచేసుకుంటున్న భూమికి పట్టాలిచ్చి భూములు పంచామని చెపుతుంది. ఇందిరమ్మ ఆదర్శ గ్రామాలు, వార్డుల పేరుతో ఇళ్ళు కట్టించి ఇచ్చామని చెబుతున్న ప్రభుత్వం అసలైన పేదలను మరచింది. ఇళ్ళ నిర్మాణంలో అనేక అక్రమాలు, ఆశ్రిత పక్షపాతం, అవినీతి జరిగిందని లెక్కలు చెబుతున్నాయి. హైదరాబాద్‌లో 60 వేలు రాజీవ్ గృహకల్ప ఇళ్ళు నిర్మిస్తామని చెప్పిన ప్రభుత్వం 4,500 మాత్రమే ఇళ్ళు నిర్మించింది. ముఖ్యమంత్రి స్వంత జిల్లా కడప పట్టణంలో టౌన్‌షిప్ పేరుతో 4,000 ఇళ్లు నిర్మించారు. ఇరుకు గదులు, నాణ్యత లోపించటంతో నిర్మాణం జరిగి 8నెలలు అయినా ఎవరూ వుండటానికి ముందుకి రావటం లేదు. ఇళ్ళ స్థలాల కోసం ప్రజలు ప్రభుత్వ కార్యాలయాల చుట్టు తిరిగి అలసిపోయారు. దరఖాస్తులు బుట్టదాఖలయ్యాయి. పైగా ప్రభుత్వం రియల్ ఎస్టేట్ అవతారం ఎత్తి భూములను కారుచౌకగా బడాబాబులకు అమ్ముతుంది. ప్రభుత్వంపై ప్రజలకు ఆశలు సన్నగిల్లాయి. అందువలనే వామపక్షాలు, ప్రజాసంఘాలు ఇచ్చిన పిలుపుపై ఉవ్వెత్తున జనం కదులుతున్నారు.

తెల్లవారు ఝామున 4 గం॥లకే లేచి ఇంటెడు చాకిరి చేసి నీళ్ళ బాటిల్, చద్దన్నం మూటగట్టుకుని బస్సులు, ఆటోలు, కాలినడకన ప్రభుత్వ స్థలాలలో గుడిసె వేయటానికి చీమలదండులా



కదులుతున్నారు. గత డిశంబరులో విశాఖపట్నంలో ఇళ్ళ స్థలాల కోసం జరిగిన పోరాటం రాష్ట్ర ప్రజలకు స్ఫూర్తినిచ్చింది. మే 3వ తేది నుండి రాష్ట్రంలో జరుగుతున్న పోరాటంలో మండు టెండలను సైతం లెక్క చేయలేదు. పట్టణాలలో పాల్గొంటున్న పేదలలో ఇళ్ళల్లో పాచిపనిచేసేవారు, అడ్డాకూలీలు, బీడి, తాపీ, మట్టిపని, చిన్న చిన్న చేతివృత్తుల వారు పెద్ద సంఖ్యలో పాల్గొంటున్నారు. ఒక రోజు పని మానేస్తే వారికి పస్తులు తప్పవు. అయినా మహిళలు వెనుకంజ వేయటం లేదు.

- ఇళ్ళ స్థలాలు, సాగుభూమి కొరకు నిర్బంధాన్ని సైతం ఎదురొడ్డి పోరాడుతున్న మహిళల పరిస్థితులపై ఐద్వా పరిశీలన చేసింది.

## ప్రపంచీకరణ ఫలితాలు

ప్రపంచీకరణ విధానాల వలన పేదలపై భారాలు పెరిగాయి. వ్యవసాయ రంగంలో వచ్చిన మార్పుల ఫలితంగా చిన్న సన్నకారు రైతులు దెబ్బతిన్నారు. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ దెబ్బతింది. చేతివృత్తులు అడుగంటాయి. వ్యవసాయ కార్మికులకు ఉపాధి కరువైంది. గ్రామీణ ప్రాంతాల్లో గతంలో 6,7 నెలలు పనులు దొరికేవి. వ్యవసాయంలో వచ్చిన పంటల మార్పిడి, యాంత్రీకరణ వలన పని దినాలు తగ్గాయి. మహిళలకు అధిక శ్రమ, వేతనంలేని పని భారం పెరిగింది. అనంతపురం, మహబూబ్‌నగర్ లాంటి కరువు జిల్లాల నుండి భార్య బిడ్డలను వదిలి ఉపాధి కోసం పట్టణాలకు వలస వెళ్ళిన వారు సంవత్సరాల తరబడి ఇంటి మొహం చూడటం లేదు. కుటుంబ పోషణ కోసం తప్పని పరిస్థితులలో దళారుల మాటలకు మోసపోయి మహిళలు వ్యభిచార గృహాలకు నెట్టబడుతున్నారు. మన రాష్ట్రం నుండి ఢిల్లీ, ముంబాయి, గోవా, చెన్నయ్ లాంటి నగరాలకు మహిళల అక్రమ రవాణా పెద్ద ఎత్తున జరుగుతున్నది.

## వలసలు

పట్టణాలకు వలసలు పెరిగాయి. వలసలు నివారించడంలో ప్రభుత్వం విఫలం అయ్యింది. వలసలు పెరగటంతో పట్టణాలలో మురికి వాడలు పెరిగాయి. పర్యావరణ పరిరక్షణ, నగరాలు సుందరంగా తీర్చిదిద్దాలని మురికివాడల నిర్మూలనకు ప్రభుత్వం పూనుకొంది. ప్రభుత్వ స్థలాల్లో ఎన్నో సంగిరాల నుండి నివాసముంటున్న పేదల గుడిసెలను ప్రభుత్వం కూల్చివేసింది. ప్రత్యామ్నాయం చూపలేదు.

## ఇళ్ళ కిరాయి సమస్యలు

పట్టణాలలో ఇంటి కిరాయిలు పెరిగాయి. ఒకగదికి ప్రాంతాన్ని బట్టి 500 నుండి 2000 రూ॥ అద్దె కట్టాలి. నీళ్ళ బిల్లు, కరెంటు బిల్లులు పెరిగాయి. పిల్లలు ఎక్కువ వుండ కూడదు. చుట్టాలు రాకూడదు. కట్టెలతో వంట చేయకూడదు. కులం అడిగి వారికి ఇష్టం లేని కులాలకు అద్దెకు ఇవ్వటం లేదు. ఇంట్లో ఎవరైనా జబ్బుచేసి చనిపోతే శవాన్ని ఇంటికి తీసుకురాకూడదని ఆంక్షలున్నాయి. ఆ ఇరుకు గదుల్లో పెళ్ళైన వారు, పెళ్లి కానివారు అందరు అందులో సర్దుకోవల్సిందే.




అధిక ధరలు, ఇంటికిరాయిలు, విద్య, వైద్యం, కరెంట్ బిల్లులు మొదలైన ప్రజా అవసరాలు పేదలకు ఖరీదైనాయి. ప్రజాపంపిణీ వ్యవస్థను నీరుగార్చటంతో ఆహార భద్రత కరువైంది. పెరుగుతున్న పేదరికం కారణంగా తక్కువ ఆహారం భుజిస్తున్నారు. అనారోగ్యం పాలైనప్పుడు డాక్టరు ఫీజులు, మందుల ఖర్చులు భరించలేక అసలు వైద్యమే చేయించుకోలేని వారున్నారు. వీటికి తోడు గల్లీ గల్లీకి మద్యం దుకాణాలు పేదోళ్ళ బ్రతుకులను నాశనం చేస్తున్నాయి. భర్త తెచ్చిన నాలుగు రాళ్ళు తాగుడుకుపోతే కిరాయి కట్టేదెట్లా? పిల్లల్ని బతికించేదెట్లా? కిరాయి డబ్బులైన మిగులుతాయని ఈ ఉద్యమంలో పాల్గొంటున్నామని మహిళలు చెబుతున్నారు.

## మహిళలు వెతలు

రోజుల తరబడి పనులు మానుకుని ఆందోళనలో పాల్గొంటున్న మహిళలపై కొన్ని కుటుంబాలలో వేధింపులు పెరుగుతున్నాయి. పోలీసుల లాఠీ దెబ్బలు తిన్న మహిళలు భర్తలకు తెలియనియ్యటం లేదు. పోలీసోడి చేతిలో లాఠీ దెబ్బలు తింటావా అని చితకబాదుతున్నారు. హైదరాబాద్‌లో చంచల్ గూడ జైలుకు వెళ్ళిన లక్ష్మి అనే మహిళను భర్త నా ఇజ్జత్ తీశావు అని కొట్టాడు. అయినా జాగ కోసం జైలు నుండి వచ్చిన మరునాడు గుడిసె వేయడానికి వచ్చింది. నీ భర్తకి చెప్పి వచ్చావా అంటే? చెబితే రానివ్వడు నాకు ముగ్గురు పిల్లలు. ఇంటి కిరాయి వెయ్యి రూపాయలు. నేను 4 ఇళ్ళల్లో పాచిపని చేస్తాను. నా భర్త అడ్డాకూలీ, రోజూ పని దొరకదు, ఉన్న రోజుకూడా కూలీ డబ్బులు తాగుడుకు తగిలేస్తాడు. జాగ వస్తే ఇంటికిరాయి 1000 రూ॥ మిగులుతాయని పోరాటంలోకి వస్తున్నానని చెప్పింది. రంగారెడ్డి జిల్లా బాల్‌నగర్ మండల పరిధిలో జరిగిన పోరాటంలో 20 మైళ్ళ దూరం నుండి నెల రోజుల బాలింతరాలు వసిగుడ్డును తీసుకొని గుడిసె వేయటానికి వచ్చింది. 'మండుటెండల్లో బిడ్డను తీసుకొచ్చావు, బిడ్డకు ఏదైనా అయితే' అని ప్రశ్నిస్తే, నా భర్త తాపీ పనికిపోతాడు. నగం డబ్బులు తాగుడుకు పోతుంది. ధరలు పెరిగినాయి, ఎట్లా బతికేదని ప్రశ్నించింది. ఈ ఉద్యమంలో ఏనాడు బయటికి రాని ముస్లిం మహిళలు బురఖాలు వేసుకొని పాల్గొంటున్నారు. గుంటూరులో వక్ఫ్ బోర్డు భూముల్లో గుడిసె వేయడానికి వచ్చిన సలీమ 'ఎన్నికలప్పుడు కాళ్ళ వేళ్ళ పడుతారు. జానెడు జాగ ఇవ్వమంటే లాఠీలతో బాదుతారా? అదే ఉన్నోడు అక్రమించుకుంటే వాడి జోలికి పోవట్లే ఇదేమి న్యాయం' అంది. కదిరి పట్టణంలో ఊరికి చివర కొండ గుట్టలపైన గుడిసెలు వేశారు. అద్దెలు కట్టలేక ఎలాంటి సౌకర్యాలు లేకపోయినా అక్కడే నివాసం ఉంటున్నారు. రాత్రి పూట పాములు, తేళ్ళు తిరుగుతున్నాయని మహిళలు చెప్పారు.

## నిర్బంధ విధానం

195 ప్రజాసంఘాలు వామపక్షాల పిలుపుపై పేదలు ప్రభుత్వ స్థలాల్లో గుడిసెలు వేశారు. ప్రభుత్వం అణిచివేత చర్యలను చేపట్టింది. లాఠీలు, అరెస్టులు, జైళ్ళు ఇవేవీ మహిళల స్థైర్యాన్ని దెబ్బతీయలేక పోయాయి. రాష్ట్రంలో 50,000 మంది పైన అక్రమ కేసులు పెడితే అందులో సగం మంది మహిళలే. వరంగల్‌లో మహిళల తలలు పగిలాయి. చేతులు విరిగాయి. 20 సంగిరాల గర్భిణీ స్త్రీ ఫర్వీన్‌నూ పోలీసులు బూట్ కాళ్ళతో తన్నారు. నిజామాబాద్‌లో వంటకు సిద్ధం చేసిన వేడినీళ్ళను మహిళలపై గుమ్మరించారు. నెల్లూరులో ఉద్యమానికి

నాయకత్వం వహిస్తున్న మహిళా నాయకుల చీరలు లాగి, అసభ్యకరంగా ప్రవర్తించారు. గుంటూరు, విజయవాడ, కరీంనగర్, ఆదిలాబాద్, రంగారెడ్డి, హైదరాబాద్, చిత్తూరు జిల్లాల్లో రోడ్లపై ఈడ్చుకుంటూ మహిళలను అరెస్టు చేశారు. కొన్ని చోట్ల మగపోలీసులే నిబంధనలకు విరుద్ధంగా మహిళలను జుట్టుపట్టుకొని లాగటం, చున్నీలను మెడకు వేసి లాగటం, చీరలు లాగటం, జాకెట్లు చించి కీచకుల్లా ప్రవర్తించారు. అసభ్య పదజాలంతో తిట్టారు. అనంతపురంలో 400 మంది మహిళలను అరెస్టు చేసి, ఒక్క స్టేషన్ నుండి మరొక స్టేషన్‌కు మారుస్తూ మండుటెండల్లో తిండి పెట్టకుండా ఉదయం నుండి రాత్రి వరకూ పోలీస్ స్టేషన్‌లో ఉంచారు. 100 రోజుల పోరాటంలో 600 మంది మహిళలు 2 రోజుల నుండి 17 రోజుల వరకూ జైళ్ళకు వెళ్ళారు. అయినా వారి పోరాట పటిమ పెరిగిందే తప్ప తగ్గలేదు. వివిధ రూపాలలో జరుగుతున్న ఆందోళనలో చురుకుగా పాల్గొంటున్నారు. నాయకుల్ని అరెస్టు చేస్తే మమ్మల్నీ తీసుకెళ్ళండని పోలీసులపై తిరగబడి పోరాడుతున్నారు. నాయకులను విడుదల చేసే వరకు ఆందోళన చేస్తున్నారు. జులై 26న రాష్ట్రవ్యాప్తంగా కలెక్టరేట్ వద్ద పికెటింగులు జరిగాయి. హైదరాబాద్‌లో జరిగిన కార్యక్రమంలో ముళ్ళకంచెలు, వాటరుక్యాన్స్, అశ్వకదళాలతో ప్రజలపై లాఠీలు ఝుళిపించింది. మహిళలు కన్నీళ్ళు పెడితే రాష్ట్రం సుభిక్షంగా ఉండదని చంద్రబాబు పాలనలో మహిళలు కన్నీళ్ళు పెడుతున్నారని మీ సమస్యలు పరిష్కరిస్తానని ఎన్నికలకు ముందు వాగ్దానాలు కురిపించిన వై.ఎస్. 60 గజాల ఇంటి స్థలం కోసం పోరాడుతున్న మహిళలపై నిర్బంధాన్ని ప్రయోగించి జైళ్ళకు పంపుతున్నారు. వేలాది మందిపై అక్రమ కేసులు పెట్టి కోర్టుల చుట్టూ తిప్పుతున్నారు. వీటన్నిటికీ పరాకాష్ఠ ముదిగొండ ఘటన.

భూ సమస్య పరిష్కారానికి ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. స్వయం ప్రతిపత్తిగల భూ కమీషన్ వేయాలి. కోనేరు రంగారావు కమిటి సిఫారసులు అమలుచేయాలి. ప్రభుత్వ స్థలాల్లో గుడిసెలు వేసుకున్న వారికి స్థలాలు ఇవ్వాలి. ఎన్నికల ముందు ప్రభుత్వం సాలీనా 8 లక్షల ఇళ్ళ స్థలాలు యిస్తానన్న వాగ్దానాన్ని అమలు చేయాలి. ఇళ్ళ నిర్మాణంలో జరుగుతున్న అవినీతిని, అవకతవకలను అరికట్టడానికి ప్రత్యేక అధికారిని నియమించాలనే డిమాండ్స్‌తో రాష్ట్ర వ్యాప్తంగా 195 ప్రజా సంఘాలు, వామపక్షాలు ఆగస్టు 21న నిరాహారదీక్షలు చేపట్టాయి. దీక్షలు ఏడవ రోజుకు చేరుకున్నప్పటికి ప్రభుత్వం నుండి ఎలాంటి స్పందన లేదు. 7వరోజు అర్థరాత్రి నిరాహారదీక్షలచేస్తున్న నాయకులను బలవంతంగా ఆసుపత్రులకు తరలించింది. ప్రభుత్వ చర్యను నిరశిస్తూ జులై 28వ తేది 195 ప్రజాసంఘాలు, వామపక్షాలు రాష్ట్ర బంద్‌కు పిలుపునిచ్చాయి.

రాష్ట్ర వ్యాప్తంగా బంద్ ప్రశాంతంగా జరుగుతుండగా ఉద్యమాన్ని అణచివేసేందుకు ఖమ్మం జిల్లా ముదిగొండలో ఎలాంటి హెచ్చరికలు లేకుండా గూడు కోసం రోడ్డెక్కిన ప్రజలపై ప్రభుత్వం కాల్పులు జరిపింది. యాంటి నక్సల్స్ స్క్వాడ్‌ని రంగంలోకి దింపి కనీస నియమాలు పాటించకుండా ఎ.కె. 47, సెల్ఫ్ లోడింగ్ రైఫిల్స్ నుపయోగించి రక్తపుటేరులు పారించింది. ఈ అమానుష కాల్పుల్లో ఏడుగురు చనిపోగా 15 మంది బుల్లెట్ గాయాలతో ఆస్పత్రి పాలయ్యారు. అందులో కత్తుల పెద్ద లక్ష్మి కాల్పులలో మరణించగా ముగ్గురు మహిళలకు బులెట్ గాయాలయ్యాయి. లాఠీచార్జిలో ఏడుగురు గాయపడ్డారు. ఈ దారుణమారణకాండపై ప్రపంచ వ్యాప్తంగా నిరసన జ్వాలలు లేచాయి. ముదిగొండ కాల్పుల తర్వాత భూపోరాటం అంతమవుతుందని ప్రభుత్వం భావించింది. ప్రజలు బెదిరిపోలేదు. మరింత ఉధృతమైంది. రాష్ట్రంలో కాల్పులకు నిరసనగా జరిగిన ర్యాలీలో వేలాది మహిళలు పాల్గొని ప్రభుత్వ దమనకాండకు నిరసన తెలిపారు.

70 శాతం భూమిపై ఆధారపడి జీవిస్తున్న గ్రామీణ ప్రజలకు భూ సంస్కరణలు అమలు జరిగితే తప్ప, పేదల జీవితాల్లో మార్పు రాదు. సమాజంలో అట్టడుగునున్న మహిళల బ్రతుకులు మారవు.



ముఖ్యంగా బలహీన వర్గాల మహిళలపై అత్యాచారాలు, వేధింపులు, శ్రమ దోపిడి పెరుగుతున్నాయి. సంఘపరంగా, కుటుంబ పరంగా మహిళల హోదా, స్థితి హీనంగా ఉంది. పేద వర్గాల మహిళలకు విద్య,వైద్యం ఉపాధి కరువవుతుంది. వర్గదోపిడి అంతమైతే తప్ప మహిళలకు సమాన హక్కులు సాధ్యం కాదు. సమాజంలో ఉన్న అసమానతలు పోవాలి. మహిళలకు ఆర్థిక స్వాతంత్రం లభిస్తే స్త్రీ పురుష అసమానతలు తొలగుతాయి. భూ సమస్య, ఇంటి సమస్య అనేది మహిళల జీవితాలతో విడదీయరాని బంధంగా ఉంది.

పేదలు ప్రభుత్వ భూములలో నివాసం వుంటే వారికి రక్షణ కల్పించాలని, గుడిసెలు తొలగించరాదని ఇందిరా గాంధీ హయాంలో ప్రభుత్వం 1977లో ఉత్తర్వులు జారీ చేసింది. ఇందిరమ్మ జపం చేస్తున్న వై.ఎస్. పేదలపై నాన్‌బెయిలబుల్ కేసులు పెట్టి ఉద్యమాన్ని ఉక్కుపాదంతో అణిచివేస్తుంది. దున్నేవానికే భూమి కావాలని వీరోచితంగా జరిగిన తెలంగాణ పోరాటంలో భూస్వాములకు ఎదురొడ్డి పోరాడిన చాకలి ఐలమ్మ, మల్లు స్వరాజ్యం లాంటి ఎందరో వీర వనితల స్ఫూర్తితో భూ ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలి.

***

# బృందాకరత్ - ఇంటర్వ్యూ

ఇంటర్వ్యూ చేసినవారు - ఆర్తి వాణి

ప్రశ్న: భారత దేశంలోని మహిళా ఉద్యమ నేపథ్యాన్ని మరియు స్వాతంత్ర్యానికి పూర్వం, స్వాతంత్ర్యానంతర ఉద్యమాన్ని గురించి కాస్త వివరిస్తారా?

జ: మహిళా ఉద్యమాన్ని కొన్ని కాలాలుగా విభజించటం కుదురుతుందని నేను భావించటం లేదు. భారత స్వాతంత్ర్య ఉద్యమం - ఆ కాలంలో మహిళా ఉద్యమాలు, సంఘాలు ముఖ్య పాత్ర పోషించాయి. 1950లలో హిందూ చట్టాల మార్పుకు మతోన్మాదుల వ్యతిరేకత లాంటి విషయాలు, ఆ సందర్భంగా జరిగిన ఉద్యమాలు నేటికి సమకాలీనంగానే ఉన్నాయి. కాబట్టి స్వాతంత్ర్య ఉద్యమ కాలంలోనూ మరియు స్వాతంత్ర్యానంతర కాలంలో కూడా అనేక ధోరణులు కనిపించాయి.

ప్రశ్న: ఎమర్జెన్సీ తరువాత ఉద్యమాన్ని వివరించండి.

జ: ఎమర్జెన్సీ ఎత్తివేసిన తరువాత దేశ వ్యాప్తంగా అనేక మహిళా గ్రూపులు ఆవిర్భవించాయి. ఈ కాలంలోనే సమస్యల ప్రాధాన్యత గుర్తించి, మీడియా కూడా సమస్యలను వెలుగులోకి తెచ్చే ప్రక్రియ ప్రారంభమైంది. మహిళలు పెద్ద సంఖ్యలో ఉద్యమంలోకి రాకపోయినప్పటికీ సమస్యలకు ప్రాధాన్యత పెరిగింది. అయితే భారతదేశంలో మహిళా ఉద్యమం ఏకస్వరూపం కలిగినది కాదు. అనేక ధోరణులు, దృక్పథాలు, ఎత్తుగడలు వున్నాయి. ఎన్ని విభేదాలు ఉన్నప్పటికీ ముఖ్యమైన సమస్యల మీద కలిసి పనిచేయటం 1970లలో మహిళా ఉద్యమంలో వచ్చిన శుభ పరిణామం. ఆ కాలంలోనే చాలా చురుకైన ఐక్య ఉద్యమం ఉండేది. ఈ చురుకైన ఉద్యమం అనేక సమస్యలను వెలుగులోకి తేగలిగింది. వరకట్న హత్యలు, తత్సంబధిత విషయాల మీద సమగ్ర చర్చకు అస్కారం ఏర్పడింది. ఆ సమస్యలను గృహ పరిధిలో నుంచి నా ఇల్లు, నా కుటుంబం అనే కట్టుబాటులోంచి బయటకు తేవటానికి ప్రయత్నం జరిగింది. భారత రాజ్యాంగం ఇంటివద్దనే స్వేచ్ఛకు తెరదించుతుందా లేక వివిధ వ్యక్తిగత విషయాల మీద హక్కులు కల్పిస్తుందా అనే చర్చ జరిగింది. గృహ హింస, లైంగిక దాడులు లాంటి అనేక విషయాలను వివిధ సంఘాల ఐక్య ఉద్యమం వలన లేవనెత్తగలిగాం".

ప్రశ్న: భారతదేశం మహిళా ఉద్యమం యొక్క ఇతర ముఖ్య లక్షణాన్ని వివరించగలరు.

జ: భారత మహిళా ఉద్యమం, స్వాతంత్ర్య ఉద్యమ నేపథ్యంలో ఉద్భవించింది. సమానత్వం, విముక్తి, స్త్రీ పురుష సంబంధాల నుంచి ఉద్యమాన్ని (పశ్చిమ దేశాల ఉద్యమం లాగా) ఎప్పుడూ



చూడలేదు. వాటికే పరిమితమైతే ఉద్యమం బలహీన పడుతుంది. దేశం, సామాజిక ఆర్థిక స్థితిగతులు అనే విశాలమైన దృక్పథం నుంచి మహిళా ఉద్యమాన్ని చూడాలి. మహిళల అణచివేతకు వ్యతిరేకంగా జరుగుతున్న ఉద్యమం, వారి స్థితిగతుల్ని, వాటికి కారణమైన రూపాల్ని అర్థం చేసుకొనే విధంగా ఉండాలి. ఉదా: స్వాతంత్ర ఉద్యమ కాలంలో వలసవాద వ్యతిరేక ఉద్యమాలు, ఈ మౌలిక నేపథ్యాన్ని అర్థం చేసుకోవటం 1970లలో మాకు ఎంతగానో ఉపకరించింది. రకరకాల సమస్యలను పరిశీలించి మహిళా స్థితిగతుల్ని విశ్లేషించడానికి దోహదపడింది. డా॥ వీణా మజుందార్, సి. లలితా సర్ధార్ తయారు చేసిన "మహిళల స్థితిగతులు'' అను రిపోర్టు కూడా ఇదే విషయాన్ని తెలియచెపుతుంది. శ్రమ, మహిళల పని, ఆర్థిక స్థితిగతులు, రాజకీయ భాగస్వామ్యం లాంటి అనేక విషయాలు ముందుకు వచ్చాయి. స్థూల ఆర్థిక విషయాలను మహిళా దృక్పథం నుంచి విశ్లేషించగలిగాం.

ప్రశ్న: విధాన నిర్ణయాల మీద ఏ విధమైన ప్రభావం చూపారు?

జ: మా జోక్యం అనేక విధానాల మీద ప్రభావం చూపింది. న్యాయపరమైన రక్షణ చట్టాలు, ఇంటి లోపల మరియు బయట హక్కులు, ఉద్యమ జోక్యం వలనే సాధ్యం అయింది. కొంతమంది పార్లమెంటు సభ్యులు మరియు మహిళల సమీకరణ వలన అనేక క్రొత్త చట్టాలు వచ్చాయి. వ్యక్తిగత గుర్తింపు కాకుండా సమస్యలకు గుర్తింపు కోసం కృషి చేయడం జరిగింది. ఉదా: షాబాను కేసులో ముస్లిం మహిళల హక్కుల్ని

హరించి, రాజకీయ ప్రయోజనం పొందాలని ప్రభుత్వం ప్రయత్నించినపుడు అన్ని వర్గాల మహిళలు స్పందించారు. కాని మహిళా సంఘాల మధ్య కొన్ని భిన్న అభిప్రాయాలు వ్యక్తమైనాయి. కొంత మంది ఈ విషయాన్ని వారి మతానికి (ముస్లిం) వదిలి వేయాలని, మరికొంత మంది షాబాను నిర్ణయానికి వదిలేయాలని పేర్కొన్నారు. భిన్న ధోరణులు వ్యక్తమైనప్పటికీ షాబాను కేసు కొన్ని గుణపాఠాలు నేర్పింది. మతోన్మాదం ఏ మతానికి చెందినప్పటికి మహిళల హక్కులకు, సమానత్వానికి పెద్ద అడ్డంకిగా నిలుస్తుంది. మతోన్మాదానికి వ్యతిరేకంగా అన్ని వర్గాల, మతాల ప్రజలను సమీకరించాలని అర్థమైంది. ఈ అవగాహన వలనే **1990**లో కాని, **2002** గుజరాత్ కాని మతోన్మాదులు మహిళలను తమవైపు తిప్పుకోవాలని ప్రయత్నించినపుడు మనం ఒక లౌకిక ప్రత్యామ్నాయం నిర్మించి, వారిని ఎదుర్కొన్నాము. మహిళా ఉద్యమం తన గమ్యం చేరుకోనప్పటికీ, సైద్ధాంతికంగాను, ఎత్తుగడల పరంగాను పైన పేర్కొన్న విధంగా కొంత పురోగతి సాధించాము.

ప్రశ్న: కొన్ని మహిళా సంఘాలు కలసి పని చేయుటం గొప్ప విజయంగా చెపుతున్నారు. కాని ఆ సంఘాల మధ్య విభేదాలు బహిరంగంగానే వ్యక్తమౌతున్నాయి. కాని కొన్ని విషయాల మీద కలిసి పని చేస్తున్నారు. భవిష్యత్తు ఎలా వుంటుంది? కొన్ని గ్రూపులు, సంఘాలు కలిసి ఒక ఐక్య ఫ్రంటు ఏర్పాటు అవుతారా?

జ: నిజం చెప్పాలంటే సభ్యత్వం రీత్యా ఐద్వా అతి పెద్ద సంఘం. కాని మొత్తం మహిళా జనాభాలో అది అతి చిన్న భాగం మాత్రమే. కాబట్టి విశాలమైన ఐక్యత, సమీకరణ లేకుండా మనం ఏమీ సాధించలేము. అంతేకాకుండా కొన్ని సందర్భాలలో మన సిద్ధాంత విభేదాల్ని ప్రక్కన పెట్టి సమస్య మీద పోరాడాల్సి వుంటుంది. స్త్రీ పురుష సంబంధాలు, రాజకీయ దృక్పథం, రాజకీయ పార్టీలు, ఆర్థిక విధానాల మీద పోరాటం, ఎన్నికల విషయాలు - అనేక విషయాల మీద భిన్నాభిప్రాయాలు వుంటాయి. కాని, ఎన్ని విభేదాలు వున్నప్పటికి, కొన్ని గ్రూపులు మనకు నచ్చినా నచ్చకపోయినా మహిళలకు ఎంతో కొంత ప్రయోజనం చేకూర్చాలంటే సమస్యల మీద అందరం కలిసి పని చేయక తప్పదు.

ప్రశ్న: **1990** మండల్ కమీషన్ సూచనల తరువాత దళిత - బహుజన స్త్రీ వాదం ముందుకు వచ్చింది. వారితో మీకు సైద్ధాంతిక విభేధాలు వున్నాయి. ఈ నేపథ్యంలో లింగ-కుల, లింగ-వర్గ రాజకీయాల్ని ఎలా అర్థం చేసుకుంటారు?

జ: మన సమాజంలో కుల వివక్ష ఒక క్రమ పద్ధతిలో వేళ్ళూనుకొని వుంది. కుల వివక్ష నిర్మూలన జరగకుండా మన దేశంలో మహిళా సాధికారత, సమానత్వం సాధ్యం కాదు. పేదవారిలో కెల్లా పేదవారు, దళిత మహిళలపై అణచివేత మీద అటు సైద్ధాంతికంగాను, మరియు వాస్తవ పనిలోను కూడా జరగాల్సినంత కృషి జరగలేదు. దీనిని అందరూ గుర్తించాలి. కాని ఐద్వాకు సంబంధించినంత వరకు ఎక్కువ మంది సభ్యులు దళితులే. దళిత మహిళల యొక్క ఆర్థిక, రాజకీయ, సామాజిక సమస్యల మీద అనేక పోరాటాలు చేశాం. మా అనుభవం చెబుతున్న విషయం ఏమిటంటే దళిత మహిళలకు మద్దతుగా అన్ని వర్గాల మహిళలను కలుపుకొని ఉద్యమించకపోతే మహిళా ఐక్యత అనే నినాధం అర్థరహితం. దళిత సమస్యను ప్రత్యేకంగా చూడాలి. వారికి ప్రత్యేక సంఘ గుర్తింపు అనే చర్చ అనవసరం. ఈ సమస్య మీద పోరాటం ఐక్య ఉద్యమానికి, పోరాటానికి దూరంగా మాత్రం ఉండకూడదు.

ప్రశ్న: దళిత మహిళలు ఎదుర్కొంటున్న సమస్యలు, వారి మీద జరుగుతున్న హింస, అగ్రవర్ణ మహిళల సమస్యలు వేరన్నది దళిత ఉద్యమకారుల అభిప్రాయం. మన సంఘాలు వరకట్న సమస్య అన్ని వర్గాలను ఇబ్బందికి గురి చేస్తుందని, మార్కెట్ శక్తుల ప్రభావం వరకట్న సమస్యను పెంచుతుందని అభిప్రాయ పడుతున్నాయి. కాని, దళిత సంఘాలు దానిని బ్రాహ్మణిజం ఆధిపత్యంగానే చూస్తున్నాయి. దీని మీద మీ అవగాహన ఏమిటీ?

జ: అది బ్రాహ్మణిజం సమస్య కాదు, కుల వ్యవస్థ వరకట్న సమస్యను ఎలా చూస్తుంది అన్నది మనం చూడాలి. భారతదేశంలో కులం దృఢంగా వేళ్ళూనుకొని వుంది. పాలక వర్గాలు అది ఇంకా దృఢంగా వుండాలని కోరుకుంటున్నారు. వారి ఆధిపత్యం కొనసాగటానికి అది అవసరం అని అనుభవం వారికి తెలియజెప్పింది. అదే సమయంలో కులాలు, వాటి మధ్య ఆధిపత్యం, వాటి మధ్య సంబంధాలు, స్త్రీ వివక్షను, దోపిడీని పెంచుతున్నాయి. వరకట్నం - కులం - మార్కెట్‌కు సంబంధం ఉంది. వాటిని వేరుగా చూడము. ఈ మార్కెట్ శక్తులు కుల వ్యవస్థను బలోపేతం చేస్తాయా లేదా అనే వైపు నుంచి ఒక సమగ్ర అవగాహనకు రావాలి. ఆ అవగాహనలో వైరుధ్యాలు ఉండొచ్చు, ఉండకపోవచ్చు.

మార్కెట్ కుల వ్యవస్థను పెంచే మాధ్యమంగాను, వివక్షకు దారితీసే సాధనంగాను వుంది అన్నది మొదటి అవగాహన. రెండవది మహిళా సంఘాలు దళితులకు ఇవ్వాల్సిన ప్రాధాన్యత ఇవ్వలేదని, వారి సమస్యల పరిష్కారానికి కృషి చేయలేదని అదే పనిగా విమర్శలు చేస్తున్నారు. ఇలా విమర్శలు చేస్తున్నవారు "అన్ని మహిళా సంఘాలు" "మహిళా ఉద్యమం మొత్తం దళిత మహిళను పట్టించుకోలేదనే" విమర్శలు చేస్తున్నారు. కాని నేను దీనిని ఖండిస్తున్నాను. ఐద్వా గత **10-12** సంవత్సరాలుగా చేసిన ఉద్యమాలను పరిశీలించినట్లయితే, అంటరానితనం, మహిళల గౌరవం, శ్రమ దోపిడి, సామాజిక సమానత్వం లాంటి అనేక విషయాలు ఎజెండాలో వున్నాయి. తమిళనాడులో అంటరానితనానికి, రెండు గ్లాసుల పద్ధతికి, దళిత బాలికలను రోడ్డు మీద సైకిళ్ళు త్రొక్కనీయక పోవడానికి వ్యతిరేకంగా ఐద్వా జోక్యం చేసుకుని ఫలితాలు సాధించింది. అయితే, ఈ పోరాటాల్లో కొన్ని సమస్యలు కూడా ఎదుర్కొన్నాము. ఈ సమస్యలను చేపట్టడం వలన మహిళా ఐక్యత దెబ్బతినడం లాంటివి కూడా ముందుకు వచ్చాయి. రెండు గ్లాసుల పద్ధతికి వ్యతిరేకంగా ఉద్యమించినపుడు అగ్రకులాల మహిళల నుంచి వచ్చిన స్పందనలు, మన ఉద్యమాన్ని మరింత పటిష్టం

చేసుకోవాల్సిన అవసరాన్ని తెలియజెప్పాయి. కాబట్టి జాగ్రత్తగ వ్యవహరించి, అవగాహన పెంపొందించి, మహిళలను చైతన్య పరచి భాగస్వాములుగా చేసుకోవాలి. కాని, ఏ మహిళా తరగతి సమస్యల కోసం వారే ఉద్యమించాలి అని అనుకోవడం తప్పు. వామపక్ష ధోరణులు ఉన్న మహిళా ఉద్యమం అందరిని కలుపుకొని పోయి దళిత మహిళల సమస్యల కోసం కృషి చేయాలి. అలాకాకుండా పశ్చిమ దేశాలలో లాగా విభజనలు కలిగి వుండటం సమంజసం కాదు. (మన మహిళా ఉద్యమం ఇంతకు మునుపు అలా లేదు.)

ప్రశ్న: ప్రపంచీకరణ, మతోన్మాదం మహిళా ఉద్యమానికి పెద్ద సవాళ్ళుగా ఉన్నాయి. వీటిని వ్యతిరేకించటంలో మన విధానం ఎలా వుండాలి?

జ: మహిళలను లక్ష్యంగా చేసుకొని మార్కెట్ ఏ విధంగా పని చేస్తుంది. అది మహిళలను తీవ్రంగా ప్రభావితం చేస్తుందని తెలియజేసే సాహిత్యం చాలా వచ్చింది. సామాజిక బాధ్యతల నుంచి ప్రభుత్వం తప్పుకోవటం వలన ఉత్పన్నమైన సమస్యలు, ఇంటిలో పని, పిల్లలు, పెద్దల పని, ఆరోగ్య సమస్యలు మహిళల మీద చూపే ప్రభావం ఒక అంశం, రెండో అంశం మహిళల ఆర్థిక స్వేచ్ఛకు సంబంధించినది. ప్రపంచీకరణ మహిళల ఉద్యోగ అవకాశాలను తగ్గించడమే కాకుండా, పని దొరికిన చోటు కూడా దారుణమైన పరిస్థితుల్లోకి నెట్టి వేస్తుంది. ఐక్యరాజ్య సమితి నివేదికలు మరియు దేశంలోని అనేక సర్వేలు ఈ విషయాన్ని ధృవపరుస్తున్నాయి. కావున సాంప్రదాయ వస్తుఉత్పత్తి పరిశ్రమల స్థానంలో వచ్చిన నూతన పరిశ్రమలు తక్కువ మందికి ఉపాధి కల్పిస్తూ, ఏ మాత్రం హక్కులు లేకుండా చేస్తుంది. మూడో అంశం హింసకు సంబంధించినది. సరళీకరణ విధానాల వలన సామాజిక హింస పెరిగింది. సెక్సుని ఒక లాభాపేక్ష గల వస్తువుగా మార్చి మహిళను వ్యాపార సరుకుగా తయారు చేశారు. దీని ప్రభావం వలన హింస విపరీతంగా పెరుగుతుంది. ఆర్థిక ఇబ్బందులు హింసకు, దోపిడీకి కారణమవుతున్నాయి. అనేక మంది మహిళలు ఆర్థిక పరిస్థితుల వలన వలసలు పోవాల్సి వస్తుంది. డబ్బులు లేక రైలులో టిక్కెట్టు లేకుండా చేసే ప్రయాణం దగ్గర పేద మహిళల కష్టాలు, వారికి వ్యతిరేకంగా ఉపయోగించబడే భాష, అగౌరవ పరచడం, అన్ని హింసలో భాగమే. అనేక విధాలుగా జరుగుతున్న హింస అసలు బయటకు తెలియదు. కాబట్టి ఆ హింస గురించి మాట్లాడి, ప్రచారం చేసి, కరపత్రాలు రాసి, దానికి కారణమైన సరళీకరణ విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమించాల్సిన అవసరం వుంది.

ప్రశ్న: ఉద్యమాలలో మహిళలు పాల్గొనటం పెరిగింది. రాజకీయాల్లోను, మహిళా ఉద్యమాలలోను కూడా జోక్యం పెరుగుతుంది. వారి జీవితాల్లో వాటి ప్రాముఖ్యత ఏమిటి?

జ: మహిళలు ఉద్యమాలలో పాల్గొనడం, బయటకు రావడం ఒక సానుకూల అంశం. తల్లిగా, అక్కగా, భార్యగా కుటుంబానికి మాత్రమే పరిమితం కాకుండా, తన పరిధిని విస్తరించుకోవడం, నేడు 10 లక్షల మంది మహిళలు పంచాయితీల్లో వివిధ స్థాయిల్లో పనిచేస్తున్నారు. ప్రజా జీవితంలోను, ఉద్యమాలలోను అనేక మంది పనిచేస్తున్నారు. ఉద్యమాల ద్వారా లభించిన ఉన్నతిని కొంతమంది అనేక పనులు చేసే "మహాశక్తి"గా చూపించడానికి ఉపయోగిస్తున్నారు. మహిళల ముందడుగును మళ్ళీ సాంప్రదాయంలోనికి పంపుతున్నారు. ఇది ఎలా ఉపయోగపడుతుందో వారే చెప్పాలి.

ప్రశ్న: ప్రపంచీకరణ ఒక వైపున అంతరాలను పెంచుతుంది. వేరొకవైపు పెరిగిన సాంకేతిక పరిజ్ఞానం మహిళలను ఒక దగ్గరకు చేరుస్తుంది. ఈ నేపథ్యంలో అంతర్జాతీయ మహిళా ఉద్యమం ఎలా వుంటుందని భావిస్తున్నారు?

జ: మీడియా విశ్లేషకుల విశ్లేషణ ప్రకారం మహిళా ఉద్యమం **1960, 1970**లలో జన్మించి, అప్పుడే మరణించింది. **1960, 1970, 1980**లలో పాశ్చాత్య మహిళా ఉద్యమాలు ఒక అంతర్జాతీయ చర్చకు తగిన వాతావరణం కల్పించాయి. కాని వారు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న భిన్నమైన మహిళా సమస్యలను, భిన్నమైన అనుభవాలను స్వీకరించలేదు. అది ఆ కేంద్ర నాయకత్వం యొక్క బలహీనతగా కనబడుతుంది. ఉదా: ఇటీవల కాలం వరకు పాశ్చాత్య దేశాలలోని ఉద్యమాలకు "అబార్షన్ హక్కు" ఒక పెద్ద చర్చగా ఉండేది. తృతీయ ప్రపంచ దేశాలు మహిళలు అబార్షన్ హక్కు కలిగి వున్నారని, బలవంతపు కుటుంబ నియంత్రణ విధానాలను మన దేశాల సంఘాలు ఎందుకు వ్యతిరేకిస్తున్నాయో పాశ్చాత్య ఉద్యమాలు అర్థం చేసుకోలేదు. కుటుంబ నియంత్రణ, జనాభా నియంత్రణ కోసం ఇక్కడ అనేక ఉద్యమాల తరువాత కొన్ని హక్కులు సాధించాం. కాని పాశ్చాత్య దేశాల వారు భిన్నమైన దృక్పథం కలిగి వున్నారు.

లైంగికత మీద కూడా వారు భిన్నమైన దృక్పథం కలిగి వున్నారు. మన దేశంలోని కుల వ్యవస్థ మహిళల యొక్క భావ వ్యక్తీకరణను, జీవిత భాగస్వామిని ఎంచుకొనటంలో స్వేచ్ఛను లేకుండా చేస్తుంది. కాని పాశ్చాత్య దేశాలలో లైంగికత మనకు ఎందుకు ముఖ్యం కాదో తెలుసుకోలేరు. అనేక భిన్నమైన అభిప్రాయాలు ఉన్నాయి. కాని సందర్భానుసారంగా అనుభవాలను, ప్రాధాన్యతలను అర్థం చేసుకుంటేనే ఉద్యమం విస్తరిస్తుంది. మార్చి **2000**లో అనేకమంది మహిళలు పాల్గొన్న ప్రపంచ మహిళల మార్చ్ ఒక మంచి అనుభవాన్ని ఇచ్చింది. ఈ కాలాన్ని "సామ్రాజ్యవాద ప్రపంచీకరణ"కు వ్యతిరేకంగా పోరాడే మహిళలు, సంఘాలు కలిసి పనిచేయడానికి వినియోగించారు. మనం ప్రపంచీకరణకు వ్యతిరేకం కాదు కాని దోపిడీ ప్రపంచీకరణకు వ్యతిరేకం. ప్రపంచ వ్యాప్తంగా మహిళలు అనేక అనుభవాలు కలిగి వున్నారు. కాబట్టి అవి ఈ ఉద్యమానికి ఊపు నిచ్చాయి. ఈ ఉద్యమాన్ని ముందుకు తీసుకు వెళ్ళాలి. ప్రపంచ వ్యాప్తంగా మహిళా వ్యతిరేక శక్తులు ఐక్యంగా వున్నాయి. కాబట్టి మహిళా వ్యతిరేక శక్తులను మనం గట్టిగా ప్రతిఘటించాలి. **2000**లో ఒక మంచి ప్రారంభం జరిగింది. దానిని కొనసాగిద్దాం.

★★★

# దేశాన్ని ప్రేమించండి

డా॥ బి. విజయభారతి

మహాకవి గురజాడ అప్పారావు గారు రాసిన దేశభక్తి గేయం అనాడు ఎందరినో ఉత్తేజపరిచింది.

"దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా
దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుజులోయ్"

అనే పంక్తులను ఆనాటి ప్రజా నాయకులు, రాజకీయ పార్టీలు దేశ సమైక్యతను బోధించే ఆదర్శాలతో కూడినదిగా అర్థం చేసుకున్నారు. మానవుల మధ్య ప్రేమ, సోదరభావం, భావసమైక్యత ఉండాలనే అర్థం వారికి స్ఫురించింది.

వర్తమాన పరిస్థితులలో ఆ గేయ పంక్తుల్ని నెమరు వేసుకుంటే చిత్రమైన భావాలు కలుగుతున్నాయి. "దేశమంటే మట్టి కాదు" అనేది నేటి పాలకులకు వేరే విధంగా అర్థం అయిందని అనిపిస్తోంది. దేశం వేరు, మట్టి(భూమి) వేరు అనే భావం వారికి కలిగింది. అందుకే భూమిని కొత్త రీతులలో డబ్బుకోసం వినియోగించటం మొదలు పెట్టారు. వ్యవసాయం, ఇళ్ళ స్థలాలు అనేవి పాత భావనలు. "ఈ దేశానికి అవి లేకపోయినా ఫరవాలేదు, కానీ ఆధునిక సాంకేతిక సౌకర్యాలు/వస్తువులు కావాలి. అవే నేటి అవసరాలు" అనుకుంటూ మట్టిని మనుషుల నుండి విడదీసి విదేశీ కంపెనీలకు /పెట్టుబడి దార్లకు ధారాదత్తం చేయడం, సొమ్ము చేసుకోవటం మొదలు పెట్టారు. బ్రిటిష్ పాలకుల కాలంలో విదేశీయులు కొల్లగొట్టుకుపోయిన సంపద గురించి తలచుకుని బాధపడే దేశభక్తులు ఇప్పుడేం చేయాలి? దేనికి ఆశపడి నేటి పాలకులు భూసంపదలను భూగర్భ వనరులను అన్యాక్రాంతం చేస్తున్నారు? పాలకవర్గానికి వ్యవసాయం అక్కర్లేదు. ఐ.టి. పరిజ్ఞానం కావాలి. ఉండటానికి వారికి ఇళ్ళు ఎలానూ ఉన్నాయి. ఎలాగూ సగం బంధుగణం అమెరికాలోనే ఉంది గనక నివాస స్థలాల బెడద వారికి లేదు. "దేశమంటే మనుషులే" అని గురజాడ అన్నారు కాబట్టి భూమితో /మట్టితో సంబంధంలేని మనుషుల గురించే వారు ఆలోచిస్తున్నారా అని అనిపిస్తోంది. (గురజాడ గేయానికి ఇలాంటి అర్థం తీస్తున్నందుకు పాఠకులు క్షమించాలి) అదే వారి దృష్టిలో "దేశం" సంపన్నుల దేశం.

మట్టితో-భూమితో- సంబంధంలేని మనుషులతో కూడిన "దేశం" గురించి ప్రణాళికలు తయారు చేస్తూ వారికి సంక్షేమ పథకాలు తయారు చేస్తూ పాలకులు నానా హైరానా పడిపోతున్నారు. దేశాన్ని ప్రేమిస్తున్నారు. మంచిని, ప్రపంచీకరణను, సెజ్‌లను పెంచుతున్నారు. నిజమైన దేశభక్తి తమదే అని ప్రకటించుకుంటున్నారు. భారీ ప్రాజెక్టులూ జలయజ్ఞాలూ వారి బంధువులను పోషిస్తున్నాయి. కాంట్రాక్టర్లను పోషిస్తున్నాయి. ప్రభుత్వమే తమ భూములను లాక్కుంటూ చిల్లర డబ్బులు చేతిలో పెట్టి పొమ్మంటూ ఉంటే మట్టిని-భూమిని నమ్ముకొన్న పేదలు మరి ఏ ఇతర ఆధారమూ లేని పేదలు "దేశమంటే మట్టి కాదోయ్" అని పాడుకుంటూ దేశభక్తి ప్రకటించాలా? "దేశమంటే మనుషులోయ్" అంటూ తిరగబడాలా?

ఉన్న కొద్దిపాటి వ్యవసాయ భూమి, చిన్న పాక ప్రభుత్వం లాక్కుంటే పేదలు నిస్సహాయంగా ఊరుకున్నారు. చాలా కాలం; సహాయం కోసం ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరిగారు. ఆకలి చావులను చూస్తూ కన్నీళ్ళు పెట్టుకున్నారు. ఇలా ఎంత కాలం? ఆందోళనలూ, నిరాహార దీక్షలు కూడా పనిచేయకపోతే ఇక ఈ ఉద్యమం ఏ రూపు దాలుస్తుందో అనూహ్యంగా ఉంది.



ఒక చేతిలో 'ఐపాడ్' మరో చేతిలో మొబైల్ పట్టుకుని తిరుగుతున్న యువత దేశ జనాభాలో ఎంత శాతం ఉన్నదో తినటానికి తిండి, ఉండటానికి ఇల్లు, చేయటానికి ఉద్యోగం లేని యువత ఎంత శాతం ఉన్నదో తెలుసుకుని పథకాలు తయారు చేయటం, అమలు చేయటం జరిగితే తప్ప భూపోరాటాలు ఆగవు.

భూ సమస్య పట్ల ప్రభుత్వ నిర్లక్ష్య ధోరణిని పలు పార్టీలు ప్రజాస్వామ్య పరిరక్షణ సంఘాలు, పౌర హక్కుల పరిరక్షణ సంఘాలు ఖండిస్తూ ఆందోళన చేస్తున్నాయి. అయినా బాధ్యత వహించవలసిన నాయకులు ఈ సమస్యలను, సామాన్య ప్రజల అవసరాలను గమనించడానికి నిరాకరిస్తున్నారు. విలువైన దేశ సమయాన్ని పరస్పర ఆరోపణలతో దూషణలతో గడిపేస్తున్నారు. తమ దారిన తాము తిట్టుకోకుండా తమ పనేదో తాము చూసుకుంటూ ఎక్కడో నిర్లిప్తంగా బతికేస్తున్న మాతృమూర్తులను తమ దూషణ పదజాలంలోకి లాగుతున్నారు. పూర్వం ఇద్దరు వ్యక్తులు ఒకరినొకరు నిందించుకుంటూ 'గాడిద కొడకా' అని తిట్టుకున్నారట. పక్కన పోతున్న గాడిద విని 'వీడా నా కొడుకని' ఏడ్చిందట. ఇదొక చాటు పద్య సందర్భం కావచ్చుగాని మాతృమూర్తులు-మహిళలు-ఇదా నా దేశం అని ఏడవవలసిన పరిస్థితే ఈనాడు నెలకొని ఉంది.

నీడ కోసం, భుక్తి కోసం ఎదురు చూస్తూ ఉండాలి;

దేశానికీ పాలకవర్గానికీ విధేయులై ఉండాలి తప్ప, హక్కులు అడగకూడదు "ఎవడబ్బ సొమ్మని కులుకుతూ తిరిగేవు?" అని అలనాటి రామదాసు (కంచర్ల గోపన్న) శ్రీరాముడిని నిలదీయగలిగాడు గాని ఈనాటి ప్రజాస్వామ్యంలో పేదలు పాలకులను నిలదీయలేరు గాక నిలదీయలేరు. నిలదీస్తే నిలబడరు, నిలవరు. ఈ భూమి మీద వారికి నూకలు చెల్లిపోతాయి.

గంగవరం మత్స్యకారులు, తోటపల్లి నిర్వాసితులు, పోలవరం గిరిజనులు, గ్రేటర్ హైదరాబాద్ బాధితులు, ముదిగొండ ఉద్యమ కారులు వీరంతా చెబుతున్న పాఠం అదే.

పాలకవర్గం అసెంబ్లీని ప్రేమిస్తూ ఉంది; పార్లమెంటును ప్రేమిస్తూ ఉంది; అమెరికాను ప్రేమిస్తూ ఉంది. భుక్తి గడవక అరవై సంవత్సరాల స్వాతంత్ర్యం తర్వాత కూడా ఆత్మహత్యలు చేసుకుంటున్న రైతాంగమూ, బీదా బిక్కీ అందరూ మరి పాలకవర్గాన్ని ప్రేమించక చేసేదేముంది? ప్రేమించటానికి దేశమంటే వారే కదా?

★★★

# సంగీత సరస్వతి
# ఎం.ఎస్. సుబ్బలక్ష్మి

వకుళాభరణం లలిత

సంగీతం ఎం.ఎస్. సుబ్బలక్ష్మి దృష్టిలో గౌరవ ప్రదమైంది. తను మొదట ఏ విధంగా కచేరీ చేస్తుందో జీవితమంతా అదే విధంగా సంగీతం కోసం పాటుపడింది. ఆమె కచేరీ చేస్తున్నప్పుడు సూది కూడా కిందపడ్డానికి వీల్లేదు. బెగడ రాగంలో పల్లవిని ఆలపిస్తున్నప్పుడు "కైలాసపతీ, పశుపతే, ఉమాపతే, నమస్తుత్" అని ఆది తాళంలో పాడుతున్నప్పుడు ప్రేక్షకుల మనఃఫలకంలో కైలాసపతి నిండిపోతాడు. అదే ఆమె లయబద్ధంగా అత్యున్నత స్థాయికి పోయి రాగం-తానం - పల్లవి శిల్ప ప్రక్రియలను పాడేవిధానం. ప్రేక్షకుల నుంచి మిన్నుముట్టే కరతాళధ్వనులు వినిపిస్తాయి. ఈ పల్లవి భావాన్ని ఆమె సంగీత మిత్రుడు మూసిరి సుబ్రహ్మణ్య అయ్యర్ నుంచి గ్రహించింది. తిరువలంగాడు సుందరేశ అయ్యర్ వయెలిన్ వాద్యంతో పాటు తాను ఎన్నో సార్లు ఉత్సాహంగా రిహార్సల్ చేసుకున్నందువల్లే భేష్ - భేష్ అనే నినాదాలు నిండిపోయేవి.

అలత్తూర్ సోదరులు లయ పల్లవుల్లో ఖ్యాతి బడిసినవారు. వారు తర్వాతి రోజున ఆమెకు అభినందనలు తెలిపేవారు. ఆమె కచేరీ విధానం వర్ణించడానికి మాటలు చాలవని అనేవారు. రాగం - భావం రెండింటినీ మేళవించి మొత్తం కచేరీ ఒకగొప్ప ప్రదర్శనగా తీర్చిదిద్దడం సుబ్బలక్ష్మికే చెల్లు. అందుకే ఆమె సంగీతం మంత్రం లాగా ఏడుదశాబ్దాల కాలం ప్రేక్షకుల మనస్సుల్లో నిలిచిపోయింది. దక్షిణామూర్తి పిళ్ళై అంటే పుదుక్కోటైలో ప్రఖ్యాతి గాంచిన వాద్యకారుడు. వారింట్లో ఆమె సంగీత కచేరీ చేసింది. అప్పుడు ఎంతో మంది కళాకారులు వచ్చారు. సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్, ముసిరి సుబ్రమణ్య అయ్యర్, చెంబై వైద్యనాథ భాగవతార్, రాజామాణిక్యం పిళ్ళై, రాజరత్నం పిళ్ళై, పాల్ఘాట్ మణి అయ్యర్, జి.ఎన్. బాలసుబ్రమణ్యం, అలత్తూర్ సోదరులు వీరందరినీ ఒక్క సారిగా ఆమె చూచి ధన్యురాలైంది. దక్షిణామూర్తి పిళ్ళై తర్వాతి రోజున 'ఆండవన్! నీ జివితమంతా ఈ విధంగా పాడితే ఏవిధంగా గొంతును కాపాడుకోగలవు! శబ్దం వాద్యగాళ్ళకు వదిలేసి సంగీతజ్ఞులు రాగభావాల మీద కేంద్రీకరించాలి!" అన్నాడు.

కుంజమ్మ కుంచించుకుపోయి తల్లి వెనుక చేరింది. దక్షిణామూర్తి చెప్పిన మాట ఆమె చెవుల్లో రింగుమంటూనే ఉంది. ఆ రోజుల్లోనే అంత గొప్ప మేధావులు సలహా లిచ్చినందుకు ఎంతో గర్వపడింది. ఆనాటి నుంచి ఎక్కడ పాట వినిపించినా ఆమె శ్రద్ధతో వినేది. తల్లి షణ్ముఖ వాదవు, వీణ వాయించేది. వీరికి తోడు తిరుక్కోడి కవల్ కృష్ణ అయ్యర్, మైసూర్ వీణాశేషన్న, పొన్నుస్వామి పిళ్ళై, నయన పిళ్ళై, చిత్తూర్ సుబ్రమణ్యం పిళ్ళై, విజయనగరం వెంకటరమణ దాస్ వీరిముందు పాటపాడాలంటే కొంత తడబాటు గలిగేది. అయితే, ఆమెను అందరూ ప్రోత్సాహపరచి, అభినందించిన వారే. అయినా ధైర్యం వీడలేదు అని చెప్పుకుంటుంది సుబ్బలక్ష్మి. ఆమెకు అరియకూడి రామానుజ అయ్యంగార్ చెప్పిన పాఠాలు గుర్తున్నాయి. చిన్నప్పుడు ఎట్లుండేదానివి అని అడిగితే ఆనాటి ఫోటోలు చూసుకుని నవ్వుకునేది. ఏనాడూ సౌందర్యానికి ప్రాధాన్యాన్నివ్వలేదు. ప్రదర్శనకు వెళ్ళడమంటే




మళ్ళీ కొన్ని మెండల్స్ తేవడమే. విజయం, కీర్తితోటి స్నేహాలు - అభిమానాలు వచ్చేవి. ఒక్కొక్కప్పుడు అసూయలు, ఎత్తిపొడవులు ఎదురయ్యేవి. కానీ సంగీత విద్వాంసులుకానీ, పండితులు కానీ రాజ్య ఉన్నతాధికారులు కానీ చాలా గొప్పగా అభినందించేవారు. ఇతరులు చాలా అందంగా పాడుతుందనీ, మధురమైన గొంతు ఉందనీ అంటూనే సరైన విలువలు లేనందువల్లే ఇంత కీర్తిప్రతిష్టలు వస్తున్నాయని అనుకొనేవారు. దేన్నీ తాను మనస్సులో పెట్టుకోలేదు అని ఆమె తెలిపారు. 1955 నాటికి అత్యున్నత శిఖరాలను ఆమె అందుకుంది. ఆమెను విమర్శించినవారు కూడా మారు మాట మాట్లాడలేక పోయారు.

అత్యున్నతమైన అవార్డులు, గౌరవాలు ఈ కళాకారిణికి దక్కాయి. అంతర్జాతీయ గుర్తింపు కూడా వచ్చింది. దానికి ముఖ్యంగా ఆమె మధురమైన కంఠమే కారణం. స్పష్టంగా సుడులు తిరుగుతున్న ఆమె కంఠం అందరి మనస్సులను చూరగొని, చెవులలో రింగుమనేది. సంగీత వాయిద్యాలు లేకపోయినా ఎంతోమంది ఆమె మధురమైన కంఠాన్ని వినగోరేవారు. దూరదర్శన్ ఆమె పాటలను ప్రసారం చేసింది. ఎన్నో జన్మల పుణ్యఫలం వల్ల తేనె కంటే తియ్యనైన కంఠం ఆమెకు లభించిందని ఆమె భక్తులు అనుకునేవారు. మూడుతరాల స్త్రీ పురుషులు ప్రపంచమంతా ఆమె పాటను వినగల, అనుభవించగల అదృష్టం ఉందంటే, దానికి కారణం మృధుమధురమైన ఆమె గాత్రమే. ఆమెను పెద్దవారు, యువతరం, తనతోటి కళాకారులు, సన్యాసులు, మత రాజకీయ నాయకులు, శాస్త్రవేత్తలు ఒకరేమిటీ ప్రపంచమంతా ఆమె సంగీతంలో ఉర్రూతలూగింది.

రాజులు, రాజ్యాధిపతులు ఆమెకు నమస్కరించారు. ఉదయపూర్ మహారాణి "పూర్వంలో కళ్యాణి రాగం కోసం ఈ రాజ్యాన్నంత ధారపోసి ఉండేవాణ్ణి. ఇప్పుడు నా కున్న గుర్రాలు, ఏనుగులు మొదలైన సర్వసంపదను మీకు అర్పించగలను" అని అంటారు. ప్రజలకు ఎన్ని బాధలు కలిగినా, ఎన్ని ఇక్కట్లు వాటిల్లినా, సుబ్బలక్ష్మి గాత్రం విని తమ సమస్యలను మరచిపోయేవారు. ఉత్తర హిందూస్థానం వారు కర్ణాటక సంగీతానికి ఎక్కువ ప్రాముఖ్యానిచ్చేవారు. కానీ సుబ్బలక్ష్మి జలంధర్, జైపూర్, కాన్పూర్, భోపాల్, పూనే, బరోడా ప్రాంతాల్లో ఎంతో విఖ్యాతి గాంచింది. త్యాగరాజు నుంచి యోగ నరసింహం వరకు ఎంతమంది ఎన్ని పాటలుపాడినా ఆమెకు మరీ గుర్తింపు మీరా భజనలతో వచ్చింది.

భారతదేశ నైటింగేల్‌గా ప్రఖ్యాతి గాంచిన సరోజిని నాయుడు ఆమెతో "భారతదేశం ఈ తరంలో ఇంత ఉత్కృష్టమైన కళాకారిణిని ఇవ్వగలిగిందంటే ఇది దేశమంతా గర్వించదగ్గ విషయం" అన్నారు. తర్వాత ఆమె మీరా భజనలతో ప్రారంభమై తులసీదాస్, కబీర్, సూర్‌దాస్, నానక్, తుకారాం భజన్లను దేశానికి ఇవ్వగలిగింది. 1930లో ద్విజేంద్రలాల్ రాయ్ కలకత్తాలోను, కాశీలో సిద్దేశ్వరీ నుంచి ఆమె ఎన్నో పాటలు నేర్చుకుంది. ఖయాల్లు, తుమ్రీలు ఇవన్నీ ఆమె నేర్చుకుంది. సిద్దేశ్వరీదేవి తుమ్రీలు, టప్పాలు నేర్పించింది. ఎం.ఎస్. సుబ్బలక్ష్మి కచేరి పెట్టడమంటే వధూవరులను దీవించడంగా ఉత్తర భారతదేశంలో భావిస్తారు. బడే గులాం అలీఖాన్ ఆమెను "సుస్వర లక్ష్మి-సుబ్బలక్ష్మి" అని అభివర్ణించాడు. రవిశంకర్, పండిట్ జస్‌రాజ్ వరకు, హంజద్ అలీఖాన్, విలాయత్ ఖాన్ అందరూ చేతులు జోడించి ఆమెకు నమస్కరించిన వారే.

ఈ గుర్తింపు కలకత్తా స్టూడియోలో 'సావిత్రి' అనే సినిమాలో ధరించిన 'నారద' పాత్రతో వచ్చింది. అట్లే ఎంతో మంది ప్రముఖులైన కళాకారులు కె.ఎల్.సైగల్ పహారీసన్యాల్, ఖన్నన్‌బాల, కీస్కర్, పన్నాలాల్ ఘోష్, దిలీప్ కుమార్‌రాయ్ మొదలైన వారంతా ఆమెను శ్లాఘించినవారే.

దిలీప్ కుమార్ రాయ్ ఆమెకు భజనలు, రబీంద్ర సంగీతం నేర్పించారు. మీరా సినిమాలో పాటలు విన్నప్పుడు కూడా అందరూ ఆ సంగీతామృతాన్ని గ్రోలినవారే.

లతామంగేష్కర్ కూడా సుబ్బలక్ష్మి గాత్రానికి అచ్చెరువొందింది. ఇతర దేశాల్లో వాయిద్య సంగీతానికి ప్రాముఖ్యం ఉన్నా, ఎం.ఎస్. సుబ్బలక్ష్మి సంగీతానికి మాత్రం ఎలాంటి అభ్యంతరాలు లేవు. న్యూయార్క్ వార్తాపత్రిక ఎం.ఎస్.ని శ్లాఘించింది. ఆ పత్రిక సుబ్బలక్ష్మి పాట పదాలకు అతీతమని, ఆమె కంఠమే ఎన్నో వాయిద్యాలకు సమానం అని తెలిపింది. వాషింగ్టన్ సంగీత ఆచార్యుడు డబ్ల్యు. అడ్రియాన్స్ "సంగీతానికి ఆమె నిధి" అని వర్ణించాడు. మాస్కోలో గానీ, ఏదేశంలో కాలుపెడితే ఆదేశంలో గానీ, సంగీతజ్ఞులందరూ ఆమెను అభివర్ణించడమే. అంత మాధుర్యం రావడానికి కారణం ఆమె భక్తిగీతాలను అత్యంత శ్రద్ధాసక్తులతో పాడడం. చైతన్య, జయదేవ, బసవన్న, అక్కమహాదేవి మొదలైన భక్తిగీతాలను పాడడంలో మాధుర్యంతో పాటు ఆధ్యాత్మికత మేళవించడం ఒక ప్రధాన అంశంగా భావించారు.

నిత్య జీవితంలో దక్షిణ భారత దేశ గృహిణి, మాతృమూర్తి, నాయనమ్మ, ఎన్ని వేలమంది అభినందనలు తనకు లభించినా వ్యక్తిగత జీవితంలో అతిథి, అభాగ్యతులను ఎంతో ఆదరంతో చూసేవారు. ఇంటిముందు ముగ్గువేయడం మొదలు అన్ని పనుల్లోను అత్యంత శ్రద్ధాసక్తులతో చూసుకునేవారు. దేవుని ప్రార్థించడం, శ్లోకాలను చదవడం, అత్తమామలను సేవించడం అన్నీ మామూలుగా జరిగిపోయేవి. ఆమెభర్త సదాశివం ఆమెకు జీవితంలో స్నేహితుడు, మార్గదర్శకుడు. 1916 షణ్ముఖ వడైవుకు పుత్రికగా మధురలో పుట్టి, సంగీతంలో మునిగి బాల్యంలోనే సంగీతంలో శిక్షణ పొందడం గొప్ప విషయం. మధురమీనాక్షి ఊరేగింపులో ఊదే నాదస్వరం అంటే కుంజమ్మకు ఎంతోప్రీతి. తర్వాత తన జీవితంలో గమకాలు, ప్రయోగాలను వీణపై, నాదస్వరంపై ప్రయోగించడానికి బాల్యంలో వచ్చిన ఈ అనుభవమే నాంది కావచ్చు. తల్లి వీణాపాణి అయినా, తాను గాత్ర సంగీతంలో ప్రతిభాశాలి అయింది. ఆమె చిన్నప్పటి నుంచి యోగనిష్ఠగల వ్యక్తి. ఇంతగొప్ప గాత్రం రావడానికి కారణం ఆమె క్రమశిక్షణయే. గ్రాంఫోన్ రికార్డులో కూడా ఆమె పాటను రికార్డు చేసుకుంటూ కొన్ని గంటలు పాడేది. పదో సంవత్సరలోనే ప్రారంభమైన ఆమె సంగీత యాత్ర 15వ సంవత్సరం వచ్చేనాటికి అనుకోని రీతుల్లో అభివృద్ధి చెందింది.

భర్త సదాశివంకు ఆమెకు భావిలో ఏవిధంగా రూపుదిద్దుకోవాలో అనే ఆలోచన ఉండేది. ఆయన స్వాతంత్ర్య సమరయోధునిగా జాతీయ గీతాలను ఆలపించేవాడు. ఆర్థిక ఇబ్బందుల వల్ల కొన్ని సినిమాల్లో నటించినా, పాతివ్రత్య ధర్మానికి పాటలు పాడడం, ఉత్తేజ పరచడం అంటే సదాశివానికి కూడా ఆసక్తి ఉండేది. సదాశివం ఆమె ఏప్పుడు ఏమి చెయ్యాలో ఎవరిని కలుసుకోవాలో చెప్పేవాడు. కొన్ని కొన్ని ముఖ్యమైన సంస్మరణ కార్యక్రమాలకు కూడా కచేరీల ద్వారా లభించే ధనాన్ని వినియోగించేవారు.

కంచివరమాచార్య ఈమెను సూర్యచంద్రులు ఆకాశంలో ఉండేవరకు నీకీర్తి ప్రతిష్టలు భూమిపై ఉంటాయి, అని ఆశీర్వదించారు. కొత్తపాట పాడడమంటే గొప్ప అనుభవం. తమిళం, తెలుగు, మళయాళం, సంస్కృతం, హిందీ అన్నింట్లో కూడా ఈమె పాటలు పాడేది. అన్నమాచార్యపాటలు పాడేటప్పుడు తిరుమల తిరుపతి దేవస్థానానికి వచ్చి తెలుగులో ఎలాపాడాలో నేర్చుకుని ఆవిధంగా పాడేది. ఎంతమంది దగ్గరో నేర్చుకున్న సంగీతం ఆమెను ఒక విద్వన్మణిగా తీర్చిదిద్దింది. మైసూర్ వాసుదేవచార్ ఈ విధంగా అన్నాడు "ఆమెకు నల్లపూసలు, మట్టిగాజులతో వివాహమై ఈనాడు జిగేల్ మనే రవ్వలతో, పట్టుచీరలతో మెరిసిపోతోంది" ఎప్పటికప్పుడు ఆమె ఆత్మపరిశీలన చేసుకునేది. సెమ్మంగుడి గురువుగారు ఈ విధంగా అన్నారు. ఇంకే స్త్రీ కూడా తానం ఆమెలా పాడలేరు. సంగీత సామ్రాజ్యంలో స్త్రీలలోనే ప్రత్యేకం. నేను చూచిన అందరిస్త్రీ గాయనీ మణుల్లో ఆమె చాలా ఉన్నత శిఖరాలు అందుకున్న గాయనీమణి". ఆ విధంగా ఆమె విద్వత్ లయజ్ఞానం అనుస్వరాలను కూర్చడం, సంగతులను వేయడం [illegible] ాలల్లో విశిష్టమైన గాయనీ మణి. ఇంత గొప్ప సంగీత సరస [illegible] పునర్జన్మ అనేది ఉండదు.

పుట్టుకతోనే [illegible] తిభలు కలిగిన గాయనీమణి ఆమె బాణి ప్రత్యేకమైంది. [illegible] సంగీతంలో వెలిబుచ్చగల భావం అత్యద్భుతమైంది.

ఆమె దీక్ష అనంతం. దీనికి కారణం ఆధ్యాత్మిక ధోరణితో పూర్తిగా ఆమె మమేకం కావడమే. నిరాడంబరత, పట్టుదల, ఓర్పు అంతగొప్ప గాయనీ మణిగా తీర్చిదిద్దడానికి సానుకూలమైంది.

★★★

# పాతివ్రత్య నియమం

గోపాలుని విజయలక్ష్మి

"అత్తయ్యా! మీరు కూడా పిల్లల్తోపాటు అన్నం తినెయ్యరాదూ! మళ్ళీ ఒక్కరే తినాలంటే బద్ధకించి మానేస్తారు" దమయంతమ్మను అడిగింది సుమతి.

"మీ మామయ్య వస్తారేమో చూసి అప్పుడు తింటాలే. తీరా నేను తినేశాక వస్తే బాధనిపిస్తుంది" అంది దమయంతమ్మ.

"అంతా మీ పిచ్చిగానీ ఆయన ఏ పూట వస్తారో, ఏ పూట రారో ఆయనకే తెలీదు. అలాంటి మనిషి కోసం కాచుక్కూర్చోటం, తీరా ఆయన రాకపోతే తిండి తినకుండా పడుకోవటం మీకు బాగా అలవాటైంది. కానీ మీ వయసుకి యిలా పస్తులుండటం అంత మంచిది కాదు తెలుసా?" సుమతి గొంతులోని మందలింపుకి దమయంతమ్మ పెదవుల మీద చిరునవ్వు చోటుచేసుకుంది. దమయంతమ్మకి పెళ్ళయి దాదాపు నలభై ఏళ్ళు దాటుతోంది. ఆమెని యింతప్రేమగా పలకరించిన వాళ్ళుగానీ, ఆప్యాయంగా మందలించిన వాళ్ళుగానీ యిప్పటి దాకా ఎవరూ లేరు. అందుకే సుమతి మందలింపులోని ప్రేమ ఆమెకి అంత సంతోషాన్ని కలిగిస్తుంది.



సుమతి పిల్లలకి అన్నం పెట్టుకురావటానికి వంటగదిలోకి వెళ్ళిందేగానీ ఆమె ఆలోచనలన్నీ అత్తగారి గురించే.

సుమతికి పెళ్ళయి పదేళ్ళయింది. మొదటి రెండేళ్ళు అత్తమామలతో కలసి వైజాగ్‌లోనే వుండేవాళ్ళు సుమతి, ఆమె భర్త, ఆ తర్వాత వాళ్ళ ఆయన ఉద్యోగ నిమిత్తం బెంగుళూరు వెళ్ళాల్సివచ్చింది. కానీ ఆ రెండేళ్ళల్లోనే ఆమెకి ఆ యింటి పరిస్థితులు, ఆయింట్లో దమయంతమ్మ స్థానం ఏంటో పూర్తిగా అర్థం అయింది.

సుమతి మామగార్కి దమయంతమ్మ కాక మరో భార్య, సంసారం వున్నాయి. అంటే చిన్నిల్లన్నమాట. ఆయన ఆమె దగ్గరే ఎక్కువగా వుంటాడు. ఆయన ఆమెని పెళ్ళి చేసుకున్నాడో లేదో సుమతికి తెలీదు. సుమతికి మాత్రం మామగారి పద్ధతి అసలు నచ్చేదికాదు. దానికి తోడు ఆయన ఏనాడు దమయంతమ్మని భార్యగా ప్రేమించింది గానీ ఆదరించిందిగానీ లేదు. భర్తగా అధికారం మాత్రం చెలాయించేవాడు. చాలాసార్లు రాత్రిళ్ళు వాళ్ళ గదిలోంచి పెద్దపెద్దగా అరుపులు వినిపించేవి దాన్ని బట్టి వాళ్ళిద్దరూ బాగా గొడవ పడుతున్నారని సుమతికి అర్థం అయ్యేది. అలాంటి సందర్భాల్లో ఒక్కోసారి ఆయన దమయంతమ్మ మీద చేయి చేసుకునేవారు.

ఇవన్నీ చూస్తూ సహించలేకపోయేది తను. అందుకే తరచూ భర్తని నిలేసేది. "మీ నాన్నగారి పద్ధతి నాకేం నచ్చట్లేదు. అసలు పరువు మర్యాద కలవాళ్ళెవరికీ ఆయన చేసే పన్లు మంచిగా అనిపించవు. కొడుకై వుండి కనీసం మీరన్నా ఆయనకి తను చేసేది తప్పని, దానివల్ల పరువు ప్రతిష్ఠ మంట కలసి పోతున్నాయని ఎందుకు చెప్పలేరు? కనీసం మీ అమ్మగారి పరిస్థితి చూసైనా మీకు బాధనిపించదా! ఆమెకి న్యాయం చేయాలని, ఆమెని సుఖపెట్టాలనే ఆలోచన కొడుగ్గా మీ కెప్పుడూ అనిపించదా?" అంటూ నిలేసేది.

కానీ అతని సమాధానం మాత్రం ఎప్పుడూ ఒక్కటే. "మా నాన్నంటే మా అందరికీ ఎంతో గౌరవం. ఆయన నాకంటే ఎంతో పెద్దవాడు. అందుకే ఈ విషయం ఆయనతో ప్రస్తావించటానికి గానీ, ఆయన్ని మందలించటానికి గానీ నేను సాహసించలేను" అని.

అతని నోటి నుంచి తండ్రి మీద 'గౌరవం' అనే మాట వినేసరికి సుమతికి చాలా ఆశ్చర్యం వేసింది. అంటే మనం గౌరవించేది మనిషి వయసునే తప్ప వాళ్ళ ప్రవర్తనని కాదన్నమాట. అలా అనుకోగానే ఆమెకి వెంటనే మరో ఆలోచనకూడా వచ్చేది. అతని తండ్రి చేస్తున్న తప్పే తల్లి కనక చేస్తుంటే ఆమెని కూడా యిలాగే గౌరవించి అభిమానించే వాడేనా? అని.

ఇక దమయంతమ్మ విషయానికొస్తే ఆమె మనసులో ఏముందో ఆ భగవంతుడికే తెలియాలి. ఆమె తన భర్తని గురించి ఎవరి దగ్గర ఏనాడూ పల్లెత్తుమాట అని ఎరుగదు. ఆమె ఆయన్ని గౌరవిస్తోందో,

ప్రేమిస్తోందో, ద్వేషిస్తోందో కూడా సుమతికి అర్థం అయ్యేది కాదు. కానీ దమయంతమ్మ నోరు విప్పి ఏమీ చెప్పక పోయినా, ఆమె గుండెలోని భావాల్ని ఆమె కళ్ళల్లో స్పష్టంగానే చూడగలిగేది సుమతి ఆ కళ్ళల్లోని నిరాశ, నిర్లిప్తత చూస్తుంటేనే సుమతికి గుండె కోసినట్టు వుండేది.

సుమతి పళ్ళెంలో అన్నం పెట్టుకుని హాల్లోకొచ్చింది. అప్పటికే పిల్లలిద్దరూ స్కూల్ బ్యాగ్స్ సర్దేసి నాయనమ్మ దగ్గర చేరారు కథ చెప్పమంటూ సుమతి చేతిలో పళ్ళెం క్రింద పెట్టి కూర్చుంటూ "ఈ రోజు మీకు కథ నేను చెప్తాను రండి" అంది.

"నువ్వొద్దు నాయనమ్మయితే మంచి మంచి పురాణం కథలు చెప్తుంది." అన్నారు పిల్లలిద్దరూ ఒకేసారి.

"ఓ.కె. నేను కూడా పురాణంలోని మంచి కథే చెప్తాను రండి" అంది.

"ఏం కథ చెప్తావ్" అడిగారు ఆరేళ్ళ నవీన్.

"సతీసుమతి కథ"

"అంటే నీ కథే అన్నమాట" నవ్వుతూ అంది ఎనిమిదేళ్ళ సుమన.

"అవును. నా కథే. చెప్తాను రండి" అంది సుమతి. పిల్లలిద్దరూ వచ్చి ఆమె ఎదురుగా కూర్చున్నారు.

సుమతి పిల్లలిద్దరికీ అన్నం పెడుతూ కథ చెప్పటం మొదలు పెట్టింది.

"అనగనగా ఒక ఊళ్ళో ఒక అమ్మాయి వుండేది. పేరు సుమతి. ఆమె చాలా అందంగా ఉండేది. అందంతో పాటు గుణం కూడా చాలా మంచిది. ఆ అమ్మాయికి యుక్తవయస్సు రాగానే వాళ్ళ తల్లితండ్రులు ఆమెకి పెళ్ళి చేశారు. కానీ దురదృష్టం కొద్దీ ఆమె భర్తకి కుష్టువ్యాధి వుంది"

"అబ్బో! కుష్టువ్యాధా?" పిల్లలిద్దరూ ముఖం అసహ్యంగా పెట్టి అన్నారు.

"ఔను! కుష్టువ్యాధే. ఆ వ్యాధివల్ల అతను కదల్లేడు, మెదల్లేడు. కనీసం తన పని కూడా తను చేసుకోలేడు. ప్రతిదానికి భార్య మీదే ఆధారపడేవాడు. అలాంటి భర్తని సుమతి ఎంతో ప్రేమగా చూసుకునేది. అతను అన్ని పన్లకి ఆమె మీదే ఆధారపడ్డాడు కదా! పొరపాటుగా అయినా అతన్ని నిర్లక్ష్యం చేస్తే ఎక్కడ బాధపడతాడో అని సుమతి అతని పన్లన్ని ఎంతో ప్రేమతో, శ్రద్ధగా చేసేది. భర్త వల్ల తనకి ఎటువంటి సుఖం, ఆనందం లేకపోయినా సుమతి వాటిని మనసులోకి రానిచ్చేది కాదు. అతన్ని ఎక్కడికైనా తీసుకువెళ్ళాలంటే ఒక తట్టలో కూర్చో పెట్టుకుని దాన్ని నెత్తిన మోసుకుంటూ వెళ్ళేది. అంత ఓర్పుతో భర్తకి సేవలు చేసింది కాబట్టే ఆమెని 'సతీసుమతి' అని, మహా పతివ్రత అని చెప్పుకునేవాళ్ళు.

ఒక రోజు సుమతి తన భర్తని తట్టలో కూర్చో పెట్టుకుని, దాన్ని తలమీద పెట్టుకొని మోసుకెళ్తూ వుండగా దారిలో వాళ్ళకి ఒక అందమైన అమ్మాయి ఎదురైంది. సుమతి భర్త ఆమెని చూసి "ఆ అమ్మాయి ఎంతో అందంగా వుంది. ఆమె నాకు కావాలి" అని సుమతిని అడిగాడు. కానీ మంచి చెడులు బాగా తెలిసిన సుమతి "మీరిలా పరస్త్రీని కోరటం చాలా తప్పు. పరస్త్రీ తల్లితోనూ, చెల్లితోనూ సమానం. పరస్త్రీలని మోహిస్తే పాపం చుట్టుకుంటుంది. అని ఎంతోసేపు భర్తకి నచ్చ చెప్పింది. అయినా అతను వినలేదు. భర్తననే అహంకారంతో తనని ఆ స్త్రీ దగ్గిరకి తీసుకు వెళ్ళాలని సుమతిని ఆజ్ఞాపించాడు.

దాంతో సుమతికి బాగా కోపం వచ్చింది. ఆమె మహాపతివ్రత కదా! అందుకని వెంటనే భర్తని శపించింది. "ఏ కామంతో అయితే పరస్త్రీ తల్లితో సమానమని తెలిసి కూడా కోరుకుంటూన్నావో ఆ కామమే నిన్ను దహించుగాక" అని అంతే! ఆమె భర్త మాడి మసైపోయాడు.

ధర్మం కోసం తన భర్తనే భస్మం చేసింది కాబట్టే ఆమెని యిప్పటికి మహా పతివ్రతగా చెప్పుకుంటారు". కథ చెప్పటం ఆపి క్రీగంట దమయంతమ్మ వైపు చూసింది సుమతి.

కథ విన్న దమయంతమ్మ ముఖంలో ఆశ్చర్యంతోపాటు ఏదో కలవరపాటు కూడా స్పష్టంగా కనబడింది.

"కథ ఎలా వుంది? బాగుందా?" పిల్లలిద్దర్ని అడిగింది సుమతి.

"మా కస్సలు బాగుండలేదు. అసలు అర్థమే కాలేదు" కోరస్‌గా అన్నారిద్దరూ.

"ఎందుకని అర్థం కాలేదు"? మృదువుగానే అడిగింది సుమతి.

"సుమతి పతివ్రత అని చెప్పావు కదా! మరి పతివ్రతలు ఎక్కడన్నా భర్తని బూడిద చేస్తారా? అందుకే కథ నచ్చలేదు" అంది సుమన.

"ఓ అదా! ఇంతకు ముందు నాయనమ్మ మీకు సావిత్రి, అనసూయ, రేణుకాదేవి వీళ్ళందరి కథలు చెప్పారు కదా! అవి అర్థం అయ్యాయా? అడిగింది సుమతి.

"ఓ ! చాలా బాగా అర్థమయాయి" అన్నాడు నవీన్.

"మరి ఈ కథ ఎందుకు అర్థం కాలేదు? రేణుకా దేవి ఇసుక కుండతో నీళ్ళు తెస్తూ ఆకాశంలోని గంధర్వుల్ని చూసి 'ఎంత అందంగా వున్నారు? అనుకున్నందుకే కదా ఆమె పాతివ్రత్యం దెబ్బతిని ఆమె చేతిలోని ఇసుక కుండ పగిలిపోయింది. అదిచూసిన జమదగ్నికి ఆమె పరపురుషుడిని చూసి మోహించిందనే విషయం అర్థం అవుతుంది. కేవలం గంధర్వుల్ని చూసి 'అందంగా వున్నారు' అనుకున్నందుకే ఆమె తప్పు చేసిందని కొడుకు చేత భార్య తల నరికించేశాడు కదా జమదగ్ని మహర్షి? పిల్లలిద్దరి వంకా చూస్తూ అడిగింది సుమతి.

"అవును" అన్నారిద్దరూ ఒకేసారి.

"మరి సతీసుమతి చేసింది కూడా అదే కదా! పరస్త్రీని మోహించినందుకు భర్తనే బూడిద చేసింది. మరి ఈ కథ ఎందుకు అర్థం కాలేదు?"

"ఏమో! అయినా మాకీ కథంతా అయోమయంగా వుంది" అంది సుమన అదోలా ముఖం పెట్టి.

"ఫర్వాలేదులే. మళ్ళీ రేపు యిదే కథ మీకర్థం అయ్యేట్టు చెప్తాను. నాయనమ్మ చెప్పిన కథలన్నీ తరతరాల్నించి చెప్పుకుంటున్న పాత కథలు కదా! అందుకని అవి మీక్కూడా వెంటనే అర్థం అయ్యాయి. కానీ నేనిప్పుడు చెప్పింది కొత్త కథ కదా! అందుకు అర్థం అవటానికి

కొంత టైం పడుతుంది. వినగా వినగా అవి కూడా కొన్నాళ్ళకి బాగానే అర్థమవుతాయి. మీకర్థమయేదాకా నేను ఓర్పుగా చెప్తూనే వుంటాను. సరేనా?" పిల్లల బుగ్గల మీద ముద్దు పెడుతూ చెప్పింది సుమతి.

కానీ పిల్లల ముఖంలో అసంతృప్తి మాత్రం పోలేదు. అమ్మ ఫీలవుతుందని పైకి మాత్రం 'అలాగే' అంటూ తలలూపారు.

సుమతిలేచి పిల్లలకి పక్కలువేయటానికి గదిలోకివెళ్తూ"నాయనమ్మకి గుడ్‌నైట్ చెప్పి ముద్దు పెట్టిరండి. పడుకుందురుగాని" అంది.

దమయంతమ్మకి సుమతి చెప్పిన కథ విన్నాక మనసులో చిన్న భయం ఆవహించింది. వెంటనే ఆమెకి కొడుకు గుర్తొచ్చాడు. అంతే! ఒక్క క్షణం ఉలిక్కి పడింది. ఒక్కసారి గతంలోకి వెళ్ళింది.

సుమతి పదిరోజుల క్రితమే సడెన్‌గా పిల్లల్ని తీసుకుని బెంగుళూరు నుంచి దిగింది. మొదట ఆమెని చూడగానే దమయంతమ్మ ఆశ్చర్యపోయింది. తర్వాత మాటల మధ్యలో సుమతి చెప్పింది. బెంగుళూరు వాతావరణంలో పిల్లల్ని పెంచటం అంత మంచిది కాదనిపించి వాళ్ళని తీసుకుని వైజాగ్ వచ్చేశానని. దమయంతమ్మకి వైజాగ్ తప్ప వేరే ప్రపంచం తెలీదు. అందుకే సుమతి చెప్పింది విని వూరుకుంది. కానీ సుమతి వచ్చి పది రోజులైనా కొడుకు దగ్గర్నుంచి ఫోన్‌గానీ, లెటర్ గానీ లేదు. దాంతో ఆమెకి రకరకాల అనుమానాలు రాసాగాయి. ఇక వుండబట్టలేక సుమతినే అడిగింది. "నువ్వొచ్చి పది రోజులైనా మీ ఆయన దగ్గర్నుంచి ఫోన్ గానీ, లెటర్ గానీ లేవేంటి? ఇదంతా చూస్తుంటే నాకేదో అనుమానంగా వుంది. మీ యిద్దరి మధ్య గొడవలేమీ లేవు కదా! ఇలా అడిగానని వేరేగా అనుకోకు. తెల్లవారి లేచిందగ్గర్నుంచి, రాత్రి పడుకునేదాకా ప్రతిదాని గురించి ఒకళ్ళ నొకళ్ళు ఫోన్లతో సంప్రదించుకునే రోజులు. అలాంటిది పెళ్ళాం వూరెళ్ళి పదిరోజులైనా అటు వాడు గానీ, ఇటు నువ్వు గానీ ఫోన్ చేయకపోవటం చూస్తుంటే ఏదో భయంగా వుంది. అందుకనే యింతలా నిలేసి అడుగుతున్నాను."

దమయంతమ్మ మాటలు విని సుమతి నవ్వింది. "అత్తయ్యా! నిజంగా మీరు ఇంటలిజెన్స్ డిపార్ట్‌మెంట్‌లో వుండాల్సింది. ఇప్పుడు నా సంసారానికి వచ్చిన కష్టం ఏమీ లేదు. మీ అబ్బాయిప్పుడు ఒక క్రొత్త ప్రాజెక్ట్‌లో వున్నారు. అందుకని ప్రస్తుతం ఆయనకి ఫోన్ చేసే టైం కూడా వుండదు. దీని గురించి మీరేం ఖంగారు పడాల్సిందిలేదు! అంది.

రెండు మూడు రోజుల్నుంచి సుమతి ఉద్యోగ ప్రయత్నాలు కూడా మొదలు పెట్టింది. అదేమంటే "ఇంట్లో కూర్చుంటే బోర్‌గా వుంది. ఇంత చదువుకుని నేను కూడా మీ లాగా ఖాళీగా కూర్చుంటే ఏం బాగుంటుంది. చెప్పండి" అంది నవ్వుతూ.

కానీ యిప్పుడు సుమతి చెప్పిన కథ విన్నాక దమయంతమ్మకి అనుమానంతోపాటు భయం కూడా మొదలైంది. "అసలు తన కొడుకు ఏమైనట్టు?" ఆమె గుండె వేగంగా కొట్టుకోవటం మొదలెట్టింది.

పిల్లల్ని నిద్రపుచ్చి సుమతి బెడ్ రూంలోంచి హాల్లోకి వచ్చింది.

"సుమతీ ఇలారా!" దమయంతమ్మ గొంతులో ఇన్నేళ్ళల్లో ఎప్పుడూ వినబడని గాంభీర్యంతో కూడిన అధికారం ధ్వనించింది.

"చెప్పండత్తయ్యా! ఏంటి?" దగ్గరకొచ్చి కూర్చుని అడిగింది సుమతి.

"నా కొడుకు ఎక్కడ వున్నాడు? ఎలా వున్నాడు" సుమతి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ నిలేసినట్టు అడిగింది దమయంతమ్మ.

"అత్తయ్యా! పౌరాణిక ఫక్కీలో చెప్పనా జానపద ఫక్కీలో చెప్పనా?" నవ్వుతూ అడిగింది సుమతి. కానీ ఆ నవ్వులో ఎంతో వ్యంగ్యం వుంది.

దమయంతమ్మ ఏమీ మాట్లాడలేదు. 'తనకి కావల్సింది సమాధానం అంతే. అన్నట్టు చూసింది సుమతివంక.

సుమతి గొంతు సవరించుకుని పౌరాణిక ఫక్కీలో "అత్తయ్యా! సకలగుణాభిరాముడు, సౌశీలుడు, తంద్రియందు అమిత గౌరవాభిమానములు కలవాడు అయిన నీ కుమారుడు తన రెండవ భార్యతో బెంగుళూరు నగరంలో సుఖసంతోషములతో తేలియాడుచున్నాడు. అని చెప్పింది. సుమతి ఆ మాటలు చెప్పేటప్పుడు తన బాధ బయటకి తెలియకుండా ఎంత సహజంగా వుండాలని ప్రయత్నించినా ఆమె గొంతులోని సన్నని జీర ఆమె గుండెలోని బాధకి సంకేతమయింది. ఆ మాటలు విన్న దమయంతమ్మ షాక్ అయ్యింది. "ఏంటి? వాడు మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడా? ఎప్పుడు చేసుకున్నాడు? అయినా నువ్వీ విషయం రాగానే నాకెందుకు చెప్పలేదు. ఎందుకు దాచావ్?" సుమతి మీద ప్రశ్నల వర్షం కురిపించింది.

సవతిపోరు ఎంత దుర్భరమైందో దమయంతమ్మకి బాగా తెలుసు. ఆ నరకాన్ని ఆమె ముప్పై ఏళ్ళ నుంచి అనుభవిస్తోంది. ఒక్కసారిగా దమయంతమ్మ గుండె చెరువై చెక్కిళ్ళ మీదగా ప్రవహించటం మొదలు పెట్టింది.

"ఎందుకత్తయ్యా ఏడుస్తారు? ఆయన చేసిన పని మనకి కొత్తేం కాదుగా. ఆయన కూడా తండ్రి అడుగుజాడల్లోనే నడుస్తున్నాడు. పాపం తండ్రి అంటే ఆయనకి ఎంతో గౌరవం కదా!" ఆ తర్వాత సుమతి మాట్లాడలేకపోయింది. ఇన్నాళ్ళు తను కూడకట్టుకున్న ధైర్యం, ఆత్మ విశ్వాసం దుఃఖం రూపంలో కరిగి పోవటం ఇష్టం లేదామెకి. అందుకే మౌనంగా వుండి పోయింది.

ఇద్దరి మధ్య కొన్ని నిమిషాలు మౌనంగా దొర్లిపోయాయి. దమయంతమ్మ పమిటచెంగుతో కళ్ళు తుడుచుకుంటూ అడిగింది. "అసలిదంతా ఎలా జరిగింది? అసలు వీడికి ఆ అమ్మాయితో పరిచయం ఎక్కడ అయింది? వీడికి పెళ్ళయి, పిల్లలున్నారనే విషయం ఆ అమ్మాయికి తెలుసా?"

"నా క్కూడా అన్నీ అయిపోయాకే తెలిసిందత్తయ్యా! కానీ మీలాగా ఆ వివరాలన్నీ తెలుసుకోవాలనే ఆసక్తి మాత్రం నాకు లేదు. ఒకవేళ మనం అడిగినా వాళ్ళు నిజం చెప్తారా? అనుకోకుండా జరిగిందనో, తెలీకుండానే తప్పు చేశామనో వాళ్ళు చెప్పే అబద్దాలు వినాలనే కోరికగానీ, వినే ఓపికగానీ నాకులేదు. అందులో నిజం ఎంత వుంటుందో మనకి తెలుసు. ఇప్పుడు నేను ఆలోచించాల్సింది నా గురించి, నా బిడ్డల భవిష్యత్తు గురించి, ఈ పరిస్థితుల్లో నాకిది ఆలోచించటం ముఖ్యం. అందుకే బాగా ఆలోచించి నిర్ణయం తీసుకున్నాను. ఇక్కడ మీతోనే వుండిపోటానికి వచ్చాను" అంది సుమతి.

"నువ్వు తొందరపడుతున్నావేమో అనిపిస్తోంది. ఒక్కమాట మాతో చెప్పివుంటే బాగుండేది. అక్కడికి వచ్చి నేను, మీ మామయ్య పరిస్థితుల్ని చక్కబెట్టేందుకు ప్రయత్నించే వాళ్ళం" దమయంతమ్మ మాటలు పూర్తి కాకముందే సుమతి పకపకా నవ్వింది.

ఆ నవ్వు వెనక ఎంతో వ్యంగ్యం వుంది. మరెన్నో ప్రశ్నలు వున్నాయి. అవన్నీ దమయంతమ్మని నిలదీసినట్టు అనిపించింది. దమయంతమ్మ చేసేది లేక తలదించుకుంది.

దమయంతమ్మ అలా తలదించుకుని కూర్చోవటం చూసిన సుమతికి భాదనిపించింది. పాపం, ఈవిడ మాత్రం ఏం చేస్తుంది. తను అనవసరంగా ఆవిడని బాధపెట్టానేమో! అనుకుంది మనసులో. అందుకే దమయంతమ్మ గారి చేతిని తనచేతిలోకి తీసుకుంటూ చెప్పింది. "ఎందుకు అత్తయ్యా! మీరు తలదించుకుంటారు. మీరు ఈ రోజు కొత్తగా చేసిన తప్పేముంది? యుగయుగాలుగా స్త్రీలందరూ చేసేపనే నన్నూ చేయమన్నారు అంతేగా. మగ వాడు ఎంత కొట్టినా, తిట్టినా, మనముందే పరాయిస్త్రీలతో సంబంధం పెట్టుకున్నా మనం సర్దుకుపోవటం అలవాటు చేసుకోవాలి. అదేగా మీరు చెప్పాలనుకునేది. అయినా ఈ రోజు మీరు ఇలా తలదించుకోవాల్సిన పని లేదు. ఎందుకంటే ఐదుగురు స్త్రీల పేర్లు చెప్పి, వారినే నిత్యం స్మరించినట్టయితే స్త్రీలు పుణ్యలోకాలు చేరుకుంటారని పురాణాల్లో చదివినప్పుడే మనందరం తలదించుకోవాల్సింది. ఎందుకో చెప్పనా? వాళ్ళల్లో ఒక స్త్రీ జూదంలో పణంగా పెట్టబడి, నిండుసభలో వస్త్రా పహరణానికి గురైంది. ఆ క్షణమే స్త్రీజాతి అంతా తలదించుకుంది. మరొక స్త్రీ విషయంలో పాతివ్రత్యాన్ని పరీక్షించే నెపంతో సాక్షాత్తు ఆ త్రిమూర్తులే ఆమెని నగ్నంగా చూడటానికి ముచ్చట పడ్డారు. అప్పుడే స్త్రీ జాతిగౌరవం మంటకలిసి పోయింది. తనను బలవంతంగా ఎత్తుకుపోయిన దుర్మార్గుణ్ణి తన పాతివ్రత్యంతో క్షణంలో మసిచేయగల సామర్ధ్యం వున్నా, గౌరవంతో, నమ్మకంతో ఎదురుచూసిన సీత పరిస్థితి ఏమయింది? పదిమంది ఎదుట శీల పరీక్షకి గురైంది. పురాణాల పేరుతో స్త్రీలని యింత నీచంగా సృష్టించబట్టే స్త్రీ జాతికి గౌరవం, విలువ లేకుండా పోయింది. వాళ్ళందర్ని పతివ్రతలని ఎందుకు చెప్పారో తెలుసా అత్తయ్యా! స్త్రీలు తమకు జరుగుతన్న అన్యాయాన్ని గుర్తించిన రోజు ఎక్కడ మగజాతిపై తిరగబడి వాళ్ళ ఆధిపత్యాన్ని నాశనం చేస్తారో అనే భయంతో. కానీ మనం ఏం చేస్తున్నాం? మన విజ్ఞతతో వాటిలోని మంచిచెడులని గుర్తించటం మానేసి, వాటినే ఎంతో భక్తి శ్రద్ధలతో పారాయణం చేస్తున్నాం. అత్తయ్యా! ఒక్క మాట చెప్పండి. ఇన్ని పురాణాలు రాశారు కదా! ఏ ఒక్కదానిలో అయినా తప్పుచేసిన మగవాడికి శీల పరీక్ష జరిపినట్టు ఎవరన్నా, ఎక్కడన్నా రాశారా? అదే అత్తయ్యా మన సమాజంలో కూడా వున్న దౌర్భాగ్యం.

సినిమాల్లో ఆడవాళ్ళు తక్కువ బట్టలు వేసుకుని అర్ధనగ్నంగా కనిపిస్తేనే అదితప్పని, అలాంటివి చూస్తే పిల్లలు చెడిపోతారని మనం భయపడుతున్నాం. అలాంటిది స్త్రీలని వివస్త్రలను చేసిన కథలు, ఇంద్రుడు మారువేషంలో వచ్చి మునిపత్నిని మానభంగం చేసిన కథలు పిల్లలకి చెప్తున్నాం. అవన్నీ వాళ్ళ మెదడు మీద ఎంత వికృతంగా పని చేస్తాయో ఆలోచించండి.

అత్తయ్యా! ఇప్పుడు నేను నా పిల్లలకి చెప్పిన కథే మీ అత్తగారు మీ భర్తకి, మీరు మీ అబ్బాయికి చెప్పుంటే మన జీవితాలు ఈ రోజు ఇలా వుండేవి కాదేమో! నేను మీ కొడుకుని శాశ్వతంగా ఎందుకు వదిలేసి వచ్చానో తెలుసా? శీలం ఆడదానికి ఎంత ముఖ్యమో మగవాడికి కూడా అంతే ముఖ్యం. అందుకే శీలం పోగొట్టుకున్న మీ కొడుకుతో కాపురం చేసి నేను అపవిత్రం కాదల్చుకోలేదు. నాకు పతివ్రతగా బ్రతకటం కన్నా పవిత్రంగా బ్రతకటమే యిష్టం.

సుమతి చెప్పటం ఆపింది. ఆమెకిప్పుడెంతో హాయిగా వుంది. ఇక తన విషయంలో దమయంతమ్మ గార్కి ఎటువంటి సందేహాలు లేకుండా విషయాన్ని స్పష్టంగా అర్ధమయేట్టు చెప్పగలిగినందుకు.

దమయంతమ్మ కూడా సుమతి మాటల్ని ఎంతో శ్రద్ధగానే వింది. కానీ ఆమెకి కోడలి మాటలు పెద్దగా ఆశ్చర్యం కల్గించలేదు. దానిక్కారణం ఆమెకి కూడా చాలాసార్లు ఇలాంటి అనుమానాలే వచ్చేవి. తనే వాటిని బలవంతంగా అణచివేసేది. బహుశ ఆచరణలో పెట్టలేనప్పుడు ఆలోచించి ఉపయోగం లేదని కాబోలు.

దమయంతమ్మ వైపు చూసిన సుమతికి యిప్పుడు ఆమె కళ్ళల్లో మునుపటి నిరాశ, నిర్లిప్తతలకి బదులు ఒక స్థిరత్వంతో కూడిన ఆలోచన ఏదో స్పష్టంగా కనబడింది.

సుమతి లేచి వంటగదిలోకి వెళ్తూ 'అత్తయ్యా! అన్నం తిందాం రండి!' అని పిలిచింది దమయంతమ్మని.

మౌనంగా సుమతిని అనుసరించింది దమయంతమ్మ. ★★★

## విషవలయంలో తెలు'గోడు'

ఎప్పుడో మహాభారతములో
చదివినట్లు జ్ఞాపకం
ధర్మరాజు రాజ్యాన్ని, తమ్ముల్ని చివరకు
పాంచాలిని పణంగా పెట్టి ఆడిన ఆట
జూదము "మాయాజూదము" అని!

ఈ కలియుగంలో పాలకులు
ప్రజాస్వామ్యానికి తిలోదకాలిచ్చి
భూ పోరాటంలో పాల్గొన్న వారిని అరెస్టు చేస్తున్నారు
మహిళలపై అమానుషంగా ప్రవర్తిస్తున్నారు పోలీస్‌లు
న్యాయం కోసమై ఐద్వా ఉద్యమాలు కొనసాగాలి.

రాష్ట్రాన్ని స్వర్ణాంధ్రా, హరితాంధ్రప్రదేశ్‌గా మార్చడానికి
విదేశీయులకు 'మాతృభూమి'ని తాకట్టు పెట్టారు నాయకులు
ద్యాముల నిర్మాణాల్లో స్కాం లెన్నో జరుగుతున్నాయి
నిర్మిస్తున్న ప్రాజెక్టులకు తెలుగు గంగ గతి పట్టకూడదు
సాగు నీరుకై ఐద్వా ఉద్యమాలు కొనసాగాలి.

దేశానికే వన్నె తెచ్చిన రాష్ట్రాన్ని మూడు ముక్కలుగా చేయకండి
610 జీ.వో. పేరిట 'రాజకీయ చదరంగం' ఆడకండి
ప్రాంతీయ విభజనతో ఆంధ్రను కురుక్షేత్రంగా మార్చకండి
త్రిలింగ దేశానికై 'అమర జీవులు' ఎందరో ప్రాణాలర్పించారు.
కోట్లాది తెలుగువాళ్ళకై ఐద్వా ఉద్యమాలు కొనసాగాలి.

– నేతాజీ

# ర్యాగింగ్ భూతాన్ని తరిమేద్దాం

ర్యాగింగ్......అదో భూతం...విద్యా సంస్థలను కలుషితం చేస్తున్న దురాచారం. అమానవీయ దుర్గుణం. అందర్నీ కలతకు గురిచేసే ఈ దుర్మార్గానికి గట్టి శిక్షలే ఉన్నాయి. మన రాష్ట్రంలో చట్టం అమలులోకి వచ్చి చాలా ఏళ్లు గడుస్తున్నా. అడపాదడపా ర్యాగింగ్ బూచి ఎవరో ఒకర్ని కాటేస్తూనే ఉంది. శిక్షలు ఉన్నాయి. జరిమానాలున్నాయి. అయినా వాటికి వెరవకుండానే నేరాలు చేస్తున్నారు. ఎవరిచ్చారీ ధైర్యం? మొండివాడు రాజుకంటే బలవంతుడు అన్నట్లు చట్టం కంటే నేరస్థులు బలవంతులు ఎలా కాగలుగుతున్నారు? ర్యాగింగ్ నేరస్థులను శిక్షించేందుకు మరింత కఠిన చట్టాలను రాష్ట్రాలు చేయాలని సుప్రీంకోర్టు తీర్పు చెప్పినపుడు దేశం ఉలిక్కిపడింది. ర్యాగింగ్‌పై చర్చ రచ్చకెక్కింది. దీనికి పరిష్కారం ఏమిటి? చట్టాలేనా? ఎవరి క్రియాశీలతలో లోపం మనల్ని సవాలు చేస్తోంది? ఎవరో ఆలోచించడం కాదు. ప్రతి ఒక్కరూ పునరాలోచించకుంటే సమాజానికి ముప్పుతప్పదు.



రోమియో



అమ్మాయిలను అల్లరి పెట్టి అవమానించే

రోమియోలకు ఏడాది శిక్ష

- ఐ.పి.సి. 509 సెక్షన్



### ర్యాగింగ్‌పై కొరడా

ఉన్నత విద్యాసంస్థల్లో వెర్రితలలు వేస్తున్న ర్యాగింగ్ భూతాన్ని అంతం చేయడానికి సర్వోన్నత న్యాయస్థానం చరిత్రాత్మక తీర్పు ఇచ్చింది. కళాశాలల్లో కొత్తగా ప్రవేశించిన విద్యార్థుల పట్ల సీనియర్లు అమానుషంగా ప్రవర్తించడాన్ని శాశ్వతంగా నిరోధించడం కోసం నిర్దిష్ట చర్యలకు సుప్రీం కోర్టు ఆదేశించింది. ర్యాగింగ్‌కు పాల్పడే వారిపై క్రిమినల్ కేసుల నమోదుకు సుప్రీం కోర్టు ఆదేశించినందువల్ల ఈ సమస్యకు ఇకనైనా పరిష్కారం లభించగలదనే నమ్మకం కలుగుతోంది. ర్యాగింగ్ పేరిట కళాశాలల ప్రాంగణాల్లో వికృత లైంగిక వేధింపులు పెచ్చుమీరాయి. విద్యార్థుల బంగారు భవిష్యత్తును నాశనం చేస్తున్న ఈ భూతాన్ని నామరూపాలు లేకుండా చేయడానికి సుప్రీం కోర్టు కొన్ని నెలల క్రితమే నడుం బిగించింది. ర్యాగింగ్ నిరోధం కోసం ఏం చేయాలో సూచించడానికి ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేయాలని కేంద్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. ఆ మేరకు ఏర్పడిన రాఘవన్ కమిటీ నిశ్చితాభిప్రాయం వ్యక్తం చేసింది. ర్యాగింగ్‌ను నిరోధించడం కోసం అన్ని రాష్ట్రాల్లో కమిటీలను ఏర్పాటు చేయాలన్నది కమిటీ చేసిన మరో సిఫారసు. తోటి విద్యార్థులను ర్యాగింగ్ చేయడం నేరమని ప్రతి విద్యా సంస్థ ఇకపై తమ ప్రాస్పెక్టస్‌లో విధిగా పేర్కొనవలసి ఉంటుంది. ర్యాగింగ్‌ను మానవ హక్కుల ఉల్లంఘనగా కూడా పేర్కొంటూ సాంఘిక శాస్త్రంలో పాఠ్యాంశాన్ని చేర్చాలని ఎన్‌సిఇఆర్‌టికి రాఘవన్ కమిటీ ముఖ్యమైన సిఫారసు చేసింది. ర్యాగింగ్ కేసులను సత్వరం విచారించాల్సిందిగా దిగువ కోర్టులను సుప్రీంకోర్టు ఆదేశించింది. ఈ చర్యలన్నీ అమలైతే కళాశాలల్లో ర్యాగింగ్ చాలా వరకు తగ్గుముఖం పడుతుందని ఆశించవచ్చు. విద్యార్థి సంఘాల ఎన్నికల్లో విచ్చలవిడిగా డబ్బు వెదజల్లడం, హింసాత్మక చర్యలకు పాల్పడడంపై ఇదివరకు లింగ్డో కమిటీని ఏర్పాటు చేయించి, సిఫారసుల అమలుకు ఆదేశించిన సుప్రీం కోర్టు, అదే ఒరవడిలో ర్యాగింగ్‌పై అతి కీలకమైన తీర్పును ప్రకటించింది.

ర్యాగింగ్‌పై రాఘవన్ కమిటీ నివేదిక అమలుకోసం సుప్రీం కోర్టు విస్పష్టమైన మార్గదర్శకాలను నిర్దేశించింది. నిజానికి ర్యాగింగ్‌పై కఠిన చర్యలు తీసుకోవాలంటూ ఐదేళ్ళ క్రితమే సుప్రీం కోర్టు ఆదేశించింది. కాని ఆ ఆదేశాలు అమలుకు నోచుకోలేదు. కాబట్టే సుప్రీం కోర్టు మళ్లీ జోక్యం చేసుకోవాల్సి వచ్చింది. ర్యాగింగ్‌ను అనేక రాష్ట్ర ప్రభుత్వాలు నిషేధించినప్పటికీ కళాశాలల్లో అది విచ్చలవిడిగా సాగుతోంది. ఒకప్పుడు కేవలం పరిచయ కార్యక్రమంగా, జూనియర్లలో బిడియం పోగొట్టే మంచి ఉద్దేశంతో సరదాగా ప్రారంభమైన ర్యాగింగ్ ఇప్పుడు వికృతరూపం దాల్చింది. సరదా అన్నది కాస్తా సీనియర్లకు ఉన్న అధికారంగా, హక్కుగా మారిపోయింది. జూనియర్లను ఆటపట్టించడం అంటే చిత్రహింసలు పెట్టడమనే నిర్వచనాన్ని సీనియర్లు ఇచ్చుకుంటున్నారు. దీనిపై జూనియర్లు సాహసించి ప్రిన్సిపాల్‌కు కాని, పోలీసులకు కాని ఫిర్యాదు చేస్తే మరిన్ని ఇబ్బందులు, వేధింపులు ఎదుర్కోవాల్సి వస్తోంది. ర్యాగింగ్ భూతానికి మన రాష్ట్రంలోనే ఎందరో విద్యార్థులు అన్యాయంగా బలయ్యారు. శ్రీకాకుళంలోని ఓ కళాశాల విద్యార్థిని సీనియర్లు స్వలింగ సంపర్కానికి ప్రేరేపించి, మొబైల్ కెమెరాలో చిత్రీకరించడం వెర్రితలలు వేసిన ర్యాగింగ్‌కు నిదర్శనం. ఈ వ్యవహారానికి మీడియాలో విస్తృత ప్రచారం లభించడంతో ఆ విద్యార్థి తల్లి అవమానభారంతో కన్నుమూసింది. విజయవాడ, కర్నూలు కళాశాలల్లో జరిగిన అత్యంత హేయమైన ర్యాగింగ్ ఘటనలు ఇంకా కళ్లముందు కదలాడుతూనే ఉన్నాయి. కర్నూలు మెడికల్ కళాశాల

విద్యార్థిని నగ్నంగా నిలబెట్టి ఫోటోలు తీసిన సహచరుల పైశాచిక ఆనందం ఏ విధంగానూ సమర్థనీయం కాదు. ఇటువంటి వికృతాలకు పాల్పడే విద్యార్థులను కఠినంగా శిక్షించడం చాలా అవసరం. దేశవ్యాప్తంగా అన్ని కళాశాలలో ర్యాగింగ్ ఉన్నప్పటికీ ముఖ్యంగా ఇంజనీరింగ్, మెడిసిన్, ఐఐటి, ఐఐఎంల వంటి ఉన్నత విద్యాసంస్థల్లోనే ఎక్కువ. ర్యాగింగ్ సంఘటనలను కళాశాలల యాజమాన్యాలు కప్పిపుచ్చడానికే ప్రయత్నిస్తున్నాయి తప్ప, తప్పు చేసిన వారిపై చర్యలు తీసుకోవడం లేదు. తమ సంస్థకు చెడ్డపేరు వస్తుందనే భయంతో యాజమాన్యాలు ఇలా వ్యవహరిస్తున్నాయి. ప్రజల్లో పెద్ద ఎత్తున ఆందోళన వ్యక్తమైన సందర్భాల్లో సంబంధిత విద్యార్థి సస్పెన్షన్‌తో సరిపెడుతున్నాయి. ఇటువంటి అరకొర చర్యల వల్ల సీనియర్ విద్యార్థులు మరింత రెచ్చిపోతున్నారు. విద్యా సంస్థల యాజమాన్యాలు కఠినంగా వ్యవహరిస్తే ర్యాగింగ్ భూతాన్ని తరిమివేయడం కష్టమైన పనేంకాదు. ర్యాగింగ్‌ను నిషేధిస్తూ చట్టాలు చేసినప్పటికీ, జరిమానా, జైలుతోపాటు విద్యా సంవత్సరాన్ని నష్టపోవాల్సి వస్తుందని హెచ్చరించినప్పటికీ ఈ దురాచారానికి తెరపడడం లేదు సర్వోన్నత న్యాయస్థానం నివారించదలచింది ఈ పరిస్థితినే.

### ముఖ్యమైన సిఫార్సులివే...

- మహిళలపై వేధింపు కేసులను విచారించేందుకు ఉద్దేశించిన సెక్షన్ 498 (ఎ) తరహాలో ర్యాగింగ్‌ను శిక్షార్హమైన నేరంగా పరిగణిస్తూ భారతీయ శిక్ష స్మృతి (ఐపీసీ)ని సవరించాలి. అలాగే బాధితులకు నైతిక స్థయిర్యం కల్పించేలా 'సాక్ష్యం చట్టా'న్ని (ఎవిడెన్స్ యాక్ట్) కూడా సవరించాలి.
- నిందితులకు విధించిన శిక్షపై బాధితులు అసంతృప్తి వ్యక్తం చేసిన పక్షంలో యాజమాన్యమే పోలీసు కేసు పెట్టదాన్ని తప్పనిసరి చేయాలి.
- విద్యార్థులు కళాశాలలో చేరే సమయంలోనే 'ర్యాగింగ్ వంటి దుశ్చర్యలకు పాల్పడబోమన్న హామీ ఇచ్చేలా దరఖాస్తులోనే నిబంధన పొందుపరచాలి.
- తాజా విద్యా సంవత్సరంలో కొత్త విద్యార్థులకు సీనియర్లకంటే వారం ముందుగానే తరగతులు ప్రారంభించాలి.
- కళాశాలలకు గ్రేడు నిర్ణయించే యూజీసీ, నాక్ వంటి సంస్థలు సాధారణంగా తాము పరిశీలించే అంశాలతోబాటు ర్యాగింగ్ అదుపునకు అవి తీసుకున్న చర్యలనూ పరిగణలోకి తీసుకోవాలి.

★★★

## పొసెసివ్ నేచర్

గోపాలకృష్ణ

నా
నాది
నాతోనే ఉండాలనీ
నీ నవ్వుల సీతాకోక చిలుకలు నాతోటలోనే ముురియాలనే
అనాది భావాన్ని అంతం చేసాయనుకున్నా
అందంగా ఉన్నాననుకున్నా
అది అణిగి మణిగి నాలోనే ఉందని
తెలుసుకోలేకపోయా
ఒక వ్యతిరేక పవనం
నా ఎముకల్ని కొట్టినప్పుడో
నా తలపుల్ని తట్టినప్పుడో
బయట పడ్డట్టుంది, గమనించలేదు.
తలతిప్పి లోకం వైపు చూస్తున్నావు నువ్వు
లోకం వైపు నుండి తలతిప్పి నీ వైపు చూస్తున్నాను నేను
ఒక పలకరింపుకోసం ఒక చూపు కోసం
ఎదురు చూడ్డం ఇటీవల నాకు కొత్త
చిరునవ్వుతో స్ఫూర్తి పొంది
ప్రపంచాన్ని గెలుద్దామనుకున్నా
ఆయుధాల్ని సమకూర్చలేని గతం
యుద్ధాల్ని జయించలేని మనోగతం
వెక్కిరిస్తున్నట్టుంది, ధిక్కరిస్తున్నట్టుంది.
పరాయివాళ్ళతో కొలతలు వేస్తుంటే
పరాయి వవ్వుతావనే భయం గుండెల్లో ఉందేమో?
అడుగుల కొలతల్లో అంగుళాల్లోకి
వేగంలో సాగలేని తనానికి
జారిపోతాననే సంశయం ఉందేమో?
ఆత్మ విశ్వాసం నుండి న్యూనతా లోయల్లోకి
కూలిపోతాననే ఆందోళనేమో?
మధురమైన ఊహలు మృగతృష్ణలౌతాయని
తల్లడిల్లిందేమో హృదయం
భద్రత లేదని బ్రద్దలయ్యిందేమో మనస్సు
స్నేహాన్ని అధికారంతో అదిలించలేమని
ఉక్రోషంతో ఆక్రోశంలా కొత్త వేషంలో
కత్తుల్ని విసిరిందనుకుంటా?
ఏంటా ధ్వని నాదా? మనిషిదా
మగాడిదా? మృగాడిదా?
చెవులకు కంపరం పుట్టిస్తోంది
తనువును జలదరింప జేస్తోంది.
ఆత్మప్రకంపన అపస్వరాల నేపథ్యం ఇస్తోంది.
భయం వేస్తోంది, దుఃఖం పెల్లుబుకుతోంది
స్నేహామా నీకిలా ఉందో? నాకిలానే ఉంది
ఆపెయ్యాలి, అంతం చెయ్యాలి, ఎలా?
తెలుసు, బాధ్యతా బరువూ నాదే?
తెలియదు, నాఒక్కడి వల్లా అవుతుందో లేదో?

# భారతదేశంలో ముస్లిం స్త్రీల విద్యాస్థితిగతులు - అభివృద్ధి చర్యలు

సలవాది సోమలింగం, ఎం.ఎ, బి.ఇడి. (ఎం.ఫిల్.)
సెందెవేని తిరుపతి, ఎం.ఎ, బి.ఇడి. (ఎం.ఫిల్.), కాకతీయ యూనివర్సిటీ

భారతదేశం పేరును చూడగానే హిందుదేశంగా గోచరిస్తున్నప్పటికి, ఇక్కడకు మధ్యయుగకాలంలో అడుగిడి సుమారు 650 సంవత్సరాలు ఈ దేశాన్ని పరిపాలించిన ముస్లింల ప్రభావం ప్రతి రంగంలోను కనబడుతుంది. వీరి రాకతో హిందుముస్లిం సమ్మేళనం అనేక రంగాలలో అద్భుత ప్రగతి సాధించినప్పటికిని కొన్ని విషయాలలో మాత్రం పరస్పర విరుద్ధంగా కనబడుతాయి. ముఖ్యంగా విద్యావ్యవస్థను చూసినట్లైతే ఈ తేడాలు మనకు స్పష్టంగా కన్పిస్తాయి. 2001 జనభా లెక్కల ప్రకారం మొత్తం మైనారిటీ వర్గంలో ముస్లిం మతస్తులు చివరి స్థానంలో కొనసాగుతున్నారు. వీరిలో అక్ష్యరాస్యత కేవలం 59% మాత్రమే. మొత్తం స్త్రీల అక్షరాస్యత 54%. కాని ముస్లిం స్త్రీల అక్ష్యరాస్యత కేవలం 23% మాత్రమే. ఈ తేడా మనకు కొన్ని శతాబ్దాల కాలం నుండి కొనసాగుతున్నట్లుగా స్పష్టంగా తెలుస్తుంది.



## ముస్లిం విద్యావ్యవస్థ

మనం ముస్లిం విద్యావిధానం చూసినట్లయితే ఒకరిద్దరు పాలకులు తప్ప మిగిలినవారు ఎవ్వరు కూడా విద్యకు అంతగా ప్రాధాన్యత ఇచ్చనట్లుగా కనబడరు. ఫిరోజ్‌షా తుగ్లక్, అక్బర్ కాలంలో వీరు విద్యా రంగంపై ఎక్కువ ఖర్చు చేసినట్లు కనబడుతుంది. వీరు తమ కాలంలో అనేక విద్యాలయాలు నేలకొల్పారు. ముస్లిం స్త్రీల అక్షరాభ్యాసాన్ని, బాలుర వలెనే నాలుగు సంవత్సరాలలోనే ప్రారంభిస్తారు. దీనిని "జార్పిపాని" అని పిలుస్తారు. వీరి విద్యావ్యవస్థలో మొదటి పాఠశాలను "మక్తబ్‌లు" అంటారు. దీనిలో ప్రాథమిక తరగతులు భోధించబడేవి. తరువాత "మదరసా"లలో ప్రాథమికోన్నత తరగతులు బోధించబడేవి. "మదరసాల"లలో ఉన్నత విద్యా తరగతులు, స్నాతకోత్తర తరగతులు బోధించేవారు. వీటిని మన విశ్వవిద్యాలయాలతో పోల్చవచ్చు. వీటిలో ఉన్నత, మధ్యతరగతి కుటుంబాలకు చెందిన బాలురకు మాత్రమే ప్రవేశం ఉన్నట్లుగా తెలుస్తుంది. వీటిలో ఎక్కడ కూడా బాలికలకు ప్రవేశం ఉన్నట్లుగా మనకు కన్పించదు. కాని ఉన్నత కుటుంబాలకు, రాజవంశ కుటుంబస్త్రీల కోసం ప్రత్యేక ఉపాధ్యాయులతో ఇంటి వద్దనే బోధించేవారు. ఉన్నత విద్యకోసం మాత్రం "మదరసాల"లలో చేరినట్లుగా తెలుస్తుంది.

## వెనుకబాటుతనానికి కారణాలు

వారి మత సాంప్రదాయాలు వారిని మరింత వెనుకకు నెడుతున్నాయి. మహ్మద్‌ప్రవక్త స్త్రీ విద్యపై సదవగాహనతో ఉన్నప్పటికిని అనంతరకాలంలో ఉన్న మత పెద్దలు అయిన "ఉలేమాలు" అంతగా స్త్రీ విద్యపై ఆసక్తిచూపించినట్లుగా కనబడదు. భారతదేశంలో చూస్తే మధ్యయుగ కాలంలో సాంప్రదాయాల్నే గొప్పగా భావించేవారు. ముస్లిం స్త్రీలు వేసుకునే పరద పద్ధతి వారి శరీరానికే కాకుండా, వారి విజ్ఞానానికి, ఆలోచనలకు సయితం వేస్తున్న పరదాలు అని ఎవరు తలంచలేదు. ఘోషా పద్ధతి చిన్ననాటి నుండి అలవాటు చేయడం వల్ల వాళ్ళలో ఒకన్యూనత భావం ఏర్పడటం, తాము మగవారికంటె తక్కువేనని అనుకోవడం, తాము కేవలం కుటుంబ అవసరాలు తీర్చాడానికి మాత్రమేనని భావించుకునే పరిస్థితి ఏర్పడింది. దేశంలో ఆధునిక యుగానికి వచ్చే సరికి ఇంగ్లీష్ స్కూల్‌కు పంపితే తమ మత ప్రతిష్టలు ఎక్కడ మంటగలుస్తాయోనని వారి పిల్లలను స్కూల్లలో చేర్పించదానికి ముస్లింలు ఇష్టపడలేదు. భారతదేశం హస్తకళ నైపుణ్యంలో ప్రపంచ ప్రఖ్యాతిగాంచింది. ఈ నైపుణ్యంలో ముస్లిం స్త్రీలే అధిక ప్రాధాన్యత వహిస్తున్నారనడంలో అతిశయోక్తి లేదు. పాలరాతి నగిషీలు, జరీ, పట్టు ఎంబ్రాయిడరి, తివాచీలు నేయడం వంటి వాటిలో వీరు సిద్ధహస్తులు, ముస్లిం స్త్రీలను చిన్నతనం నుండి ఈ కళలలో శిక్షణ ఇచ్చి వారితో పని చేయిస్తారు. ఇది కూడా బాలికలను పాఠశాలలో చేర్పించకపోవదానికి ఒక కారణం.

ఎన్ని అవాంతరాలు ఉన్నప్పటికినీ పట్టుదలతో పైకి వచ్చిన ముస్లిం స్త్రీలు ఎందరో ఉన్నారు. రజియాసుల్తానా, హుమయున్ నామరాసిన బాబరు కూతరు గుల్‌బదన్ బేగం, నూర్జహాన్ వంటి వారు ఉన్నారు. నేటి ఆధునిక యుగంలో సయితం ప్రభుత్వ ఉద్యోగాలలో సుమారుగా మూడు శాతం కంటేపైగా ముస్లిం స్త్రీలు ఉన్నట్లుగా ఒక అంచనా.

## అభివృద్ధికి తీసుకోవాల్సిన చర్యలు

నేడు ముస్లిం స్త్రీలలో ప్రాథమిక విద్యే కరువైంది. ఆర్టికల్ 15 ప్రకారం లింగ విచక్షణ చూపకుండా విద్యా వ్యవస్థల్ని నడపాలి అన్నట్లయితే ప్రభుత్వ పాఠశాలల్లో ఉన్న ముస్లిం బాలురతో సమానంగా బాలికలు ఉండేట్లుగా ప్రభుత్వము చర్యలు చేపట్టాలి. బాలికల విద్యపై తల్లిదండ్రులకు సరైన అవగాహనను పెంపొందేట్లుగా ప్రభుత్వం కృషి చేయాలి.

ముస్లిం మతానికి చెందిన వక్ఫుబోర్డ్‌కు వచ్చే ఆదాయం కోట్లలో ఉంటుంది. మరి దీనిలో కొంత భాగంమైన ముస్లిం స్త్రీ విద్యపై ఖర్చుచేయాలి. దీనివల్ల స్త్రీల విద్య ఊహించనంత స్థితిలోకి వెళుతుందనండలో సందేహం లేదు. మరి ముస్లిం మత పెద్దలు తప్పకుండా ఆలోచించాలి.

మన రాష్ట్రంలో ఈ మధ్యే వక్ఫ్‌బోర్డ్ ఆస్తుల విషయంలో పెద్దగా దుమారం చెలరేగింది. వీటిని సక్రమంగా వినియోగించినట్లయితే లక్షలాది రూపాయల లాభాలు వస్తాయి. వాటిని స్త్రీల విద్యకై ఖర్చు చేయవలసిన అవసరం మన వక్ఫ్‌బోర్డ్‌లపై ఉంది.

ముస్లింలు పవిత్ర రంజాన్ మాసంలో దానం చేసే "జకాత్‌లో" కొంత వినియోగించినా స్త్రీ విద్యావ్యవస్థనే మార్చవచ్చు. హైదరాబాద్‌లో పనిచేసే "జకాత్ చారిటేబుల్ ట్రస్ట్" ఇందుకు ప్రాధాన తార్కాణం. మరి జిల్లా కొకటి చొప్పున "జకాత్ ట్రస్ట్"లను స్థాపించి స్త్రీ విద్యను పోషించలేమా.

ఆర్టికల్ 29, 30ల ప్రకారం మైనారిటీలు విద్యా సంస్థలను నెలకొల్పి నడిపించుకునే హక్కు ఉంది. దీని ప్రకారం స్థాపించిన ఒక నాటి "ఆలీఘర్" ముస్లిం యూనివర్సిటీ, దేశంలో ఉన్న ఇతర మైనారిటీ సంస్థలు అలాగే రాష్ట్రంలో ఉన్న మైనారిటీ సంస్థల ఉనికిని కాపాడుకోవాలంటే ముస్లిం స్త్రీల విద్యను ప్రోత్సహించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

అలాగే ప్రభుత్వ పరంగా కూడా కొన్ని ఏర్పాట్లను తప్పకుండా చేయాలి. ముఖ్యంగా పేద పిల్లలకు వృత్తివిద్యా కోర్సులలో శిక్షణను ఇస్తు విద్యనేర్పాలి, అది వారి అవసరాలకు ఉపయోగపడేట్లుగా ఉండాలి. అలాగే ప్రభుత్వం గతంలో నెలకొల్పిన ముస్లిం "బాలికల పాల్‌టెక్నిక్" కళాశాలలు మూయబడకుండా ఉండాలంటే తప్పనిసరిగా ముస్లిం స్త్రీలను దానిలో చేరేటట్లుగా కృషి చేయాలి. అలాగే ముస్లిం స్త్రీల కోసం ప్రత్యేక పాఠశాలలను ఏర్పర్చి ముస్లిం ఉపాధ్యాయురాల్లనే నియమించేటట్లుగా ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి.

ప్రభుత్వం, ముస్లిం సమూహంలో పని చేసే సంఘాలు కల్సికట్టుగా పనిచేస్తు ముస్లిం స్త్రీల విద్యపై తల్లిదండ్రులలో ఒక ప్రత్యేక భావనను కలిగేట్లుగా కృషి చేయాలి. అలాగే సాంప్రదాయకట్టుబాట్లను సదలించుకొని మారుతున్న కాలానికి అనుగుణంగా మారి విద్యాభివృద్దికి తోడ్పడుచు సమస్త ప్రజల విజ్ఞానానికై ముస్లిం స్త్రీలను విద్యావంతులుగా తీర్చిదిద్దే బాధ్యతలో పాలుపంచుకొవల్సిన అవసరం ఎంతైనా ఉంది.

★★★

# జండర్ వివక్ష - ప్రతిఫలించిన రెండు కథలు

✍ కందాళ శోభారాణి

స్త్రీ పురుషులు పుట్టుకతో సమానులే. కాని యుగయుగాలుగా, తరతరాలుగా సామాజికంగా, సంస్కృతీ పరంగా అసమానులుగా చేయబడ్డారు. దీనినే జండర్ అసమానత అంటారు. జండర్ అసమానతను తొలగిస్తూ మానవీయ సమాజాన్ని నిర్మించటం ఆధునిక ప్రపంచాల లక్ష్యం. జండర్ సమానత్వ దిశగా సమాజాన్ని నడిపించటం కోసం విద్య, ఉద్యోగ, సామాజిక రాజకీయ, ఆర్థిక రంగాలలో స్త్రీలకు పురుషులతో పాటు సమాన అవకాశాలను కల్పించటం అవసరం.

భారత ప్రభుత్వం ఈ అవసరాన్ని గుర్తించింది. కనుకనే విద్యారంగంలో స్త్రీలకు 33% ప్రాతినిధ్య అవకాశాలు కల్పించింది. ఉద్యోగ, రాజకీయ రంగాలలో స్త్రీలకు 33% రిజర్వేషన్‌ను రాజ్యాంగ హక్కుగా అమలులోకి తెచ్చింది. దాదాపు దశాబ్ద కాలం నుండి రాజకీయ రంగంలో రిజర్వేషన్ స్థానిక ప్రభుత్వాలకు పరిమితమై అమలవుతున్నది.

ఈ రిజర్వేషన్స్ ఉపయోగించుకొని రాజకీయాలలోకి వస్తున్న స్త్రీల అనుభవాలను గమనిస్తే ఆసక్తికరమైన విషయాలు అనేకం వ్యక్తమవుతున్నాయి. సాధారణంగా రాజకీయాలలోకి వచ్చే స్త్రీలు రాజకీయ కుటుంబాల నుండే వస్తున్నారు. ఆ కుటుంబాలలో పురుషులు ఎన్నికల బరిలో నిలబడే అవకాశాలు లేనప్పుడే స్త్రీలకున్న రిజర్వేష్ను ఉపయోగించుకొని తమ కుటుంబాల నుండే స్త్రీలను రాజకీయ రంగంలోకి దించటం కనబడుతుంది. కాకపోతే ఏదైనా ప్రమాద పరిస్థితులలో రాజకీయ రంగంలో పలుకుబడి కల్గిన వ్యక్తి మరణించినపుడు అతను ఏ పార్టీలోనైతే కొనసాగుతూ వస్తూన్నాడో ఆ పార్టీవాడు అతని మరణం వల్ల ప్రజలలో కల్గిన సానుభూతిని గెలువుకు అనరాగా చేసుకోవాలనుకున్నప్పుడు తప్పని సరిగా అతని భార్యకే రాజకీయ అకాంక్షలతో గాని, అభిప్రాయాలతో గాని నిమిత్తం లేకుండా స్త్రీలు రాజకీయలలోకి రావటం, రాజకీయ కుటుంబాల్లో స్త్రీలే రాజకీయాల్లోకి రావటం తరచు కనిపించే అంశం. అంతకు మించి వేరే మార్గం నుండిగాని స్త్రీలు రాజకీయాలలోకి వచ్చే పరిస్థితి లేదు. ప్రత్యేకించి స్థానిక, దళిత, ఆదివాసి, పేద, మధ్యతరగతి వర్గాల మహిళలకు ఈ రిజర్వేషన్స్ వల్ల ప్రయోజనాలు అందటం లేదన్నది వాస్తవం.

స్త్రీలు స్వతంత్రంగా ఓటువేసే పరిస్థితులే లేనప్పుడు స్వతంత్ర వ్యక్తులుగా రాజకీయ రంగంలో పాల్గొని నిజమైన అర్థంలో సాధికారతను సాధిస్తారా? అన్నది ప్రశ్న. వర్తమాన రాజకీయాల ధోరణి ఈ ప్రశ్ననే మన ముందర నిల్పుతున్నది. రాజకీయ రంగంలోకి స్త్రీలు ప్రవేశించటం జండర్ సమానత వైపుగా ఒకడుగు ముందుకు వేయటమే. ఐతే ఆ మార్గంలో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలు సంఘర్షణ ఇంకా రావల్సినంతగా గుర్తింపుకు రాలేదు. ఈ సమగ్ర సంఘర్షణల స్వరూప స్వభావాలు తెల్సినపుడే రాజకీయ రంగంలో స్త్రీల ప్రవేశం నిస్సందేహంగా జండర్ సమానతను సాధించగల్గిన బలమైన శక్తి అవుతుంది. అందువల్ల రాజకీయ రంగంలో స్త్రీల భాగస్వామ్యాన్ని గురించిన అధ్యయనాల అవసరం ఈనాడు ఎంతైనా ఉంది.

ఇటువంటి అధ్యయనాలకు సామాజిక, వాస్తవిక సమాచారం మాత్రమే కాక సాహిత్యం కూడా ఒక విశ్వసనీయమైన ముడిసరుకే అవుతుంది. సామాజిక సమస్యలను బహుముఖాల నుండి మానవీయ సంబంధాల నుండి చిత్రించగల్గిన సత్తా సాహిత్యానికి ఉంది. అందువల్ల నేటి సమాజంలో రాజకీయాలలో స్త్రీల భాగస్వామ్య స్వభావాన్ని రెండు తెలుగు కథల ఆధారంగా విశ్లేషించటం ఈ వ్యాసంలో జరుగుతుంది.

స్త్రీ సాధికారతా భావన. అంతర్జాతీయ స్థాయిలో రూపొందిన 90వ దశకంలోనే ఆంధ్రప్రదేశ్‌లో స్త్రీవాద సాహిత్యోద్యమం ముమ్మరమయింది. స్త్రీ జీవితంలోని వివిధ పార్శ్వాలను భిన్న రంగాలలో స్త్రీల స్థితిగతులను కొత్తగా చూడటం విశ్లేషించటం, వ్యాఖ్యానించటం, పునర్నిర్వచించటం ఈ కాలపు తెలుగు సాహిత్యంలో విస్తృతంగా జరిగింది. ముఖ్యంగా తెలుగు కథ ఈ విషయంలో చాలా ముందు ఉంది. ఐతే స్త్రీల కుటుంబిక జీవితం తెలుగు కథకు వస్తువు అయినంతగా సామాజిక జీవితం కాలేదనేది ఒక వాస్తవం. సామాజిక జీవితం కథా వస్తువు అయిన సందర్భంలో కూడా అది ఎక్కువగా విద్య, ఉద్యోగరంగాలకు సంబంధించినదిగానే ఉంది. రాజకీయరంగంలో స్త్రీల అనుభవాలను వస్తువుగా చేసుకున్న కథలు ఇప్పుడిప్పుడే వస్తున్నాయి. నల్లూరి రుక్మిణి, వి.ప్రతిమ మొదలైన రచయిత్రులు ఇటువంటి కథలు రాస్తున్నారు.

నల్లూరి రుక్మిణి రాసిన "గెలవలేని ఆట" వి. ప్రతిమ రాసిన "గంగజాతర" కథలు ప్రత్యేకంగా పరిశీలించదగినవి. ప్రతిమ రాసిన గంగజాతర కథ 2000 మేలో ప్రజాశక్తిలో అచ్చయింది. పిల్లలకు అంటు వ్యాధులు సోకకుండా కాపాడమని పూర్ణ్యెని చిన్నా, పేద వర్గాలవారు ఈతి బాధ లేకుండా చూడమని గంగల్ని ప్రార్థించి వారి వారి శక్తి మేరకు కోళ్ళని, వేటల్ని, దున్నపోతుల్ని బలియిస్తారు. వేయికళ్ళ కుండల్లో దీపాలు పెట్టుకొని కొండరాడవాళ్ళు వేపచీరలు కట్టుకొని ఊరేగింపుగా వెళ్ళడం గంగ జాతర సందర్భంగా జరుగుతోంది. ఈ జాతరకు సమాంతరంగా ఎన్నికల జాతరను చూపిస్తూ ప్రతిమ ఈ కథను వ్రాశారు.

ప్రతి రోజు రాజకీయ జాతర జరుగుతుంది. పంచాయితీ ఎన్నికల ప్రకటన వెలువడింది. నామినేషన్ల పర్వం కూడా పూర్తయింది. మాధవి

ఇంటినిండా మనుషులు అందరికి టీలు, కాఫీలు, కొందరికి భోజనాలు ఇల్లంతా చెప్పలేనంత హడావుడిగా వుంది. ఈ కథలో మాధవి తన పరిస్థితిని, మనసులోపడే వేదననూ మనతో స్వయంగా చెప్పినట్టుగా ఉంటుంది. మహిళా రిజర్వేషన్ల కారణంగా అంతకాలం నుండి ఆమె భర్త సర్పంచ్‌గా పోటీ చేసే పంచాయితీ నుండి ఈసారి మాధవికి టికెట్టు వచ్చింది. "రాజేంద్రరెడ్డి భార్య, వీర్రాఘవరెడ్డి కోడలు పంచాయితీ ఎలక్షన్లలో సర్పంచ్‌గా నిలబడింది. మీకూ రాజేందర్ రెడ్డి కొత్తకాదు. ఆయన ఈ ఊరికి చేసిన సేవ మీకంతా తెలుసు. మీ ఓట్లన్ని ఆమెకే ఏసి గెలిపించాల మర్చిపోకండమ్మా మీ ఎన్నికల గుర్తు ట్రాక్టర్" అంటూ ఆమెను గెలిపించమని ప్రచారం జరగుతుంది.

ఇదంతా మాధవికి ఇష్టంలేదు. ఆ విషయాన్ని పైకి చెప్పలేదు. ఆ ఒత్తిడి వల్ల ఆమె అంతరంగం అల్లకల్లోలంగా వుంటుంది. నాకు పేరు లేదు, జీవితం లేదు, గెలుపు లేదు, ఫలానా ఆయన కూతుర్ని, ఫలానా ఆయన భార్యని ఇంకా ఇంకా ఫలానా ఆయన అమ్మని అంతే వద్దొదు. నాకు గెలపొద్దు. ఈ విజయం కూడా అతడిదే అనుకుంటుందామె. లోలోపల తనకంటూ వునికి లేకపోవటం వలన ఉక్కిరి బిక్కిరి అవుతున్న స్థితి. మా ట్రాక్టర్ గుర్తుకే మీ ఓటు. మీకే సమస్య వచ్చినా అయ్యె చూసుకుంటాడు. బతిమాల్తూ అప్పుడప్పుడూ దబాయిస్తున్నట్లు మాట్లాడుతున్న సిద్ధయ్య మాటలు ఆమె ఆలోచనా స్రవంతిని దారి మళ్ళిస్తాయి.



అవునవును ఓట్లేసి అమ్మను గెలిపిస్తే అన్నీ అయ్యె చూసుకుంటారన్న మాట అమ్మకేమీ తెలియదు తెలియనివ్వరు. ఏం వ్యాపారం చేస్తున్నారో తెలీదు. ఎంత ఆదాయమొస్తుందో చెప్పరు. అంతెందుకు నామినేషను వేయడానికి పదినిమిషాల ముందు వరకూ కూడా నేను ఎలక్షన్లో నిలబడబోతున్నట్లు నాకు తెలియదు. నా అభిప్రాయమెవరూ అడగలేదు. నేను ఇంట్లో సంతకం పెట్టిన నామినేషను కాగితాల్ని తీసుకొని అశేష ప్రజానీకంతో, జేజేల నడుమ అమిత అట్టహాసంగా అతడెళ్ళి దాఖలు చేసి వచ్చాడు. ఈ రోజు కూడా వంటపని నేనే చూసుకున్నాను. నామినేషన్ వేసి అతడు తిరిగొచ్చేసరికి కాని అర్థంకాలేదు. ఈ పంచాయితీ లేడి రిజర్వుడయిందని అనుకొంటుందామె. అప్పుడు సంసారంలోనూ ఇప్పుడు రాజకీయాలలోను తానొక స్లీపింగ్ పార్ట్‌నర్‌గా వున్న స్థితి గురించిన ఆందోళన ఇది. పదేళ్ళుగా ఉంటున్నా ఆ పరిసరాలన్నీ ఆమెకు కొత్తే. అటు పల్లె ఇటు పట్నమూ కాని ఊరు ఈ చుట్టు పక్కలన్నింటిలోకి ఇది మేజర్ పంచాయితీ ఎన్నాళ్ళుగనో ఈ ఊరికి సర్పంచ్ ఆమెభర్త రాజేందర్‌రెడ్డే. ఈ పంచాయితీని మరొకరి చేతుల్లోకి అప్పగించడానికతడు సిద్ధంగా లేడు అతను ఊరిమీదనే కాదు తన మీదా స్థాపించిన అధికారం ఆమెను కలవరపెడ్తుంది. ఈ సర్వం సహసామ్రాజ్యానికి వారసుడొక్కడు చాలంటూ అతడు ఆమె గర్భకోశాన్ని నియంత్రించిన సంఘటన ఉన్న ఒక్కగానొక్కడ్ని దగ్గరుంచుకొని చదివిద్దామంటె రాజకీయాల్లో ఉండేవాళ్ళు పిల్లల్ని దగ్గరుంచుకోటానికి లేదంటూ అతడు కొడుకును ఊటీ స్కూల్‌కు పంపిన సంఘటన ఆమెకు గుర్తువచ్చి తనకాలి సంకెళ్ళు ఎంత బలమైనవో తెలిసివచ్చింది.

మాధవికి చేతులు జోడించి ఓట్లడుగుతూ ఊళ్ళోతిరుగుతున్న తనకి తాను వేపచీర కట్టుకొని దీపాన్నుంచిన వేయిళ్ళకుండని చేతిలోపట్టుకొని గంగజాతరలో తన ప్రమేయమేమీ లేకుండా ఒక పూనకంతో నడిచే మనిషిలాగా అనిపించింది. పద్ధతి ప్రకారం గెలుపును కోరుకోవటానికి ఊరిదేవత గుడికి వెళ్ళాల్సి వచ్చింది మాధవి. అమ్మా... ఈ అంకమ్మ మన ఊరిదేవత మనస్ఫూర్తిగా నమ్మి మనమేది కోరుకుంటే అది జరిగి తీరుతుంది. మీక్కూడా దైవభక్తి చాలా ఎక్కువ కదా దణ్ణం పెట్టుకోండమ్మా అని పనిమనిషి చెప్పిన మాటలు ఆమెలో ఆలోచనలను కదిల్చాయి.

నిజమే తనకి దైవభక్తి చాలా ఎక్కువ. ఎందుకెక్కువయింది. ఇది వరకు లేదే. అతడి నీడలో ఈడ్చే బ్రతుకు చప్పదనాన్ని అతని నిర్లక్ష్యాన్ని తట్టుకోవడం కోసం విలువల ముళ్ళ కిరీటాన్ని జాగ్రత్తగా ధరించే క్రమంలో నేను దేవుడ్ని ఆశ్రయించాను అనుకుంటుందామె. పురుషుడి అహంకారపు అధికారపు పడగనీడలో బ్రతికే స్త్రీ జీవితంలోని ఒంటరి వేదన, విషాదం అక్కడ వ్యక్తమవుతాయి. ఆమె భర్త ఎదురైపోలింగు ధోరణి గురించి ప్రశ్నించాడు. చూసినంత వరకు బాగానే జరుగుతోంది. అని ఆమె సమాధానమిచ్చింది. మూడో నెంబరు బూతువద్ద గలాటా జరుగుతోందట నువ్వింక యింటికెళ్ళిపో తిరిగింది చాలు నేన్చూసుకుంటాను, అని అతడు ఇచ్చిన ఆదేశాలను విని ఆమె విస్తు పోయింది. ఏమైనా ఎన్నికల అనుభవం ఆమెకు తన అధీనతను అన్యతంత్రతను మరొకసారిస్పష్టం చేసింది. రాజకీయాలలో భాగస్వామ్యం ద్వారా పొందగల సాధికారతలోని మాయ గురించి మొహం మీద గుద్దినట్లు చూపింది. గెల్చిన తర్వాత ప్రమాణ స్వీకారం రోజు ఆమెకు ఎదరైన అనుభవం దానిని స్థిరీకరించింది.)

ఎప్పుడూ అడుగుపెట్టని దొరసాని ఈ విధంగా ఆఫీసుల చుట్టూ తిరగడమేంటి మాటాలా? అనుకొన్నవాళ్ళు కొందరయితే, అయినా యిదంతా 33% రిజర్వేషన్ మహిమ ప్చ్... అని పెదవి విరిచినవారు కొంతమంది. ఆ ఈ రోజంటే ప్రమాణ స్వీకారం చేయడానికొచ్చింది. కాని ఆమెదేముంది. అంతా రాజేంద్ర రెడ్డిదే కదా ఆయన రానిస్తాదా ఆమెని ఆఫీసుకి, సంతకాలు మాత్రం చేయించుకుంటాడింటికాడ తెలియని తనంతో స్వచ్ఛంగా అంటున్నాడో, తెలిసి వ్యంగ్యంగా అన్నాడో గాని అతడన్న మాటలు స్పష్టంగానే ఆమె చెవినబడ్డాయి. నిజమే యివాళ ప్రతిచోటా జరుగుతున్న భర్త చాటు భార్య రాజకీయాల గురించే మీ వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. దీని గురించి తప్పుపట్టడానికేమీ లేదు అని ఆమె అనుకొన్నది.

రాత్రంతా మామగారూ, రాజేంద్ర పంచాయితీ గురించి చాలాసేపు మాట్లాడుకున్నారు. అందులో భాగంగా మాధవి పంచాయితి ఆఫీసుకి వెళ్ళాల్సిన అవసరం లేదని చర్చించి నిర్ణయం తీసుకున్నారు. తన అభిప్రాయంతో నిమిత్తం లేకుండా తన గురించి వాళ్ళు తీసుకున్న నిర్ణయమది. దానికి ప్రతిచర్యకు ఏ మహిళ అయినా పార్టీ పేరు చెప్పుకుని భర్త చాటు రాజకీయం చేస్తూ మనుగడ సాగించడం కంటే చురుగ్గా వ్యవహరిస్తూ ప్రజల్లోకి చొచ్చుకుపోగల్గాలి అని ఆమెకు గట్టిగా అనిపించింది.

వందల వేల ఏళ్ళ నుండి మగాడు రాజ్యమేలుతున్న సింహాసనాన్ని స్త్రీ గెలుచుకోవడం ఎంతో బావుంది. ఆదర్శాలు వల్లించడం స్త్రీకి చేతగాకపోయినా సమానత్వం, న్యాయం, నిజాయితీలను ఆమె ప్రేమిస్తుంది. కనుక భర్త నిర్ణయానికి వ్యతిరేకంగా తనపని తానే చేసుకొవాలని దృఢంగా అనుకొంటుంది. అకౌంటెంట్‌కి ఫోన్‌చేసి పంచాయితీ పాత అకౌంట్ పుస్తకాల్ని మిగిలిన అన్ని లెక్కల్ని తీసుకొని ఉ॥ పదిగంటల కల్లా ఆఫీస్‌కొచ్చేయమని చెప్పింది.

కొత్తగా వేలికి తొడిగిన రాజముద్రికతో అవినీతిని సాధికారికంగా రఖలిపించగలగడం ఎంత బావుంది. సుదీర్ఘకాలంగా జరిగిపోయిన గాధల్ని, దుఃఖాల్ని తిరగరాయడం కోసం ఈ ప్రపంచాన్ని మన చేతుల్లోకి తీసుకోగలగడం ఎంత బావుంది. అనుకొంటున్న మాధవి సాధికారత కొరకు తొలి అడుగులు వేస్తున్న మహిళలకు ప్రతినిధిగా నిలించింది.



ఫలానా అతని భార్య ఫలానాతని కూతురు, ఫలానాతని తల్లి అనే గాని స్త్రీకే ప్రత్యేకమైన గుర్తింపు లేదు. ఏదో స్త్రీలకు 33% రిజర్వేషన్ ఉంది కాబట్టి మొక్కుబడిగా రాజకీయంలోకి తీసుకోవడం జరుగుతుంది. ప్రచారానికి, ప్రమాణ స్వీకారానికే తప్ప స్త్రీలు జరగాల్సిన పనులలో స్వయంగా తెల్సుకొని నిర్ణయించే అధికారం గాని, అవకాశం గాని ఉండదు. భార్య పేరు మీద నామినేషన్ వేసే విషయం కూడా ముందు ఒక్కమాట కూడా ఆమెతో ప్రస్తావించలేకపోవటం పురుషాధిక్యత కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది. పోలింగ్ బూతుల దగ్గర గొడవలు జరుగుతుంటే మాధవిని ఇంటికెళ్ళమని ఆర్డర్ చేయటం ఆడదానివి నువ్వేమి చేస్తావు? నేను చూసుకుంటాలే అని ఇక్కడ పురుషాధిక్యతనే ప్రదర్శించాడు. ప్రమాణ స్వీకారం దగ్గర ప్రజలు మాట్లాడే మాటలను బట్టి స్త్రీలు వంటింటి పని. పిల్లల్ని సవరిచంటం తప్ప రాజకీయం చేయలేరని తక్కువ చేసి మాట్లాడడం కన్పిస్తుంది. పురుషుడి రాజకీయ దాహానికి మాధవి గర్భకోశాన్ని నియంత్రించడం, ఉన్న ఒక్క కొడుకుని తల్లికి దూరంగా ఉంచటం రాజేందర్ రెడ్డి స్త్రీని ఒక ఆటబొమ్మగా చూశాడే తప్ప స్త్రీ కూడా మనుసున్న మనిషి అన్న స్పృహతో ప్రవర్తించలేదు.

నల్లూరి రుక్మిణి రాసిన గెలవలేని ఆట కథ 2002 జూన్ విపులలో ప్రచురించబడింది. కమల దృషికోణం నుండి ఈ కథ నడుస్తుంది. ఆమె అంత రంగపు ఆలోచనలుగా ఆమె రాజకీయపు జీవితానుభవం ఇందులో చిత్రితమైంది. కమల అయోధ్యరామయ్య కూతురు జాతీయోద్యమ ప్రభావంతో కమలను బడికి పంపించాడు. పిల్లలపట్ల స్వేచ్ఛగా ఉండేవాడు. ఆడపిల్ల అని కమలను ఏనాడు ఆంక్షల్లో పెట్టలేదు. ఆస్తులు తగ్గుతూ రావటంతో చదువు ఆపి, కమలకు పెళ్ళి చేయాలన తొందరపడ్డాడు. పెళ్ళితో, పిల్లలతో పూర్తిగా సంసారంలో మునిగి పోయింది కమల. బయటి ప్రపంచంతో సంబంధంలేకుండా అన్నేళ్ళు జీవితం సాగించిన కమలకు పిల్లలు పెద్దవారయ్యాక దూరపు బంధువు సుభద్ర వలన మహిళా మండలి పేరుతో బయటి ప్రపంచంతో సంబంధం ఏర్పడింది.

కొద్ది రోజుల్లోనే కమల నల్గురి నోళ్ళల్లో పడింది. అన్నేళ్ళుగా ఇంట్లో చేసిన అల్లికలు, కుట్లకుట్టిన ప్రావీణ్యం మహిళా మండలి పోటీల్లో పనికి వచ్చింది. ప్రతిపోటిలో దాదాపు కమలకు ప్రైజు వచ్చేది. మెల్లిగా మహిళా మండలిలోని ఇతర సభ్యులతో పరిచయాలు పెరిగి చనువు ఏర్పడసాగింది. ఏ ఫంక్షన్ జరిగినా కమలను ప్రత్యేకంగా ఆహ్వానించడం, పెద్దవాళ్ళ ఇళ్ళకు వెళ్ళడం కమలను మరో ప్రపంచంలోకి తెచ్చి పడేసినట్లైంది.

గ్రామీణ వాతావరణపు నిర్భయత్వం సదురూ బెదరూ లేకపోవడం మాటకారితనం కలిసి వచ్చిందామెకు. పైగా చిన్ననాటి నుండి తండ్రి అయోధ్యరామయ్య ప్రభావం కొంత ఉండనే ఉంది. కమల ఒక్కసారిగా వదిమందిలోకి రావడంతో చొరవగా అల్లుకుపోవడం మొదలుపెట్టి ఉచిత నేత్ర వరీక్షలు, తుఫానులు వస్తే రిలీఫ్ కార్యక్రమాలు వీటికోసం విరాళాల సేకరణ, పంచదాలు మహిళాదినోత్సవాలు మొదలైన కార్యక్రమాలలో పాల్గొనసాగింది. ఇదంతా కమల భర్త జగన్నాధరావుకు ఇష్టముండేది కాదు. ఇంతకు ముందులాగా అతను ఇంటికొచ్చేటప్పటికి భార్య ఎదురు చూస్తూ ఉండడం లేదు. ఇంత ఉడకేసి అక్కడ పడేస్తుంది. దీనితో అతనికి అసంతృప్తి కలగసాగింది. ఇంటికొచ్చి తన స్కూలు తన ఉద్యోగం, పిల్లలకు తనంటే ఎంతో హడలో, టీచర్లు తన మాటకు ఎంత విలువ ఇస్తారో, స్కూలుని ఎంత డిసిప్లిన్‌గా నడుపు తున్నానోనంటు మనసారా తృప్తిగా గొప్పలు చెప్పుకొనేవాడు. ఇంట్లో భార్య తన ఘనత వినడానికేనని ఇతని నమ్మకం. ఆ సౌకర్యం పోయి చెప్పుకోడానికి మనిషి కరువైపోయేటప్పటికి జగన్నాధరావు మనసు అసంతృప్తితో వేగిపోయింది.

ఈ సంధిగ్ధావస్థలోనే మున్సిపాలిటీ ఎన్నికల్లో భార్యను నిలబడవద్దని వారించాడు. కాని కమల భర్త అభ్యంతరాల కన్నా, బయటివారి ప్రోత్సాహంతో వార్డు మెంబరయి, మహిళా మండలి స్థాయి దాటి రాజకీయాలలోకి అడుగుపెట్టింది. కొత్త పరిచయాలు, రాజకీయాల్లో ఉండే హోదా, పరపతి మెల్లగా అర్థంకాసాగాయి. అందరితో చొరవగా ఆత్మీయంగా మాట్లాడి నల్గురితో ఔననిపించుకోవడం ఆమె కోరుకుంది. మున్సిపాలిటీ మెంబరయ్యాక పార్టీ ముఖ్యుల దగ్గర పేరు సంపాదించుకుంది.

కమల తన చేతిలో అధీనంలో ఉన్న విషయాలు తన నేర్పుతో సాధించుకుంది. కాని తన చదువు తనకు అడ్డంకిగా మారింది. ఒక రోజు ఇంగ్లీష్‌లో వచ్చిన టెలిగ్రామ్ చూసుకొని మీటింగ్‌కి అర్జంట్‌గా రమ్మన్నారని హడావుడిగా లగేజి సర్దుకుంటుండగా తనతోటి మున్సిపాలిటీ మెంబరైన సరళ రావడం కమల టెలిగ్రామ్ చూపించడం టెలిగ్రామ్ చూసిన సరళ ముసిముసి నవ్వులు నవ్వి కమలకు అది అర్థం కానందుకు ఆనందపడి నిన్ను అర్జంట్‌గా రమ్మనడం కాదు రేపు అర్జంట్ మీటింగుంది నిన్ను రమ్మన్నారని చెప్పింది.

సరళ విషయం అందరికి చెప్పటంతో చదువు రాని వాళ్ళకు కూడా రాజకీయాలు కావల్సి వచ్చినాయని గుసగుసలు ప్రారంభమయ్యాయి. దాంతో ఖంగుతిన్న కమల భర్త దగ్గర ఇంగ్లీష్ నేర్చుకోవాలని అనుకుంది. కాని కమల రాజకీయాల్లో దిగడం ఆయనకు సుతరామూ ఇష్టం లేదు. ఇప్పటికే తనను అంతగా లెక్క చేయడం లేదని అతని బాధ. ఇంకా చదువుకుని ఇంగ్లీష్ పరిజ్ఞానం కూడా వస్తే తన కంట్రోలు అసలే ఉండదని అతని దుగ్ధ. అందుకే నేర్పనని ఆమెతో ఘర్షణపడే కంటే ఎలాగోలా తప్పించుకోవడం మేలనుకున్నాడు. ఏదో పని ఉందనేవాడు. తప్పనిసరై పుస్తకం తీసినా రెండు ముక్కలూ అర్థం కాకుండా చెప్పేవాడు.

ఆమె రాజకీయాల కోసం రోజూ అతడు తిరగాల్సి వస్తుందని భార్య మీద విసుక్కున్నా, కమల రాజకీయాల వల్ల ఒనగూడే వనరులపై ఆమె భర్తకు మక్కువ ప్రారంభమైంది. తనకేమి ఇష్టమేలేనట్లు నటించినా అంతరాంతారాల్లో జగన్నాధానికి సంపాదన పట్ల హోదాపట్ల ఆశలు పుట్టాయి. వాడి పని చేయించు వీడిపని చేయించు అంటు ప్రతివాడినీ మెడకు తగిలించి తాను డబ్బు వసూలు చేసుకునేవాడు. ప్రతీసారీ ఏదో ఒకటి లింకులు పెట్టి ఏనాడు తన చేతిలో డబ్బు ఉండనిచ్చేవాడు కాదు.

రాజకీయాలు పర్మినెంట్‌గా ఉండవనడానికి మళ్ళీ వచ్చిన అసెంబ్లీ ఎన్నికల్లో కమల ఉన్న పార్టీ ఓడిపోవటం నిదర్శనం. అప్పటికింకా చైర్మన్ పదవికి రెండేళ్ళు గడువుంది. పార్టీ ఓడిపోవడంతో తన పదవి పోతుందేమోనని భర్త తొందరపడి ఆమెను ఆలోచించుకోనివ్వకుండా పదవిపోతె రోజూ వచ్చే డబ్బు పోతుందని ప్రతిపక్షమైన పాలక వర్గంలో చేరిపిస్తాడు. దీనితో సొంత పార్టీ వాళ్ళు ఆమెను దుయ్యబట్టారు. జనం దృష్టిలోనూ ఆమె పలుచనయింది. పదవికోసం పాకులాడిందనే అపవాదు వచ్చింది. జగన్నాథం రాజకీయాధికారం కల కమలను తన చెప్పు చేతల్లో పెట్టుకోవాలనే అనుకొన్నాడు గాని కమలకు ఇంగ్లీష్ నేర్పాలని మనస్ఫూర్తిగా ఎన్నడూ ప్రయత్నం చేయలేదు. ఆమెకు చదువు వచ్చి ఇంగ్లీష్ నేర్చుకొని స్వతంత్రంగా పనులు ఆమె నిర్వహించుకుంటే తన చెప్పు చేతల్లో ఉండదని అనుకొన్నాడు. పెత్తనం ఆమె మీద సాగించాలంటే ఆమెకి ఏమీ తెలియకుండా చేసి తన గుప్పిట్లో పెట్టుకొని గంగిరెద్దులా ఆడించటమే సరియైనది అని అనుకొన్నాడు. ఈ పరిస్థితే కమలను ఒక్కపని స్వతంత్రంగా చేసి నలుగురిలో మెప్పు పొందలేని ప్రతి వెధవకూ పెళ్ళాలే లోకువ అని అనుకొనేట్లు చేసింది.

మహిళా విభాగాన్ని పాదులు చేసి నీళ్ళుపోసి చెట్టును పెంచినట్లు కష్టపడి వృద్ధి చేసింది. ఫలితాలివ్వబోతున్న దశలో అనుభవించాలనే వాళ్ళు ఎక్కువయ్యారు. ఆమెను పదవి నుండి తప్పించడానికి ప్రయత్నాలు చల్లగా జరిగాయి. తనకు ఇంగ్లీష్ రాదన్నది అందుకు ఒక నెపం అని ఆమెకు అర్థం అయింది. కమల సమావేశంలో అదే మాట్లాడింది. మీరంతా పలుకుబడి కల్గిన కుటుంబాల నుండి వచ్చినవాళ్ళు మీ తాతలు, తండ్రులూ ఉద్యమాలను రాజకీయాలను ఉపయోగించుకొని కోట్లకుకోట్లు సంపాయించినవారు. నా తండ్రి వున్న పొలం కూడా రాజకీయాల కోసం అమ్ముకున్నాడు. మీలాంటివాళ్ళు ఏ వనరులూ లేని పల్లెటూళ్ళకూ, మురికి పేటలకూ వెళ్ళి దుమ్ములో, బురదలో ఇంటింటికీ తిరిగి మీకు ఓట్లు తెచ్చి పెట్టినప్పుడు అక్కరలేని ఇంగ్లీష్ పరిజ్ఞానం ఇవ్వాల పట్టుచీరలు కట్టుకుని ఒంటినిండా బంగారం వేసుకుని మనుషుల వెనుక గోతులు తవ్వడానికి పనికి వచ్చిందా? తన ఆవేదనను వెళ్ళగక్కింది.

ఎప్పుడైతే మహిళా రిజర్వేషన్‌లకు ప్రాధాన్యం పెరిగిందో మహిళా విభాగాల్లో ముఠారాజకీయాలు ఎక్కువ కాసాగాయి. కమల నిచ్చెన ఎక్కినట్లే ఎక్కితిరిగి అగాధంలోకి పడిపోయింది. గెలవలేని ఆట కథని ఇతివృత్తాన్ని బట్టే రాజకీయ రంగంలో స్త్రీల భాగస్వామ్య స్థితి గురించి ఈ క్రింది నిర్ధారణలకు రావచ్చు. మొత్తం మీద ఈ కథ రాజకీయ రంగం పురుషుల పరంగా అభివృద్ధి చెందిన రంగం కనుక అందులో స్త్రీలు తమ సామర్థ్యాన్ని నిరూపించుకోవటం, నిలదొక్కుకోవటం అసాధ్యం అవుతున్నది.

రాజకీయ రంగంలో స్త్రీల పురోగతికి ఇంట్లో భార్యగా ఆమెకుండె అధీనస్థితి అవరోధం అవుతున్నది. భర్త అధికారం పరిధినుండి బయటపడి స్త్రీలు రాజకీయ అధికారంతో విస్తరించటానికి ఇంటాబయట ఆమోదం లేదు. పురుషులదైన రాజకీయరంగంలో స్త్రీలను ఎక్కిరాకుండా చేయటానికి, ఉపాంతీకరించటానికి ఏకారణమైన ఒక నెపం కావచ్చు. ప్రస్తుతం కథలో ఇంగ్లీష్ రాకపోవటం అందుకు అవరోధం అయింది. చదువు సంధ్యలు లేని పురుషులెందరో రాజకీయ రంగాలలో పురోగమిస్తుండగా అది స్త్రీకే అవరోధం కావటం జండర్ అసమానతలను సూచిస్తుంది.

పార్లమెంటు రాజకీయాలు అధికార రాజకీయాల కుతంత్రాలలోకి, కుమ్ములాటలలోకి స్త్రీలను కూడా లాగుతాయి. అప్పుడవి డబ్బు, రాజకీయ వారసత్వం పలుకుబడి కలిగిన కుటుంబాల స్త్రీలవే అవుతాయి. కానీ సామాజికంగా ఆర్థికంగా విద్యాపరంగా వెనుకబడిన వర్గాల స్త్రీలకు వాటిలో స్థానం లేకుండా పోతుంది.

స్త్రీలు రాజకీయాలలోకి ప్రవేశించినా స్వతంత్రంగా స్త్రీల ప్రయోజనాల కోసం పని చేసే పరిస్థితి ఏ మాత్రం లేదు. డబ్బుతో, అధికారంతో, అవినీతితో నిండి ఉన్న ప్రధాన స్రవంతి రాజకీయాలలో స్త్రీలకు నెగ్గుకు రావటం కష్టమే అవుతుంది. ఆ రాజకీయాలు పురుషుల కార్యకలాపాలకే అనుకూలంగా ఉన్నాయి. సంఘంలో తన పలుకుబడి, ఆర్థిక ప్రయోజనాల కొరకు పురుషుడు స్త్రీ ద్వారా కూడా ఈ అధికారాన్ని యధాపూర్వకంగా కొనసాగించడం కమల భర్త ప్రవర్తనలో కనబడుతుంది.

ఈ విధంగా ఈ రెండు కథలు స్త్రీల సాధికారతకు సంబంధించిన పితృస్వామిక సామాజిక వాస్తవాలను, అవరోధాలను బహిర్గత పరచటం ద్వారా ఒక హెచ్చరికను చేస్తున్నాయి.

★★★

# ఆరోగ్యవిద్య - ఇంకెంత దూరం

డా॥ ప్రభావతి

'ఆరోగ్య వ్యయం' రాకెట్టులా నింగికెగసిపోతుంటే, 'ఆరోగ్య విద్య' ఎడ్లబండి మీద సవారి చేస్తోంది. గత వందేళ్ళుగా సైన్సులో ఎన్నో ఆవిష్కరణాలు జరిగాయి. ప్రపంచ గతుల్ని మార్చేసిన టెక్నాలజీ మన ముంగిట నాట్యం చేస్తోంటే నోరెళ్ళబెట్టుకుని గుడ్లప్పగించి చూస్తూ మనమూ జతగా నాలుగడుగులు వేస్తోన్న పరిస్థితి! ఈ రసకందాయ పరిస్థితిలో వందేళ్ళుగా అత్యధిక ప్రాణాలను కాపాడిన అతిగొప్ప సైన్సు ఆవిష్కరణ ఏమిటో తెలుసుకుంటే, చాలామంది కన్న తల్లుల, తండ్రుల కడుపు కోతల్ని నివారించలేమా?

ఇంతకీ అది పెన్సిలిన్ మందు? అంటీబయోటిక్ మందులా? లేక నేతి బీరకాయల్లాంటి మన హార్లిక్సులూ, బూస్టులూ, బోర్నవిటాలా? కాదు. గత శతాబ్ధంలో కొన్ని లక్షల మంది పిల్లల ప్రాణాల్ని కాపాడిన ఓ.ఆర్.ఓస్ ద్రావణం (ఒ॥) గ్లాసుడు కాచి చల్లార్చిన నీటికి చిటికెడు ఉప్పు, చారెడు చక్కెర కలిపి ఇంట్లోనే తయారు చేసుకోగలిగే ద్రావణం.




భారతదేశం లాంటి అభివృద్ధి చెందుతున్న దేశాల్లో అతిసారం, కలరాలతో పిట్టల్లా రాలిపోతున్న లక్షలాది పిల్లల్ని ఒడ్డుచేర్చిన రక్షక ద్రావణం. గ్లాక్సో, ఫైజల్, నోవార్టెస్ లాంటి గుత్తాధిపత్య మందుల కంపెనీల ఆవరణల్లో నుంచి ఆవిరైపోయిన అమృతజలం. పేరుమోసిన మందులన్నీ ఇప్పటివరకు కాపాడిన ప్రాణాల కన్నా పూరింట్లో సైతం తయారయ్యే ఒ.ఆర్.ఎస్ ద్రావణం కాపాడిన ప్రాణాల సంఖ్యే ఎక్కువ అంటే విస్మయానికి లోనవ్వక తప్పదు. అయితే విచారించాల్సిన విషయమేమిటంటే భారతదేశంలో యిప్పటికీ అతిసార, కలరాలతో వేలమంది పిల్లలు మరణిస్తున్నారు. ఖరీదైన మందులు కొని తమ పిల్లల ప్రాణాల్ని కాపాడుకోలేని నిరుపేదలు తమ దుస్థితికి తిట్టకుంటున్నారు. ఇదంతా కేవలం వారికి ఈ ఉప్పు చక్కెర ద్రావణం గురించి అవగాహన లేకపోవడం వల్లనే ఎన్ని ఆరోగ్య ప్రణాళికలు రచించినా గ్రామీణ ప్రజలకు ఆరోగ్య విద్యనందించడంలో విఫలమైతే ఎవరు నష్టపోతున్నారు? బూస్ట్ బోర్నవిటాల గురించి ఫామిలీ ప్లానింగ్ కోతల గురించి, అతివల అందాల కనువిందు చిట్కాల గురించి ప్రకటనలు గుప్పించే మీడియాలో ఓ.ఆర్.ఎస్ గురించి ఒక చిన్న ప్రకటనయినా రాదేం? కన్న తల్లుల కడుపు కోత వాళ్ళకు పట్టదా?

మరోవంక ప్రతి ఎండాకాలమూ వడదెబ్బ మృతుల సంఖ్య అలాగే వున్నప్పటికీ ప్రభుత్వానికి చీమకాదు కదా నల్లికూడా కుట్టదు. ఎండలో ఉదయం 8 నుంచి సాయంత్రం 3 గం॥ల వరకు తిరగవద్దని, మంచినీరు రోజుకు పది చెంబుల్దాకా త్రాగమనీ, అప్పుడప్పుడు తడి బట్టతో ఒళ్ళు తుడుచుకోమనీ చెప్పే చిన్న చిట్కాలే కొన్ని వందల ప్రాణాల్ని కాపాడ్తాయి.

ఇంకోవైపు, ప్రసూతి మరణాల రేటు అధికంగా మన దేశంలో కాబోయె తల్లులు సరైన పోషకాహారం లేక, వున్నా ఆహారం మీద అనేక మూఢనమ్మకాలు పెట్టుకొని, రక్తహీనతకులోనై కృశిస్తూంటే నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తున్న ప్రభుత్వం. ప్రభుత్వ దవాఖానాల వరండాల్లో బయట గోడల మీద వున్న ప్రాణాల్ని రక్షించుకునే వివరాలకన్నా, రాని ప్రాణాల్ని నివారించే వివరాల రాతలే ఎక్కువ. ప్రస్తుతం అమల్లో వున్న అనేక కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ప్రసూతి పథకాల వివరాలు ఏ గవర్నమెంటు హాస్పటల్‌లోనైనా గోడల మీద వివరంగా వ్రాసి పెట్టేరా? ప్రజలకు ఈ పథకాల గురించి ఎంత తక్కువ తెలిస్తే అంత మంచిది అన్న ధోరణిలోనే సాగుతోందీ వ్యవహారం.

ఆరోగ్య రంగాన్ని సంక్షేమ దృష్టితో కాక పరిశ్రమ దృష్టితో చూస్తున్న ప్రస్తుత నేపథ్యంలో ఆరోగ్యరంగంలో ప్రభుత్వ పెట్టుబడులు ఎంతో కీలకమైనవి. ఐ.టి రంగంలో విస్తృత అవకాశాలున్నాయనేది ఎంత భ్రాంతో గణాంకాలు చూస్తే తెలుస్తుంది. ఐ.టి రంగంలో ప్రతి కోటి రూపాయల టర్నోవరుకు 10 మందికి ఉపాధి అవకాశాలుంటే ఆరోగ్యరంగంలో అదే టర్నోవరుకు 250 మందికి ఉపాధి అవకాశాలున్నాయి. ఆరోగ్యరంగంలో ప్రభుత్వం పెట్టుబడుల వల్ల మెరుగైనా ఉపాధి కాకుండా ప్రజారోగ్యం కూడా పచ్చని పైరులా కళకళాడుతుందనేది నిర్వివాదంశం. అందుకే ప్రపంచ ఆరోగ్య సంస్థ 2007 సం॥నకు "సురక్షితమైన భవిష్యత్తుకు ఆరోగ్య రంగంలో పెట్టుబడులు కీలకం" అనే నినాదాన్నిచ్చింది. ఆరోగ్యరంగ ప్రణాళికలో 'ఆరోగ్య విద్య'కు సముచిత స్థానం లభించాలి. చిత్తశుద్ధితో అమలు చేయాలి. ప్రపంచ ఆరోగ్య సంస్థ యిచ్చిన నినాదాన్ని మన దేశం కూడా అమలు చేయగలిగితే నేషనల్ హెల్త్ పాలసీ 2001లో అనుకున్న ఈ క్రింది లక్ష్యాల్ని కొంత మేరకైనా చేరుకోవచ్చును.

యన్.హెచ్.పి-2001లో అనుకున్న లక్ష్యాలు 2001-2015 వరకు

1. పోలియోను ఈ సం॥ కల్లా పూర్తిగా నిరోధించాలి - 2005 (నెరవేరలేదు)
2. కుష్టువ్యాధిని ఈ సం॥ కల్లా లేకుండా చేయాలి- 2005 (ఇదీ నెరవేరలేదు)
3. హెచ్.ఐ.వి/ ఎయిడ్స్‌ను పూర్తిగా అదుపులో పెట్టాలి. - 2007 (చేతులెత్తేశాం)
4. 'బోదకాలు'ని నివారించాలి. - 2015 (ఇది కూడా వీలయ్యేట్టు కనిపించడం లేదు)
5. నీటి ద్వారా సంక్రమించే రోగ మరణాల్ని - (2010) టిబి, మలేరియా మరణాల రేటుని 50% పైగా తగ్గించడం (త్రాగునీరే దుర్లభం, ఇహ రక్షిత మంచినీరు మిథ్యే)
6. శిశుమరణాల రేటును వెయ్యికి / 30కి - 2010 తగ్గించడం. (ఇప్పుడు కూడా వెయ్యికి / 60 వుంది కాబట్టి సాధ్యం కాదు)
7. ప్రసూతి మరణాల రేటును లక్షకు / 100కు తగ్గించడం. (ప్రస్తుతం లక్షకు 450 వుంది. కాబట్టి యిదీ వీలుకాదు)
8. ప్రజారోగ్య సౌకర్యాలను ప్రస్తుతమున్న 20% నుంచి 75% పైగా ఉపయోగించుకునేటట్టు చేయడం (రానురాను ప్రజారోగ్య సౌకర్యాలు తగ్గిపోతున్నాయి)
9. ఆరోగ్యరంగ బడ్జెటును 0.9 % నుంచి 2%కు పెంచడం 2010 (డిమాండ్‌గానే మిగిలిపోయేటట్టుంది)

ఇలా... యింకా చాలా చాలా లక్ష్యాల మొగ్గల్ని యిముడ్చుకున్న 'నేషనల్ హెల్త్ పాలసీ 2001 భారతదేశ వనంలో విరబూయదానికి పెట్టుకున్న కాలపరిమితి సరిపోయేనా? మొగ్గదశలోనే వాటిని చిదిమివేయకుండా కాపాడుకొని పెంచిపోషించాల్సిన బాధ్యత ప్రభుత్వంతో పాటు అందరిదీ. లేకపోతే ప్రజల కన్నీళ్ళ సునామీలకు ప్రభుత్వం కూడా తుడిచి పెట్టుకోక తప్పదు.

## క్యూబా వీరవనిత విల్మా ఎస్పిన్

వీరవనిత విల్మా ఎస్పిన్. తీవ్ర అనారోగ్యంతో వున్న విల్మా (77) 2007 జూన్ 18న మృతి చెందారు. ఆమె మృతిప్రపంచ మహిళా ఉద్యమానికి తీరనిలోటు. క్యూబాలో 1960 ఆగస్టు 23వ తేది ఫెడరేషన్ ఆఫ్ క్యూబన్ ఉమెన్ సంస్థను విల్మా ఏర్పాటు చేశారు. ఆ సంస్థకు అధ్యక్షురాలిగా 2000 సంవత్సరం వరకూ ఆమె ప్రతి మహాసభలోనూ ఏకగ్రీవంగా ఎన్నికవుతూనే వున్నారు. స్త్రీ పురుష సమానత్వం కోసం అనేక ఉద్యమాలు నిర్వహించారు. క్యూబా విప్లవ విజయం తర్వాత ఆమె క్యూబన్ మహిళలు, పిల్లల కోసం నిరంతరాయంగా కృషి చేశారు. క్యూబా ప్రభుత్వంలో అత్యున్నత సంస్థ కౌన్సిల్ ఆఫ్ స్టేట్‌లో ఆమె సభ్యురాలు. ఆమె మృతికి ఐద్వా నివాళులర్పిస్తోంది.

## పేదల భూ ఆక్రమణ పోరాటం

ఆగదు ఆగదు ఈ పోరాటం
భూ ఆక్రమణ ఈ పోరాటం
చంకన బిడ్డ చేతిలో జెండా
కన్నులలోన ఆక్రోశం నిండా
కదం తొక్కినది మహిళా లోకం
పాములు కోరలు పెరికి వేయగా
చీమల పుట్ట పగిలింది
అడ్డ మీద కూలీలు
తాపి పని చేసేటోళ్ళు
పాచి పనులు చేసేటోళ్ళు
మాలీన గుడ్డలు ఉతికేటోళ్ళు
ఆకాశ బంగ్లాలకు రంగులేసేటోళ్ళు
రోడ్లు ఊడ్చి మురికినెత్తెటోళ్ళు
తల దాచుకొను గుడిసెలేని గరీబోళ్ళు
మురుగు కంపులో బ్రతుకులీడ్చే బక్కకులపోళ్ళు
చీమల దండులా సాగారు.
భూ బకాసురుల నెదిరించారు.
లాఠీ విరిగినా - తూటా పేలిన
భూ ఆక్రమించుకుంటారు.
ఐద్వా సంఘ నీడలో ఏకమై పోరుతారు
బడాబాబుల తొత్తు ప్రభుత్వమా
సాగ నివ్వరు ఇంక నీ ఆటలు

- పొన్న అంజయ్య

చైతన్య మానవి పై

అభిప్రాయాలను, సలహాలను ఆహ్వానిస్తున్నాం.

మా చిరునామా :
**చైతన్య మానవి**
1-8-538/4, చిక్కడపల్లి, హైదరాబాద్ - 20.
ఫోన్ : 27605845, ఫ్యాక్స్ : 040 - 27605845

# బ్యాడ్ అంకుల్



కె. అంజన

"బుజ్జీ! నీకోసం ఏం తెచ్చానో చెప్పుకో..." అంటూ నవ్వుతూ వచ్చాడు శ్రీధర్.

అతణ్ణి చూసి నిర్మల సంతోషంగా...

"రా...శ్రీధర్! ఏంటి నిన్న, మొన్న కంటికి కనిపించలేదు. రోజూ వచ్చి బుజ్జిని ఆడించేవాడివికదా. నువ్వు రాకపోయేసరికో ఏమో అది మూడీగా వుంది. తనను నువ్వే ఆడించాలి ఇవాళంతా. ఆఫీసులో పెండింగ్ వర్క్ వుంటే ఇంటికి పట్టుకొచ్చాను. దాని సంగతి చూడాలి...." అంటూ ఫైల్లో తల దూర్చింది.

వీళ్లిద్దరి మాటలు విన్న ఆరేళ్ల బుజ్జి మొహం చిట్లించింది గబగబా మంచం చాటున దాక్కుంది. పాప ఎక్కడుందో తెలీక ఇల్లంతా వెతకసాగాడు శ్రీధర్. ఎక్కడా కనిపించలేదు. దాంతో

"అక్కా....నీ బుజ్జి బంగారం ఎక్కడో దాక్కుంది. నేను ఎంత వెతికినా కనిపించలేదు. ఇదిగో తనకోసం తెచ్చిన ఐస్‌క్రీమ్ కరిగిపోతోంది. ఇలాగే అయితే అది కారిపోవాల్సిందే....." అన్నాడు.

ఫైల్లోంచి తల తిప్పకుండానే అతని మాటలకు ముసిముసిగా నవ్వుకోసాగింది నిర్మల.

బుజ్జికి మాత్రం చాలా కంగారుగా వుంది. శ్రీధర్ దగ్గరకు రావడం ఇష్టంలేదు. ఐస్‌క్రీమ్ వదులుకోవడం అంతకన్నా ఇష్టంలేదు. ఏం చేయాలో అర్థంకాలేదు. చిట్టితల్లి ఆలోచించీ ఆలోచించీ మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ బయటకు వచ్చింది. కానీ మళ్లీ ఎందుకో ఏదో గుర్తొచ్చినట్టు పరుగెత్తుకుంటూ వెనక్కి వెళ్లిపోయి దాక్కుంది.

ఐదునిముషాల పాటు చూసీచూసీ "అక్కా... నేవెళుతున్నా. బుజ్జికి నామీద బాగా కోపం వచ్చినట్టుంది. రేపొస్తాలే... ఈసారి చాలా పే...ద్ద ఐస్‌క్రీమ్ తెస్తా" చివరి వాక్యాన్ని పెద్దగా అంటూ వెళ్లిపోయాడు. అతను వెళ్లాడన్న విషయాన్ని నిర్ధారణ చేసుకున్నాకే బయటికి వచ్చింది బుజ్జి.

++++

వారం తర్వాత శ్రీధర్ మళ్లీ వచ్చాడు. ఈసారి బిస్కట్లు, కేకులు, చాక్లెట్లు తెచ్చాడు. అవన్నీ బుజ్జికి ఎంతో ఇష్టమైనవి. వాటిని తింటూ అతని దగ్గరే కూర్చుంది. నిర్మల ఆఫీసుకు వెళ్లే హడావిడిలో వీళ్ల గురించి పట్టించుకోవడానికి కూడా వీలు కాలేదు. కాసేపట్లోనే బుజ్జి ఏడుస్తూ....అమ్మ దగ్గరకొచ్చింది. శ్రీధర్ వెళ్తున్నానని చెప్పి వెళ్లిపోయాడు. ఆఫీసుకు వేళవుతున్నా...కూతుర్ని బుజ్జగిస్తూ...ఏడుపుకు కారణం అడిగింది. వెక్కి వెక్కి ఏడుస్తోందికానీ పెదవి విప్పట్లేదు. మామూలు విషయానికి తను అంతగా ఏడవదని నిర్మలకు తెల్సు.

"మొద్దు వెధవ! శ్రీధర్‌గాడే ఏదో చేసుంటాడు..." అనుకుంది మనసులో.

ఎప్పటిలానే తర్వాత ఓరోజు శ్రీధర్ వచ్చాడు. బుజ్జికోసం ఏవేవో తెచ్చాడు. ఒళ్లో కూర్చోబెట్టుకుని తినిపిస్తున్నాడు. పసిది తింటోంది..... కానీ శ్రీధర్ చేతులు మాత్రం బుజ్జి వంటిమీద ఎక్కడెక్కడో తడుముతున్నాయి. అయిష్టంగా వాటిని విదిలించుకుంటోంది బుజ్జి. అటుగా వచ్చిన నిర్మల ఇదంతా చూసి... శిలా ప్రతిమే అయింది. అస్సలు ఊహించనేలేదు అలా జరుగుతుందని. ఈమధ్య శ్రీధర్ వస్తే బుజ్జి ఎందుకు దాక్కుంటోందో అప్పుడర్థమైందామెకు. వెంటనే కోపంతో ఊగిపోయింది. పూనకం వచ్చిన దానిలా...ఒక్క పరుగున వెళ్లి బుజ్జిని లాక్కుని గుండెలకు హత్తుకుంది. అంతటితో ఆగక ఆవేశంగా శ్రీధర్ రెండు చెంపలూ బలం కొద్దీ వాయించింది.

"వెధవా! నీ దరిద్రపు మొహం నాకు మళ్లీ చూపించకు. మా ఇంటి ఛాయలకు వచ్చినా ఊరుకోను. నడువ్ బయటికి..." అంటూ నిప్పులు చెరిగే కళ్లతో కుడిచేతిని వాకిలివైపు చూయించింది. శ్రీధర్ తల దించుకుని మారు మాట్లాడకుండా వెళ్లిపోయాడు.

(తరువాయి 28వ పేజీలో....)

# ఆమె శరీరంపై హక్కు ఆమెదే!

మల్లాది సుబ్బమ్మ

హిందూ ధర్మశాస్త్రాలు (చట్టాలు) చాలా చిత్రాతి చిత్రంగా వుంటాయి. రెస్టిట్యూటషన్ ఆఫ్ కంజుగల్ రైటు (వివాహవిధి పాటించమని కోరుట) అంటే "దాంపత్య జీవితం గడుపుటకు కలిసి కాపురం చేయవలసిందని భార్య భర్తను, భర్త భార్యను హిందూ వివాహపు శాసనం తొమ్మిదవ సెక్షన్ ప్రకారం కోరవచ్చును. దీనికై సివిల్ కోర్టులో పిటీషన్‌పెట్టి కోర్టు ఉత్తరువు పొందవచ్చు. ఇదొక శాసనమైతే, "పిల్లల్ని కనడానికి ముఖ్యంగా కుమారుని కనడానికి భార్య నిరాకరిస్తే భర్తకు విడాకులు పొందే హక్కు వుంది". అనేది పంజాబ్ హైకోర్టు తీర్పు. ఒక ఉద్యోగిని రెండు సం॥ల కాపురంలో రెండుసార్లు కడుపువస్తే రెండు సార్లు గర్భస్రావం చేయించుకుంది. బిడ్డల్ని కనకుండా తనను చిత్రహింసచేస్తున్నట్లు నేరారోపణచేస్తూ భర్త విడాకులు కోరాడు. క్రింది కోర్టు విడాకులిచ్చింది. హై కోర్టు ఖాయపరచింది. జడ్జిమెంటులో "తన భార్య ద్వారా సంతానం పొందాలని భర్తకు సహజమైన, న్యాయసమ్మతమైన కోర్కె వుంటుంది. అది నిరాకరించబడితే అతడు నిరాశకు లోనవుతాడు. అది అతని మానసికారోగ్యానికి భంగకరం. పితృరుణం తీర్చుకోవడానికి, పిండాలు వదలడానికి కుమారుడు కావాలని హిందువులు ఆకాంక్షిస్తారు. అలాంటి కుమారుని ప్రసాదించడానికి భార్య నిరాకరిస్తే ఆమె భర్తపైన హింసకు పూనుకున్నట్లే" అంటూ తీర్పు ఇచ్చింది పంజాబ్ హైకోర్టు. ఇలాంటి చట్టాలలో వింత వింత తీర్పులతో నల్లిలా నలిగిపోతుంది భారతనారి. అసలు బ్రిటీష్ శాసనం ప్రకారం కుమారుని కనకపోతే భార్యకు శిక్షలేదు. వంధ్యాత్వం (గొడ్రాలు) విడాకులకు కాని వేరుగా విడిపడి వుండటానికి కానీ కారణం కాదు. అసలు కుమారునికనగల శక్తి స్త్రీకి వున్నదో లేదో నిర్ధారణ చేయగలశక్తి ఏ వైద్యశాస్త్రానికీ లేదు. మరి కుమారుడిని కనమని శాసించటం ఎంతవరకు సబబో ఆలోచిస్తారా? అలాగే బలవంతంగా బంధించి కాపురం చేయమంటే అక్కడ నిజమైన ప్రేమా ఆప్యాయతలు ఉంటాయా?

ఇటీవల ఆంధ్రాలో ఇలాగే ఒక కేసు జరిగింది. తనతో సహజీవనం సాగించమని ఒక భర్త భార్యపై పిటీషన్ పెట్టాడు. ఆ పిటీషన్‌ను సవాల్ చేస్తూ బలవంతపు సంసారంవల్ల తనకు నష్టమని ఆమె వాదించింది. 14,19,21 రాజ్యాంగ అధికరణలలో వున్న సూత్రాల ప్రకారం చట్టం దృష్టిలో అందరూ సమానులేనని, వ్యక్తి స్వేచ్ఛకు భంగం వాటిల్లరాదని కనుక హిందూ వివాహ శాసనం 9వ సెక్షన్ చెల్లదని ఆమె హైకోర్టుకు ఫిర్యాదు చేసుకొన్నది. బలవంతపు పొందు మానవత్వానికి, ఆత్మగౌరవానికి తీరని ద్రోహం అని సరిక్రొత్త నిర్వచనం చేస్తూ జడ్జి తీర్పు ఇచ్చాడు. ఈ తీర్పు భార్యాభర్తల లైంగిక సంబంధాలలో నూతనాధ్యాయాన్ని సృష్టించింది.

ఇష్టమూ, సంతోషము, ఆత్మీయతాలు, ఆనందాలతో పరస్పర సమ్మతితో జరగాల్సిన స్త్రీ పురుషుల పొందును బలవంతంగా, శాసనబలంతో జరిపితే అది రాక్షసరతి అవుతుంది. ఆ కలయిక మానవధర్మ వ్యతిరేకం. ఆ మాటకొస్తే పశుపక్ష్యాదుల జీవిత ధర్మానికి కూడా వ్యతిరేకమే. స్త్రీ అంటే కేవలం ఒక విలాస వస్తువనే భావంతో తాను కోరినప్పుడల్లా ఆమె తనకు సెక్సుదాహం తీర్చాలనే అనాగరిక భావం గల పురుషులకు ఈ తీర్పు గొడ్డలిపెట్టులాంటిది. ఆత్మాభిమానం, వ్యక్తిత్వం గల మహిళలకు అమృతంలాంటిది. హిందూ వివాహ శాసనపు నింబంధనల ప్రకారం పెళ్లి చేసుకున్న జంట దాంపత్య జీవితం గడపటానికి అంగీకరించినట్టు ఎంచుకోవాల్సి వుంటుంది. ముఖ్యంగా భర్త మాంగల్యమనే తాడు ఆమె కంఠానికి బిగించి ఆమె తను, ధన, మనః ప్రాణాలపై సర్వాధిపత్యాన్ని అనుభవించగల 'లైసెన్సు'ను పొందడాన్ని ఆ వివాహపు తంతు వివరిస్తోంది. ఇది మన ఆచారాల ద్వారా అనుభవంలో జరుగుతున్న నగ్నసత్యం. వివాహ విధి ఒకరితో పొందు మరియొకరికి ఇబ్బందిగావున్నా, ఇష్టం లేకపోయినా ఆయా మతస్తుల వివాహ శాసనాలలోని నిబంధనల మేరకు వారిలో ఒకరు విడాకులు కోరవచ్చు. కొన్ని పరిస్థితుల్లో భార్య భర్తనుండి కాని, భర్త భార్యనుండి కాని మనోవర్తి పొందవచ్చును. కాని సహేతుకం కాని పరిస్థితుల్లో ఒకరు మరియొకరితో దాంపత్య జీవితం కొనసాగించుటకు ఇష్టపడనిచో వారు రెండోవారి నుండి మనోవర్తి పొందజాలరు.

దాంపత్య జీవితం గడుపుటకు కలిసి కాపురం చేయవలసిందని భార్య భర్తను, భర్త భార్యను హిందూ వివాహపు శాసనపు తొమ్మిదవ సెక్షన్ ప్రకారం కోరవచ్చును. దీనికై సివిల్ కోర్టులో పిటీషన్ పెట్టి కోర్టు ఉత్తరువు పొందవచ్చు. ఉ॥ భార్యను తనతోకలసి కాపురంచేసి దాంపత్య జీవితం గడపటానికి రమ్మని భర్త కోర్టులో పిటీషన్ పెట్టి కోర్టు ఉత్తరువు పొందితే ఆమె ఎట్టి పరిస్థితులలోను అతని నుండి మనోవర్తి పొందజాలదు. ఈ అంశాన్ని గమనించి మరొక గ్రామంలో ఉద్యోగం చేస్తున్న భార్యను ఉద్యోగానికి రాజీనామాపెట్టి తను వున్నచోటనే కాపురం చేయమని పిటీషన్ పెట్టడం, కోర్టు అలాంటి డిక్రీ ఆమె కివ్వటం మరో హైకోర్టు చేసింది. ఇలాంటివి సర్వసాధారణంగా జరుగుతున్న విషయాలే. స్త్రీ పురుషులిద్దరూ ఉద్యోగం చేసే ఈ రోజుల్లో భార్య ఉద్యోగాన్ని ఊడగొట్టించి ఆమెను ఇంటిపనికి కట్టుబబడేలా చేయాలని భర్త ప్రయత్నించటం గమనించక తప్పదు. ప్రస్తుతమున్న ఈ 9వ సెక్షన్ ప్రకారం భార్యకు వ్యతిరేకంగా తీర్పు పుడితే ఆమెకు మనోవర్తి హక్కు పోతుందని తెలుసుకున్నాం. అది అంత ప్రమాదకరం కాదు. కాగా ఇలాంటి తీర్పు వచ్చిన రెండేళ్లకు

భార్యకాని, భర్తకాని కలిసి కాపురం చేయటానికి ఇష్టపడకపోతే దంపతులలో బాధపడే వ్యక్తి అంటే మొదట పిటిషన్ పెట్టిన వ్యక్తి విడాకులను కోరవచ్చు. ఈ అంశం కూడా అంత అభ్యంతరం కాదు. కాని భర్తతో కలిసి భార్య కాపురమున్నచోట దాంపత్య జీవితం గడపమని కోర్టు భార్యను ఆదేశిస్తే ఆమె ఏం చెయ్యాలి. అనేదే నేటి ఆందోళన యొక్క ముఖ్యాంశం.

కోర్టు ఉత్తర్వును మన్నించి ఆమె భర్తతో కాపురం చేయవచ్చు. లేదా కోర్టు వుత్తరువును పాటించక పోవచ్చును. మొదటి సందర్భంలో పిటీషన్ విచారణ సమయంలో ఆమె భర్త కోరికను తిరస్కరించి, కోర్టు ఉత్తరువు తర్వాత భర్తతో కాపురం చేయుటకు సిద్ధపడితే సరేసరి. కాక ఆమె నిరాకరిస్తే భర్తకాని, భర్తతో కాపురం చేయదానికి ఇష్టపడనిచో రెండవవారు కాని విడాకుల కొరకు పిటీషన్ పెట్టుకోవచ్చు. కాని మొదటివారిని కాపురం చేయనని బలవంత పెట్టుటకు వీలులేదు. ఏ బ్రిటీష్ వారినుండి మనం న్యాయ సూత్రాన్ని అరువు తెచ్చుకున్నామో వారే మార్చుకున్నారు. కాని మనం మాత్రం మార్చుకోలేదు. ఇది బుద్ధి మాంద్యము. ఈ అంశాన్ని కూడా న్యాయమూర్తి తన తీర్పులో చెప్పాడు. హిందూ ధర్మశాస్త్రంలో విడాకులకు కాని, కాపురం చేయనని నిరాకరించుటకు కాని తగిన ఏర్పాట్లు లేవు. మన్వాదులు అలాంటి సంఘటనలకు అవకాశం ఇవ్వలేదు. **1948** నుండి మాత్రమే శాసనం ద్వారా కొన్ని రాష్ట్రాలలో మాత్రం విడాకులకు హక్కు లభించింది. అసలు వివాహం స్త్రీ పురుషుల సమ్మతిపై ఆధారపడి ఒప్పందం కావాలి. హిందూ మత శాస్త్రం ప్రకారం అది ఒక పవిత్ర విద్యుక్త చర్య. అంటే అదొక పవిత్ర బంధం. ఈ 'పవిత్రతా' భావం దాంపత్య జీవితంలోని అందాన్ని వమ్ముచేస్తుంది. వ్యక్తుల ఇష్టాఇష్టాలను తృణీకరిస్తోంది. వ్యక్తి స్వేచ్ఛను కాలరాస్తున్నది. కనుక పరస్పర సమ్మతిపై ఆధారపడే వివాహాలు అంగీకరయోగ్యాలు కావాలి. ఈ సెక్షన్‌పై వచ్చిన తీర్పు స్త్రీ యొక్క వ్యక్తిత్వ రక్షణకు దోహదం చేస్తుంది.

అలాగే పితృరుణం తీర్చుకోటానికి, పిండాలు వదలడానికి కుమారుడిని కనమని భర్త కోరడం, ముఖ్యంగా ఇష్టంలేని భార్యను నిర్బంధించటం దుష్టత్యమే కాక నిందార్హమవుతుంది. నవమాసాలు మోసి, తన రక్త మాంసాలకు పంచి పెట్టింది స్త్రీ. అలాంటి ఆమె తన మాతృత్వాన్ని నిరాకరించవచ్చు అది ఆమె జన్మహక్కు. అంతేకాదు ఆ స్వేచ్ఛకు భంగం వాటిల్లరాదని మౌలిక హక్కులు వక్కాణిస్తున్నాయి. కనుక అలాంటి తీర్పులు ఇచ్చి స్త్రీలపై దౌర్జన్యం చేయుట అన్యాయం. ఆమె స్వేచ్ఛను కాలరాయటం కన్నా ఘోరం మరొకటిలేదు.

అలాగే 'కంజగల్ రైటు'ను పాటించమని స్త్రీని కోరటం కూడా, ఆ మాటకొస్తే ఒకరు రెండవవారిని బలవంతం చేయటం అవివేకం, అజ్ఞానం కూడా. ఈ కేసు యొక్క మౌలికాంశం తరతరాలుగా స్వేచ్ఛ నోచుకొని స్త్రీ జాతికి వ్యక్తి స్వేచ్ఛను కాపాడుతుంది. స్త్రీ వ్యక్తిత్వ రక్షణకిది ఆశాకిరణం. భార్యను బలవంతం చేసి, తనతో కాపురం చెయ్యమనదానికి గాని పిల్లలను కనమని ఆజ్ఞాపించుటకుగాని భర్తకు కూడా హక్కులేదు. అంటే ఈ సూత్రాన్ని సమీక్షిస్తే ఒక ఇంట్లో భార్యాభర్తలు కాపురముంటున్నా భర్త భార్య పొందును బలవంతంగా అనుభవించదానికి వీలులేదు. అంటే ఆమె దేహంపై ఆమెకు గల హక్కును స్థిరీకరించడమన్న మాట. దీనిని స్త్రీ మానసంరక్షణ చర్యలకు దోహదం చేసేదిగా గుర్తించాలి. మానభంగాలను గురించి ఆందోళన చెందే ప్రతి స్త్రీ చట్టం సాయంతో తమపై భర్తలు జరిపే మానభంగాలను వ్యతిరేకించాలి.

ఈ విషయంలో సమగ్ర దృక్పధం అవసరం. ఈ తీర్పు ఫలితాన్ని అనుభవించగల సత్తా స్త్రీ జాతి అలవర్చుకోవాలి. ఉపయోగంలేని చట్టాలు, తీర్పులు వ్యర్థాలు. దానికి ఆత్మస్థైర్యం, మేధాశక్తి వుండాలి. ఏ పురుషుడైనా - భర్త అయినా సరే స్త్రీ యొక్క శరీరాన్ని ఆమె ఇష్టం లేకుండా వాడుకోడాన్ని స్త్రీ జాతి సహించరాదు. ఈ అంశాన్ని స్త్రీలోకపు దృష్టికి తేవడం చైతన్య స్ఫూర్తిగల మహిళోద్యమ కార్యకర్తల కర్తవ్యమని భావించాలి. ★★★

*(26వ పేజీ తరువాయి)*

పాపను వెంటనే బాత్రూమ్‌లోకి తీసుకెళ్లి స్నానం చేయించి వేరే బట్టలు వేసింది. తనను దగ్గరకు తీసుకుని కళ్లెంట నీళ్లు పెట్టుకుంటూ... "బంగారుతల్లీ ...బుజ్జీ. పసిదానివైనా నీకున్న స్పృహ నాకు కలగలేదమ్మా. వాడి పిచ్చి చేష్టలను పసిదానివైనా నువ్వు పసిగట్టి వాడి దగ్గరకు రావదానికి కూడా వెనుకాడావు. అప్పుడుకూడా విషయం గ్రహించలేకపోయాను. తల్లీ...ఇంక ఇలాంటి 'బ్యాడ్ అంకుల్' నీడ కూడా నిన్ను తాకనియ్యనమ్మా..." అంటూ బుజ్జిని ముద్దుల్లో ముంచేసింది.

## 'బ్యాడ్ అంకుల్' ఎవరు?

ఇరుగుపొరుగు, బంధువులు, టీచర్లు, కోచ్‌లు, కుటుంబసభ్యులు... ఎవరైనా కావచ్చు. వీళ్లవల్ల పిల్లలు అసౌకర్యానికి గురయ్యారూ అంటే ... అనుమానించాల్సిందే. ఇలాంటి వారి దగ్గరకు పోవడానికి కూడా పిల్లలు జంకుతారు. మొండికేస్తారు. ఏం జరుగుతుందో కూడా పిల్లలకు తెలీదు. చెప్పలేరు. మాటలు రావు. కానీ 'బ్యాడ్ అంకుల్' స్పర్శలో వున్న తేడాను, అసౌకర్యాన్ని, దురుద్దేశాన్ని పసివాళ్లు ఇట్టే కనిపెట్టేస్తారు. ముడుచుకుపోతారు. దూరంగా జరుగుతారు.

పిల్లలందరికీ చెప్పాల్సిన విషయాలు

'స్కూల్లో మాష్టార్లు, ఇంట్లో పెద్దలు ఏం చెప్పినా వినాలి. వాళ్లు చెప్పినట్టు చేయాలి' అని పిల్లలకు నూరిపోయకూడదు. అందువల్ల 'బ్యాడ్ అంకుల్స్' చేసే పిచ్చి చేష్టలను కూడా మౌనంగా భరించాలేమో అనుకునే ప్రమాదం వుంది. అందుకే 'ఈ శరీరం నీది. దీని మీద పూర్తి హక్కులూ నీవే. నీ ఇష్టం లేకుండా ఎవ్వరూ ఏమీ చేయకూడదు' అన్న విషయాన్ని వాళ్లకు అర్థమయ్యేలా చెప్పాలి. దానికి భిన్నంగా ఏదైనా జరిగితే...వెంటనే అమ్మానాన్నలకో, తమకు బాగా సన్నిహితంగా వుండే వాళ్లకో వెంటనే చెప్పాలని కూడా వివరించాలి. పెద్దలే తెల్సుకోవాలి.

మరీ పసివాళ్లైతే ఇవేవీ చెప్పలేరు. వారి ప్రవర్తనలో కనిపించిన తేడాను బట్టి పెద్దలే అర్థంచేసుకొని విషయాన్ని కనిపెట్టాల్సి వస్తుంది. అదే ఊహ తెల్సిన పిల్లలైతే నోరు తెరిచి చెప్పగలుగుతారు. అలా చెప్పే స్వేచ్ఛాపూరిత వాతావరణాన్ని ఇంట్లో కల్పించాలి. అలా మరోసారి జరక్కుండా వుండడానికి అవసరమైన చర్యలు పెద్దలే తీసుకోవాలి.

★★★

# నివ్వెరపరిచిన ఒరిస్సాలోని నయాగర్ సంఘటన

ప్రఫుల్లా దాస్

అందంగా ఆకుపచ్చగా వున్న భువనేశ్వర్‌ని దాటితే 100కి.మీ. దూరంలో ఉన్న నయాగర్ పట్టణం కూడా ఆకుపచ్చని పైరులతో మనకి ఆహ్లాదాన్నిస్తుంది. ఆ ఆహ్లాదం, అందం వెనుక కౄరమైన ఘోరమైన భ్రూణ హత్యలు జరుగుతున్నాయని తెలిసిన ఒరిస్సా రాష్ట్రం, దేశం నివ్వెరపోయింది.

నయాగర్‌కి 6 కి.మీ. ముందు వున్న ఇటామటి పంచాయితీలో"సురక్షిత గర్భస్రావం (అబార్షన్) మరియు మాతృత్వానికి" డాక్టరు నాగకృష్ణ సాహు ఎం.డి. (ఒ & డి) ఉత్కల్, కల్పన కాంప్లెక్స్, నయాగర్" అన్న నీలం రంగు బోర్డు మనకు దర్శనమిస్తుంది. అనైతిక పద్ధతులలో అన్యాయంగా వేలాది ఆడ పిండాలను నేలమీదకి రాకుండా చేసిన వైనం సభ్య సమాజాన్ని సిగ్గు పడేటట్టు చేసింది. డాక్టర్లు, నర్సింగ్ హోంలు నెట్‌వర్క్ లా ఏర్పడి అల్ట్రాసౌండ్ స్కానింగ్ ద్వారా లింగ నిర్ధారణ చేసి అబార్షన్లు చేశాడు. డబ్బు కోసం చదువుకున్న మూర్ఖులు ఇంతటి ఘోరానికి పాల్పడడం వైద్య వృత్తికే అవమానం.




ఈ నర్సింగ్‌హోంని నిర్వహిస్తున్న డా॥సబిత సాహు భర్త నాగ కృష్ణ సాహు ప్రభుత్వ డాక్టరు. లాభదాయకమైన ఈ పనిచెయ్యడానికి గత రెండు సం॥ల నుండి సెలవు పెట్టాడు. ప్రస్తుతం డాక్టరు సబితని అరెస్ట్ చేయగా ఆమె భర్త పరారీలో ఉన్నాడు.

ఈ నర్సింగ్ హోంకి దగ్గరలో మెడికల్ వేస్ట్ వెయ్యడానికి ఉపయోగించిన 6 మీటర్ల గొయ్యి తవ్వి చూసిన పోలీసులు నిర్ఘాతపోయారు. జులై 22-25 మధ్యలో గొయ్యిని పరిశీలించారు. గొయ్యిలో మెడికల్ వేస్ట్‌తోపాటు 150 పాలిథీన్ కవర్‌లు పరిశీలించి చూస్తే దొరికిన ఆధారాలను (బాడీ పార్టులు) బట్టి దాదాపు 60 పిండాలు ఉంటాయని అంచనావేశారు. రచయిత జులై 24న వెళ్ళిన నాటికి ఎముకలు ఇతర పార్ట్‌లు పోలీసులు పూడ్చిన గొయ్యి దగ్గర చెల్లా చెదురుగా పడివున్నాయి. వాటి సైజు 2.5 నుండి 10 సెంటీ మీటర్లు ఉన్నాయి. అంటే అవి మరీ పాతవి కావు ఈ మధ్యనే హత్య చేసినవి.

ఈ ఘోరమైన ఉదంతం జులై 14న 12 సంవత్సరాల స్కూలు విద్యార్థి వేస్ట్ బాటిల్ కోసం వెతుకుతుండగా బయటపడింది. రక్తంతో కూడిన పాలిథీన్ కవర్‌లో కట్టబడిన ఏడు పిండాలు పాడుపడిన నుయ్యి (చెత్త కుండీ)లో చూశాడు. పాడుబడిన ఆ నుయ్యి కృష్ణా క్లినిక్‌కి చెందినది. ఇది సరస్వతి శిశు విద్యా మందిరంకి 100 మీటర్ల దూరంలో ఉంది. చుట్టు ప్రక్కల వున్న ప్రజల ద్వారా ఈ వార్త బయటికి తెలిసింది.

సంఘటన జరిగిన రోజే ఒక ఒరియా ఛానెల్ ప్రసారం చేసింది. అయితే పోలీసులు వెళ్ళే సరికి అక్కడ అటువంటి సాక్ష్యాలు లేకుండా చేశారు. జిల్లా వైద్య అధికారి డా॥ అలి బెయిగ్ ఇతర ప్రముఖులు గొయ్యిలో పరిశీలించిన ఎముకలు చూసి అవి 5 నుండి 6 నెలల వయసు వున్న ఆడ పిండాలవి అని నిర్ధారించారు. నయాగర్‌లో 2000 సం॥ నుండి దాదాపు 16 మంది వైద్య అధికారులు మారారు. అంటే ప్రభుత్వం వైద్యం పట్ల చూపుతున్న శ్రద్ధ అర్థమవుతుంది.

సంఘటన పట్ల అధికారులు, పోలీసులు నిర్లక్ష్యం వహించారని అనేక మహిళా, శిశు సంస్థలు ఆరోపణచేశాయి. ఒక స్వతంత్ర కమిటీ సోషల్ యాక్టివిస్టులతో నిజ నిర్ధారణకి వెళ్ళి కేసుని సిబిఐకి అప్పగించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశాయి. ప్రభుత్వం జులై 21న కేసు సిబిఐకి అప్పగించింది. అప్పటికే సాక్ష్యాలన్నింటిని నాశనం చేశారు. మృత పిండాలు, వాటి అవశేషాలు దొరకలేదు. అప్పుడే రెండవ గొయ్యి తవ్వితే అన్నీ బయట పడ్డాయి. దానితో 7గురిని అరెస్ట్ చేశారు. కాకపోతే చాలా మంది దొరకలేదు.

రాష్ట్ర హెల్త్ డిపార్ట్‌మెంట్ నయాగర్‌లో వున్న 8 నర్సింగ్ హోమ్‌లను సీల్ చేసింది. పరిశోధనలో అందులో 7 నర్సింగ్ హోంలకు ఎటువంటి లైసెన్స్ లేదని తేలింది. చట్ట విరుద్ధంగా నిర్వహిస్తున్నారు. చాలా నర్సింగ్ హోంలలో రికార్డులన్నీ అనుమానాస్పదంగా ఉన్నాయి. ఒక నర్సింగ్ హోమ్‌లో అల్ట్రా సౌండ్ స్కానింగ్ చేస్తున్న ఆమె హోమియోపతి చదివారు. ఆమె పరారీలో ఉన్నది. జిల్లా కేంద్రానికి దగ్గరలో నిర్వహిస్తున్న ఇంకొక నర్సింగ్ హోంని మూయమని చాలాకాలం క్రితం జిల్లా వైద్య అధికారులు చెప్పినా యథావిధిగా నడుస్తున్నది.

లింగ నిర్ధారణలో స్థానిక ప్రభుత్వ వైద్య అధికారుల పాత్ర గురించి స్థానికులు తెలియజేశారు. డాక్టరు సాహు కు నయాగర్‌కి 25 కి.మీ. దూరంలో పోస్టింగ్. చాలా మంది ప్రభుత్వ డాక్టర్లు టౌన్‌లో నర్సింగ్ హోంలు నిర్వహిస్తున్నారు. స్థానిక ప్రభుత్వ డాక్టరు మాట్లాడుతూ గత 6సం॥ల నుండి ఈ కార్యక్రమం విపరీతంగా పెరిగింది. ఇది పై అధికారులకి కూడా తెలుసు అన్నారు. ఈ విషయం 2005లోనే జిల్లా

ముఖ్య అధికారిగా వున్న ఎ.కె. దాస్ ప్రభుత్వానికి తెలియజేశారని డా॥బి. శుక్లా చెప్పారు. కానీ ప్రభుత్వం ఎటువంటి చర్య తీసుకోలేదన్నారు.

ఇదే కాకుండా నకిలీ మందుల రాకెట్ చోలంగిరి జిల్లా కంటాబంజిలో బయట పడింది. 48 మందిని అరెస్ట్ చేశారు. మెడికల్ షాప్ ఓనర్లు మందుల్ని నదుల్లో, కాలువల్లో ఎక్కడబడితే అక్కడ పూడ్చారు. దీనిని కూడా సిబిఐ విచారణకి అప్పజెప్పారు. లింగ నిర్ధారణ, భ్రూణ హత్యలు, నకిలీ మందుల సమస్య పరిష్కరించడానికి ప్రత్యేక విభాగం ఏర్పాటుకు ప్రభుత్వం సన్నాహమవుతున్నది.

అయితే ప్రతిపక్షాలు, మహిళా సంఘాలు ప్రభుత్వ చర్యలకి సంతృప్తి చెందడంలేదు. డిపార్ట్‌మెంట్ హెడ్స్‌పై పోలీసులపై చర్య తీసుకోవాలని, ఆరోగ్య మంత్రి రిజైన్ చెయ్యాలని డిమాండ్ చేస్తున్నాయి.

తగ్గిపోతున్న స్త్రీ జనాభా గురించి ప్రభుత్వం పట్టించుకోవడం లేదని మహిళా సంఘాలు ప్రశ్నిస్తున్నాయి. పుట్టకుండానే చనిపోతున్న ఆడశిశువుల బాధ్యత ప్రభుత్వం వహించడం లేదని చిసాకా భంజా, నేషనల్ ఎలిమన్స్ ఆఫ్ ఉమెన్స్ ఆర్గనైజేషన్ ఆరోపించింది. ఉమెన్ & చైల్డ్ వెల్ఫేర్ డిపార్ట్‌మెంట్, హెల్త్ డిపార్ట్‌మెంట్ దీనికి బాధ్యత వహించాలని కోరింది. లింగ నిర్ధారణ నిరోధక చట్టం అమలు చెయ్యాలంటున్నది.

2001 జనాభా లెక్కల ప్రకారం తగ్గిపోతున్న బాలికల శాతం, స్త్రీ పురుష శాతాన్ని ప్రభుత్వం సీరియస్‌గా తీసుకోలేదు. ప్రత్యేకంగా కోస్తా తీరంలో ఇది మరీ ఎక్కువగా వుంది. 1991లో 967గా వున్నది. 2001కి 950కి తగ్గిపోయింది. నయాగర్‌లో ఇది 901గా వుంది. దాదాపు అన్ని పట్టణ ప్రాంతాలలో ఇదే పరిస్థితి ఉంది.

నయాగర్‌లో బయటపడినది ఒక మచ్చుతునక మాత్రమే. అన్ని జిల్లా కేంద్రాలలో ఇది జరుగుతున్నది. దీనికి కారకులయిన వారందరిపైన వెంటనే చర్య తీసుకోవాలి. అధికారులంతా సమన్వయంతో ఈ దారుణాన్ని నివారించడానికి ప్రయత్నించాలి. మగ బిడ్డే కావాలనేది ఒరిస్సాలో రోజు రోజుకు పెరుగుతున్నది. పంచాయితీలో పోటీకి ఇద్దరు మించి వుండకూడదనే నిబంధన వల్ల కూడా మగ బిడ్డకే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నారు.

మంజు హెంబ్రమ్, జాతీయ మహిళా కమిషన్ ఆధ్వర్యంలో నయాగర్ సందర్శించారు. ఇది పూర్తిగా అధికారుల వైఫల్యంతోపాటు ప్రీ నాటల్ డయగ్నొస్టిక్ టెక్నిక్ యాక్ట్ అమలులో విఫలం చెందారు అన్నారు. జరిగిన తీరు పరిశీలించి షాక్ అయినట్లు పేర్కొన్నారు.

నయాగర్‌లో జరిగినది అన్ని చోట్ల జరుగుతున్నది అనేది అందరికీ తెలిసిన సత్యం. కానీ దీనిని నిరోధించడానికి అవసరమయిన చిత్తశుద్ధి పైనే అనుమానం. భ్రూణ హత్యలను ఆపడానికి కేవలం ఒక కమిటీ వేస్తే చాలదు రాష్ట్రంలో వున్న నర్సింగ్ హోంలు, డయగ్నొస్టిక్ సెంటర్లపై చర్య తీసుకోవాలి. బాలికల రక్షణ కోసం, తగ్గిపోతున్న బాలికల సంఖ్య, దాని యొక్క ప్రమాదం పై పెద్ద ఎత్తున ప్రచారం చేసి ప్రజలలో చైతన్యం కల్పించాలి. అప్పుడే ఇటువంటి క్లిష్టమైన సమస్యలను నివారించగలం.

★★★

*(ఫ్రంట్‌లైన్ సౌజన్యంతో)*

## భూమి కోసం..

### హైకూలు

సంకలో బిడ్డ
చేతిలో జండా!
వీపు మీద లాఠీ
అయినా, ఏదీ వదిలేది లేదు!!

గూడు కోసం
రోడ్డెక్కితే
గువ్వనే
కాల్చేశారు !!

రాత్రే అనుకున్నాం
సొంత గూటిలో మనం
సూర్యకిరణాల్లో
నీవు నిర్జీవం!!
నేను సజీవం!!

రక్తంతో నేల తడిచింది
గొంతులో కేక ఆగింది
శోకంతో గుండెమండింది
ఆశయం పిడికిలి బిగిసింది!!

లాఠీల వర్షం
తూటాల తుఫాను
నెత్తురు కాల్వల్లో
పాలకుల తెల్లజండా!!

నింగి ఎర్రబారింది
ఉదయించే సూర్యుడితో
నేల ఎర్రబారింది
సామాన్యుడి రక్తంతో!!

ముదిగొండ గుండె గాయమయ్యింది.
తూటాల వర్షంతో ...!
నేలంతా పరుచుకున్న రుధిరం
లాల్ సలాం పలుకుతోంది
భూపోరాట యోధులకు!!

కడదాకా నాతో అన్నావ్
నన్నొదిలేసి
తుపాకి తూటాతో
ఎల్లిపోయావ్!!

రక్షక భటులు
భక్షక భటులైన వేళ
ముదిగొండ
రక్త గుండమైంది!!

అమరులైన వీరులు
ఎప్పుడు సజీవులే!
విరబూసిన మందారాలే
జనం గుండెల్లో!!



– సుధాకిరణ్ .బి.

# స్ఫూర్తి దాత - ఈ వీర మాత

మల్లు కరుణ

"అసహాయత నుంచి, ఆధారపడే ధోరణి నుంచి స్త్రీలు బయటపడాలి. ఏ చిన్న కష్టం వచ్చినా ఒదిగిపోయి బోరున విలపించేందుకు మరో ఒడి కోసం ఎదురు చూడటం మానుకోవాలి. మానసికంగా శక్తిమంతులై ఎంతటి విపత్కర పరిస్థితులనైనా ఒంటరిగా ఎదుర్కోవాలి. పరాక్రమం, పోరాటతత్వం, పురుషుల సొంతమనే భ్రమలనుంచి బయటపడాలి. ఆ కోణంలోనూ తమకు అడుగుజాడలను పరచిన వీరనారీమణుల జీవితాలను ఆదర్శంగా తీసుకోవాలి.

- స్వామి వివేకానంద

ఆ ప్రయత్నమే జగమెరిగిన ఈ రాజమాత జిజాబాయి (ఛత్రపతి శివాజి తల్లి) జీవిత చరిత్రను స్వాతంత్ర్య సమరాల ఉత్సవాల్లో గుర్తు చేసుకోవడం.

భారత చరిత్రలో ఆమె ఓ స్ఫూర్తివంతమైన మహిళామణి. ఒక స్త్రీ తలుచుకుంటే పిల్లల్ని ఎంతటి శక్తిమంతులుగా తీర్చిదిద్దగలదో నిరూపించి ఒక మహా వీరుణ్ణి, ఛత్రపతిని ఈ దేశానికందించిన చైతన్య మూర్తి. స్త్రీ ఒక కూతురిగా, కోడలిగా, భార్యగా, తల్లిగా చివరికి పాలనా దక్షతగలిగిన ఏలికగా కూడా ఎంతటి కీర్తి శిఖరాలను అధిరోహించగలదో అనడానికి ఒక్క జిజాబాయి చరిత్ర చాలు. ఎప్పుడో 17వ శతాబ్దపు రోజుల్లోనే ఆమె ఈనాటి ఆధునిక మహిళకు మించి అస్తిత్వం కోసం తపనపడింది. ఆ తపనతో తుదివరకూ పోరాడి చరిత్రలో తనకంటూ ఓ స్థానాన్ని దక్కించుకుంది. ముగ్గురన్నదమ్ముల ఒక్కగానొక్క చెల్లెలిగా జిజా అల్లారుముద్దుగా పెరిగినా ఆమె ఏనాడూ మామూలు ఆడపిల్లల్లా ఆటపాటల వైపు అందచందాలవైపు ఆసక్తి కనబరచలేదు. ముస్లింల పాలనలో పరతంత్ర భారతావని దుస్థితిని తలచుకుంటూ పదేళ్ళ వయసులోనే ఆవేదనతో, ఆగ్రహంతో తండ్రి దగ్గర నుండి రాజకీయాలపై అవగాహన పెంచుకుంది. చరిత్ర, రాజకీయాలు, తదితర అంశాలు పురుషులకే అని భావించే నాటి సమాజంలోనే జిజాబాయి, పెద్దల దగ్గర, గురువుల దగ్గర పూర్తిగా రాజకీయ అంశాల్నే ప్రస్తావించేది. అదే పట్టుదలతో దత్తాజీ సాహెబ్ దగ్గర యుద్ధ విద్యలన్నీ నేర్చుకుంది. స్త్రీలు శక్తిమంతులుగా ఉండాలని, పురుషుడిదే రక్షణ బాధ్యత అన్న భావాన్ని విడనాడాలని ఆచరణలో చూపారామె. ఈ తరం యువతులు నేర్చుకోవల్సిన ప్రత్యేకాంశమిది.

## సామాజిక సంస్కరణలో

మహిళల చురుకైన పాత్ర లేకుండా సామాజిక పరివర్తన జరగదని జిజాబాయి విశ్వసించారు. సంప్రదాయానికి ఎంత విలువ ఇచ్చినా సంస్కరణలకూ ప్రాధాన్యమిచ్చారామె. అది తనుగా ఆచరించి చూపారు. జిజాబాయి మామగారు మరణించిన మరుక్షణమే ఆనాటి సామాజిక పరిస్థితులకు తలవంచి ఆమె అత్తగారు సతీ సహగమనానికి సిద్ధమయ్యారు. కాని జిజా మాత్రం ససేమిరా అంటూ "అత్తగారూ! మామగారిపై మీకున్న అనురాగానికి అంజలిఘటిస్తున్నాను. కాని తల్లిగా మీకు బాధ్యత లేదంటారా? భారతంలో బిడ్డలకోసం కుంతి ప్రాయోపవేశం వదులుకోలేదా? అచారాలంటారా అవి మనం ఏర్పరుచుకున్నవే. మిమ్మల్నెవరూ తప్పుపట్టరు. మా కోసం విరమించుకోండి" అంటూ అత్తగారిని సతీ సహగమనం నుండి తప్పించింది.

## నీతినే సమర్థించే ఇల్లాలుగా

తన వారు పరాయి పాలకులకు బానిసలుగా మారి, వారికి సామంతులుగా పనిచేస్తూ రాజభోగాల్లో తేల్చాలని జిజాబాయి కోరుకోలేదు. ఈ విషయంలో భర్తను కూడా విమర్శించిన నీతిమంతురాలామె. అందుకే ఓ సందర్భంలో భర్తతో "మీరు నిజాముల దగ్గర ఉంటూ తెచ్చే సిరిసంపదలూ, వజ్ర వైఢుర్యాలూ నాకక్కరలేదు. స్వతంత్ర పాలకుడిగా రొట్టెముక్క తెచ్చినా నేను సంతోషిస్తాను. మీరు మహావీరులు. స్వతంత్రంగా ఎందుకు రాజ్యాన్ని స్థాపించలేరు?" అని ఆవేదన చెందింది. ఆ రోజే ఆమె ఒక ప్రతినబూనింది. భోగలాలసలేని వాడు, దేశం కోసం ప్రాణాల్ని తృణప్రాయంగా భావించే యోధుడు, అశేష జన వాహినిని నడిపంచగల సమర్థుడు ఈ దేశానికి కావాలి. అలాంటి బిడ్డను ఈ దేశానికి అందిస్తాను." అని.



### వీరమాతగా

జిజాబాయి పసినాట నుంచి కన్న కలలు కొడుకు రూపంలో సాకారం చేసుకుంది. తన ఆశల్ని, ఆశయాల్ని, ఆదర్శాన్ని, ఆవేశాన్ని కొడుకు శివాజీకి ఉగ్గుపాలతో రంగరించిపోసింది. నువ్వు నాకన్నా ముందు ఈ భరతభూమికి బిడ్డవని చెప్పకనే చెప్పింది ఆ మాతృమూర్తి. తన భర్త తనను విడిచి మరొకరిని పెళ్ళాడినా జిజా ఏనాడూ కొడుకుముందు కుంగిపోలేదు. అమ్మా, నాన్న అన్నీ తానై శివాజీని పెంచి పెద్దచేసింది. పిల్లల్ని సంస్కారవంతులుగా చేయటానికి పెద్దలు కూడా తమ జీవితాలను ప్రయత్న పూర్వకంగా దిద్దుకోవాలని గట్టిగా నమ్మింది. అందుకే విలాసవంతమైన చాయలున్న భర్త వద్ద శివాజీని ఉంచలేదామె. ఈ విషయంలో భర్త సవాలును స్వీకరించి తండ్రి వద్దకన్నా తల్లి వద్దే కొడుకు మరింత పరిపూర్ణుడవుతాడని నిరూపించింది. "లోకుల దృష్టిలో భార్యగా నేను అసమర్ధురాలినే కావచ్చు. కాని తల్లిగా ఎప్పటికీ ఓడిపోను" అన్నట్లుగానే వీరమాతగా నిలిచింది. రాత్రి కాగానే శివాజీని ఒళ్ళో కూర్చోబెట్టుకుని హరిశ్చంద్రుని సత్య దీక్ష, శ్రీరాముని పితృవాక్య పరిపాలన, శీల సంపద, ధృవుడి ధృడి సంకల్పం, కార్యదీక్ష, శిబి చక్రవర్తి దానగుణం, భారతంలోని సాహసకథలు, ఎన్నో నైతిక విలువల్ని గోరు ముద్దలతో కలిపి తినిపించేది. ఆ తరావాత కొడుకుకు తనకు మించిన యుద్ధ విద్యలు నేర్పించింది.

### సమర సేనానిగా మలచి

చేతికందివచ్చిన శివాజీని దేశ రక్షణకు, దుష్ట శిక్షణకు సిద్ధం చేసింది జిజాబాయి. హైందవ జాతిని మట్టుపెట్టే ప్రయత్నం చేస్తున్న ప్రతి ఒక్కరి పైకీ కొడుకును కరవాలంగా ఝుళిపించింది. ఒక్కటొక్కటిగా దేశంలోని కోటలెన్నింటినో ఆక్రమించేలా శివాజీని ప్రోత్సహించింది. ఆ ప్రయత్నంలో పరమత సహనానికి, స్త్రీ రక్షణకు, సౌభ్రాతృత్వాలకు ఎలాంటి ఆటంకం కలగకూడదని షరతు విధించింది. కొడుకును ఛత్రపతిగా, చక్రవర్తిగా చేసి ఈ నేల రుణం తీర్చుకుంది.

ఆ రాజమాతకు తుదిక్షణాలు సమీపించినపుడు ఆగమేఘాల మీద ఆమె పాదాల వద్దకు వచ్చి వాలాడు చక్రవర్తి. తల్లిని అనుక్షణం కంటికి రెప్పలా చూసుకొమ్మని ఆస్థాన వైద్యుల్ని ఆదేశించాడు. కాని సున్నితంగా తిరస్కరిస్తూ ఆ మాతృమూర్తి "నాయనా నాకే వైద్యమూ అవసరం లేదు. ఇక నేను సెలవు తీసుకునే సమయం ఆసన్నమైంది" అంటూ కొడుకును ఆశీర్వదిస్తున్నట్లు తలపై నిమిరింది. అంతటి మహా చక్రవర్తి కూడా ఒక్కసారిగా పసిపిల్లాడిలా విలపిస్తూ "అమ్మా! నీవు లేకుండా నేనెలా జీవించను, ఆ సింహాసనాన్ని ఎలా ఊహించుకోను" అంటూ పాదాలపై మోకరిల్లాడు. అంతటి నిష్క్రమణ స్థితిలో కూడా ఆ తల్లి " నాయనా! ఎందుకు దిగులు పడుతున్నావు. ఈ దేశంలోని ప్రతి స్త్రీ మూర్తిలో నేను నీకు కనిపిస్తాను. నేనెక్కడికీ వెళ్ళను. నా ఆత్మ ఈ మట్టిలో ఈ గాలిలో మమేకమై ఉంటుంది. ఈ దేశ ఔన్నత్యం కోసం సంక్షేమం కోసం పాటుపడే వీరుల్ని, దేశ భక్తుల్ని కనిపెంచే ప్రతి తల్లిలో చైతన్య పరిచే శక్తిగా, ఇక్కడే ఉంటాను" అంటూ ఒడిలో ఒరిగిపోయింది. ఇలా ఈ వీరమాత తన తుదిశ్వాస విడిచేవరకూ తన అస్థిత్వాన్ని తన ప్రతి జీవన మలుపులోనూ చాటుకుంది. ఈ స్వాతంత్ర్యోత్సవ సంబరాల్లో ఆ వీరమాత జీవితాన్ని స్ఫూర్తిగా తీసుకొని ఆలోచనల్లో, ఆశయాల్లో పరిణితి ప్రదర్శించి సమాజపు ప్రక్షాళణలో తమ వంతు పాత్ర నిర్వహించడానికి మహిళాలోకం ముందుకు సాగాలి.

★★★

**జూన్-1** పేదలు ఇళ్ళ స్థలాలు సాగుభూమి కోసం చేసే పోరాటంలో 195 సంఘాలు పని చేయ్యడం అందులో భాగంగా ఐద్వా మహిళా సంఘం మద్ధతు ఇవ్వడం ఐద్వా మహిళా సంఘంలో నేను పని చేయ్యడం చాలా గర్వంగా వుంది. నర్సాపురం మండలం చిట్టవరం గ్రామంలో 300 మంది ఇళ్ళ స్థలాలు కోసం పోరాటం చేస్తే పోలీసులు అరెస్టు చేసి 4 రకాల కేసులు పెట్టి జైలుకి తీసుకు వెళ్ళారు. అందులో నేనూ వున్నాను. 24 మందిలో 7 గురు మహిళలు వున్నారు. మహిళలను రాజమండ్రి సెంట్రల్ జైలుకి పంపారు. జైలు చూడటాన్నికి చాలా విశాలంగా అందంగా వుంది కానీ అందులో వున్న ఖైదీలపట్ల అధికారులు చాలా దురుసుగా ప్రవర్తిస్తున్నారు. నేరం చేసి శిక్ష అనుభవిస్తున్నవారిలో మార్పు తీసుకురాకపోగా ఇంకా మూర్ఖులుగా తయారు చేస్తున్నారు. బండ బూతులు తిడుతున్నారు. జీవిత ఖైదీలుగా శిక్ష పడ్డవాళ్ళను ఎందుకు అంత పని చేసారు అని అడిగితే రోజు తాగివచ్చి నన్ను చాలా బాధ పెడుతున్నారు. ఎంతకాలం భరించేది? అందుకే రోజు నేను బాధపడే కంటే ఒకేసారి నా భర్తను చంపి ఇక్కడకి వచ్చి పడ్డాను. ఇప్పుడు అనిపిస్తుంది. ఆ క్షణాన నేను కూడా ఎందుకు చనిపోలేదు అని ఏడుస్తూ చెప్పినపుడు చాలా బాధనిపించింది. నమ్ముకుని వచ్చిన ఆడదానికి మద్యం మత్తులో నరకం చూపించారు. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు మహిళే కదా భాదితురాలు అనిపించింది.




కోడల్ని చంపిన అత్తలూ వున్నారు. "నా కొడుకు మాటవిని, నా భర్త మాటవిని నా కోడలి చంపాం. నేను ఇప్పుడు ఇక్కడ రోజు చస్తున్నానమ్మ. నా కొడుకు, భర్త బయటే వున్నారు. నన్ను మాత్రం ఇక్కడ పడేసారు. నేను చాలా తప్పు చేసాను కాని ఫలితం ఏమిలేదమ్మ అని భాదపడుతూ చెప్పింది. రాతి బండల్లా మారిపోయి జీవితం గడుపుతున్నారు. తప్పు చేసినవారిలో మార్పు తీసుకురావలసిన వారు ఇంకా వారినే రాక్షసుల్లా తయారు చేస్తున్నారు. టైం ప్రకారం అన్నీ పెడుతున్నారు. కానీ వాళ్ళలో పరివర్తన కోసం తీసుకున్న చర్యలు ఏమీలేవు.

ఎన్నో గాథలు, ఎన్నో బాధలు, ఎన్నో వ్యథలు, ఎన్నో రోదనలు ఆ కారాగారంలో వున్నాయి. క్షణికావేశంలో చెప్పుడు మాటలకు తలొగ్గి, నేటి సమాజ తీరుకు ప్రతిబింబంగా వున్న వీరిలో మార్పు రావాలంటే జైలు అధికారులు ఖైదీలపట్ల వ్యవహరించే తీరు నుండే ప్రక్షాళన మొదలు కావాలి.

★★★

# శుద్ధి చెయ్యాలె

✍ జూపాక సుభద్ర

ఆఫీసు నుంచి ఇంటికొచ్చేటప్పటికి "నీకు ఏందో కవరొచ్చింది చూడు" అని ఓ కవరు నా చేతికందించింది మా ఓనరు. బ్రౌన్ కవర్. ఫ్రమ్ అడ్రసు కాలేజ్ సర్వీస్ కమీషన్ అని ఉంది. ఏ వొచ్చిందబ్బా అని అనుమానంతో చూస్తే లక్ష్మీదేవ్‌పూర్ జూనియర్ కాలేజీలో లెక్చరర్ పోస్టు వచ్చింది. చాలా ఆనందం, ఇప్పుడు నే చేసేది క్లర్క్ ఉద్యోగం, కొన్ని వేల ఏళ్ళ తరాల తర్వాత చదువుకున్నది నేనొక్కదాన్నే మా కుటుంబంలో. ఉద్యోగం చేయడం కూడా నాతోనే మొదలు. ఈ క్లర్కు ఉద్యోగం చేయడమా మానడమా అని ఆలోచిస్తూనే మొహం కడుక్కుని, బట్టలు మార్చుకుని పొద్దున ఆఫీసుకు పోయే హడావుడిలో ఎక్కడివక్కడనే వదిలేసిన బట్టలు వంట సామాను సర్దుకొని గిన్నెలు తోమి, అన్నం వండుకుని పొద్దుటి కూరేసుకుని తిని మళ్ళీ ఆర్డరు కాయితం తీసుకుని కూర్చున్నాను.

నాకు చిన్నప్పట్నించి నుండి ఏమేమో చదువుదామని కోరికలుండేవి. డాక్టరు చదువు బావుంటుందని అందరినీ ఆదుకోవచ్చు. సేవ చేయడానికి మంచి వృత్తి కానీ నేను సైన్సులో సీటు కోసం అప్లై చేయలేదు. సైన్సు అయితే ఫీజులు, రికార్డ్స్, పెన్సిల్స్, ప్రాక్టికల్స్ ఉంటాయి. డబ్బు వ్యవహారం. అదే ఆర్ట్స్ అయితే ఫీజు ఎక్కువగా ఉండదు. రికార్డ్స్ ఉండవు. లైబ్రరీ పుస్తకాలు తెచ్చుకుని చదివి పాస్ కావచ్చు. ఆర్ట్స్ చదివినా పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయొచ్చు అని తెలిసి సంతోషపడ్డా. కాని వీటితో ప్రజలకు నేనేమన్నా సహాయపడ్డానా? సహాయపడక నాకు నేనే బతకడంలో ఏం ఆనందం, తృప్తి ఉంటుంది అనుకునే దాన్ని. లెక్చరర్ అయితే ఆదర్శ మానవులను, సాంఘిక బాధ్యులను తయారు చేయొచ్చు కదా అని సరిపెట్టుకుని ఆర్ట్స్‌లో యిష్టం లేకున్నా చేరిన. హాస్టల్ ఫుడ్‌తో లైబ్రరీ బుక్స్‌తో ఇంటర్, డిగ్రీ, పీజీలైతే వచ్చాయి. తర్వాత ఏంటి పరిస్థితి? నా యీ పట్టాలు నా మట్టిపని నుంచి దూరం చేశాయి. కార్ఖానాలోని వస్తువుకు వినిమయం లేకుండా తిరిగి కార్ఖానాకైనా చేరాలి లేదా రోడ్డు మీద చెత్తలాగానైనా పడాలి అట్లా నేను పి.జి అయిపోయి బైటకొచ్చి తిరిగి హాస్టల్‌లో వుండేందుకు యింకో సదువులో చేరి ఫుడ్, లైబ్రరీ సంపాదించుకున్నాను. రోజు ఉద్యోగవేటలో అలిసిన నాకు క్లర్కు పోస్టు పిట్ట చిక్కిన ఆనందం అనంతంలో విహరించేది. నా ఫ్రెండ్స్ ఏదో ఒక పోస్టు వచ్చింది

## మాదిగ స్త్రీల గుండె చప్పుడే ఈ 'నల్లరేగటిసాల్లు'

'నల్లరేగటి సాల్లు'. పుంఖాను పుంఖాలుగా పత్రికల్లో వస్తున్న అభూత కల్పనల గాధా సంపుటి కాదు. మధ్య తరగతి స్త్రీలు ఉపవాస దీక్షలు ఆచరిస్తూ చదివించుకునే పతివ్రతల కథా సంపుటి అసలే కాదు. నల్లరేగటి సాల్లు, మాదిగ ఉపకులాల ఆడోళ్ళ కథా సంపుటి. మాదిగ మహిళల గుండె చప్పుడు. అట్టడుగున ఉండి శరీర భారాన్ని మోస్తున్న పాదం వోలె మొత్తం సమాజానికి అడ్డమైన చాకిరీ చేస్తూ కూడా అగ్రవర్ణ పురుష భూస్వామ్యపు ఇనుప పాదాల క్రింద నలిగి నుజ్జవుతున్న అంటబడని స్త్రీల జీవిత చిత్రణే ఈ 'నల్లరేగటి సాల్లు.'

'నల్లరేగటి సాల్లు' తెలుగు కథకి వన్నె తెచ్చింది. సాహిత్యానికి నూతనత్వాన్ని, నూతన అర్థాన్ని ఇచ్చింది. నిచ్చెనమెట్ల కుల వ్యవస్థలో వెలివేయబడ్డ స్త్రీల జీవితాన్ని, శ్రమ సంస్కృతిని, ఉద్వేగాలను, ఉత్సాహాన్ని, కన్నీటినీ, అన్నిటినీ మించి అన్యాయాన్ని, అణచివేతను ఎదిరించి ప్రతిఘటించే 'సివంగిని' ఈ నల్లరేగటి సాల్లు మనందరి ముందు సాక్షాత్కరింపజేసింది.

ఎందరో స్త్రీ మూర్తులు ఈ కథల్లో సాక్షాత్కరిస్తారు. అన్నదమ్ముల పంచాయితీ తీర్చిన డక్కలి రాజక్కలోని న్యాయాధిపతిని, అష్టకష్టాలు పడి చదివించిన బిడ్డ జీవితాన్ని కాటేసిన రెడ్డిని అంతం చేసిన సివంగిని, సెన్నక్కను, అడవిలో దారికాచి మాటు వేసి పులిని చంపిన డక్కలి ఈరయ్య, లింగమ్మల జంట ముచ్చటైన వాళ్ళ అన్యోన్యత, 'జాంబముని చిన్న భార్య కుమారులు చిందు జాంబ మహాముని వారసులం' అంటూ ఊరూరు తిరిగి ఎల్లరకూ పురాణ గాథలు వినిపించిన చిందు కళాకారిణి ఎల్లమ్మ, పాము విషాన్ని సయితం విరిచెయ్యగల మందులు తయారు చేసే అపర 'ధన్వంతరి' పాములు పట్టే మావూలమ్మ, ఇంటింటికి బీడీ పంచి తన బిడ్డకు న్యాయం చెయ్యాలని పంచాయితీ పెట్టించిన జోగు(జోగిని) చిన్నమ్మ, ఇంకా ఎందరో స్త్రీ మూర్తులు, వీరనారులు ఈ కథల్లో మనకు కనిపిస్తారు.

ఇటువంటి వీరనారులను-మట్టిలో మాణిక్యాల్ని వెలికి తెచ్చి మనందరి కళ్ళెదుట నిలపడం సాహసమే. అది ఒట్టి సాహసం కాదు. ఊడల మర్రి లాంటి కుల వ్యవస్థను, అందులోనూ అంతర్లీనంగా స్త్రీలపై సాగుతున్న అణచివేతను ఎదిరించే సాహసం. అట్టి సాహసులు సోదరీమణులు సుభద్ర, శ్యామల, గౌరి, మేరి మాదిగ, ఝాన్సీ ఇంకా ఈ కథా సంపుటికి ఊపిరి పోసిన సోదరీ సోదరులకు మానవి ప్రేమ పూరిత అభినందనలు.

పుస్తకంలో ఏముందో చెప్పకనే చెప్పేది ముఖచిత్రం. భూమికి స్త్రీకి ఉన్న బంధాన్ని, పశు సంపదకు మహిళలకు ఉన్న అనుబంధాన్ని తెలియజేస్తూ, కష్టాలకు వెరవక బ్రతుకు పోరాటంలో మొక్కవోని ధైర్యంతో ముందుకు సాగుతున్న అక్క అనసూయ ఒక వైపు ఎద్దును మరో వైపు దున్నపోతును అరకకుగట్టి నేలను సాగు చేస్తున్న వైనం రాజకీయ అర్థ శాస్త్రాన్ని బోధిస్తున్నట్లుంది.

ఈ సంకలనంలో అబ్బురపరిచేది భాష. దళిత శ్రామిక మహిళల వాడుక భాషకు అక్షర రూపమిచ్చి గ్రంథస్థం చెయ్యడమంటే శ్రమ సంస్కృతిని గౌరవించడమే. ఇది ఏ విశ్వ విద్యాలయాలు చేయలేని ప్రయత్నం.

ఇది మొదటి ప్రయత్నం కాదు. తుది ప్రయత్నం కూడా కారాదు. సంపాదకులు చెప్పినట్లు 'నల్లపొద్దు' దళిత స్త్రీల సాహిత్యాన్ని తెరపైకి తెచ్చింది. అంతకంటే ఒక అడుగు ముందుకేసింది 'నల్లరేగటి సాల్లు'! ఈ ప్రయత్నం ఇంకా ముందుకు సాగాలని కోరుకుందాం!

- ఎస్. పుణ్యవతి

వదులుకోవద్దు గవర్నమెంటులో రిక్రూట్‌మెంట్స్‌లేవు నిరుద్యోగం సెకనుకు మూడుపువ్వులు ఆరు కాయలుగా విలసిల్లుతుంటే ఏ ఉద్యోగమైతేంటి? ఉద్యోగం ముఖ్యం అది మనకు నచ్చిందా కాదా అనే బేరీజు ఈ రోజుల్లో వేసుకునే అవకాశం లేదు. మనకు నచ్చిందే కావాలంటే ఒక జీవిత కాలం కాదు వేయి తరాల కాలం వేచినా దొరికే నమ్మకం లేదు. అంతగా అయితే నికిష్టమైన లెక్చరర్ పోస్టు వదులుకోవచ్చులే. ముందు వెళ్ళి జాయినవమని చెబితే ఈ క్లర్కు పోస్టులో జాయినైన అయిష్టంగానే, నా అదృష్టంగా ఇపుడు ఈ లెక్చరర్ పోస్టు వచ్చింది. కాని ఈ ఆఫీసులో చేరినంక నాకు చాలా మంది ఫ్రెండ్స్ అయ్యారు. ఇంకోటి... డిపార్టుమెంటులో ట్రాన్స్‌ఫర్‌లే ఉండవు. క్లర్కు పోస్టులో చేరేప్పుడు ఎంత ఇబ్బందివద్దానో అలవాటైనాక వీళ్లందరిని వదిలి పోవాలంటేనే కష్టంగా ఉంది. కానీ పోస్టు ఇష్టమైనది. లీవ్ ఉంటుంది. ప్రాక్టికల్‌గా ఉంటుంది. ఫైల్ తరహా వర్కు ఉండదు. ఎంత సేపు కాగితాలు కలమే వర్కు ఈ క్లర్కు జాబ్‌లో. పైగా 10-30 నుండి 5.00 గం. వరకు పనిచేయాలి. పైన బాసిజం ఉంటుంది. ఇకా తూకవేసుకుంటూ పోతే మొగ్గంతా లెక్చరర్ పోస్టువైపే ఉంది. కాని ఇక్కడి ఫ్రెండ్స్ మీద అవన్నీ వేస్తే కదా అని ఇంకో ఆలోచన ఎటూ నిర్ణయించుకోకుండానే నిద్రపోయాను.

మరునటి రోజు ఆఫీసుకు తయారై వెళ్ళి సంతకం పెట్టి ఫ్రెండ్స్ అందరికీ లెక్చరర్ పోస్ట్ వచ్చిందని చెప్పిన. అందరూ ఓ వైపు వెళ్తున్నందుకు బాధపడుతూ ఇంకో వైపు "మంచి పోస్ట్ వచ్చింది కంగ్రాట్స్" చెప్పారు. కాని నాకు ఎక్కడో ఓ మూల మళ్లీ జీవితం మొదలు పెట్టాలి. మళ్లీ కొత్త పరిచయాలు ఎగ్జిస్టింగ్ సమస్యలు. అదీ ఒంటరిగా భయంగా ఉంది. ఈవెనింగ్ స్పెషల్‌లో మా బస్‌మేట్ పద్మజ అని ఓ మంచి ఫ్రెండ్ ఉంది. నేను ఆఫీసులో చేరిన కొత్తలో బస్‌లో పరిచయమైంది. ఆమె యం.సి.హెచ్‌లో చేస్తుంది. వాళ్లన్న ఇదివరకు విద్యార్థి ఉద్యమాల్లో పనిచేశాడట. ఆ వాసనలు ఆమెక్కూడా ఉన్నాయని ఆమె మాటల్ని బట్టి తెలిసింది. బస్‌లో రకరకాల రాజకీయాలు మాట్లాడుకునే వాళ్లం. ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజావ్యతిరేక విధానాలు. ఉద్యోగ కార్మిక విధానాల మీద, నిరుద్యోగం మీద బాగా మాట్లాడేది. అట్లా ఆమె నాకు సన్నిహితమైంది. బస్ నెక్స్ట్ స్టేజిలో పద్మజ ఎక్కుతూనే "హాయ్" అని పలకరించింది. "ఏంటి దల్‌గా ఉన్నావు బాలేదా?" "ఏం లేదు పద్మా నాకో సమస్య వచ్చిపడింది. నాకు లెక్చరర్ పోస్టు ఓ మారుమూల పల్లెలో వచ్చింది వెళ్లదమా మానదమా అని సందేహిస్తున్నా".

"ఇందులో సందేహించదానికేముందోయ్, మంచి పోస్ట్ నీకు తగిన పోస్ట్, వెళ్లి జాయిన్‌కా. ఈ సిటీలో ఉద్యోగాలు చేయడం కంటే మారుమూల పల్లెల్లో చేయడం హాయిగా గౌరవంగా ఉంటుంది. సిటీలో మనల్ని ఎవరు లెక్కచేయరు. అంతా యాంత్రికం ఇక్కడ పక్క మనుషులంటే లెక్కలేదు. ఎవరు ఎవర్ని పట్టించుకోరు. పక్కింట్లో వాళ్లు కూడా తెలియదు. బస్‌ల హడావుడి. ఎవరి లైఫ్ వాళ్లది. బొత్తిగా అమానుష జీవితాలు. కాని ఊళ్లల్లో అలాకాదు తెల్సా. అని ఖమ్మం జిల్లాలో మానెపల్లి అనే ఓ విలేజ్‌లో చేశా అబ్బో! ఎంత గౌరవం. ఎంత బాధ్యత, ఎంత మానవత్వం. ఊరి పెద్దలు, చిన్నలు నాకు ఎంత మర్యాద చేశారో తెల్సా. నాకు ఇల్లు ఏర్పాటు చేయించి వంటకు, పనులకు పనోల్లని పంపించేవాళ్ళు. పండగలప్పుడు స్పెషల్ భోజనాలు, ఏ పంటయినా అన్ని పంపించేవారు. అందరు నన్ను కన్నుల పండువుగా చూసేవాళ్లు. రాజభోగాలుంటాయ్ తెలుసా. " కళ్లు మూసుకుని జాయిన్ అవ్వు" అని తన జ్ఞాపకాలను గుక్కతిప్పుకోకుండా ఊరిస్తూనే ఆదేశించింది. ఒక్క నిమిషం నేను కూడా పద్మజలాగా రాజభోగాలతో అందరి గౌరవమన్ననలతో



ఆత్మీయతలతో ఊరేగుతానని ఉబ్బిపోయి వెంటనే నా నిర్ణయం గట్టి చేసుకుని వెళ్లడానికే సిద్ధపడ్డాను. తలలో రేగే ఊగిసలాట, తుఫాను కాస్త సద్దుమణిగింది. గట్టిగా ఊపిరి పీల్చుకుని నిశ్చింతగా ఇంటికెళ్లిపోయా.

తెల్లవారి ఆఫీసుకెళ్ళి ఫ్రెండ్స్‌తో " నేను లెక్చరర్ పోస్టు కోసం ఈ జాబ్ విడిచి వెళ్తున్నాను" అన్నాను. ఒక పెద్దావిడ "ఇక్కడ మాకందరికీ బాగా అలవాటయ్యావు అందర్ని వదిలేసి వెళ్తావా కొంత సర్వీస్ చేశావు ఇప్పుడు మళ్ళీ ఈ సర్వీసు పోదా" అంది. కానీ పద్మజ చెప్పిన తన ఊరి ఉద్యోగం జ్ఞాపకాలే తొందరపెడ్తున్నాయి. ఊర్నించి తమ్ముడ్ని పిలిపించి ఆఫీసు నుంచి రిలీవింగ్ ఆర్డర్ తీసుకొని ఫ్రెండ్స్ అందరి దగ్గర సెలవు తీసుకుని సామాను సర్దుకొని లక్ష్మీ

దేవ్‌పూర్ బయలుదేరా. హైద్రాబాద్ నుంచి డైరెక్టుగా అక్కడికి బస్సులు లేవు. కరీంనగర్‌లో దిగి అక్కణ్నించి ఇంకో బస్సెక్కాలి. హైద్రాబాద్ నుండి పొద్దున 5 గంటలకు సామానుతో బయలుదేరా తమ్ముడితో. తొమ్మిదింటికి కరీంనగర్‌లో దిగి అక్కణ్ణించి లక్ష్మిదేవ్‌పూర్ బస్ ఎక్కా. మధ్యాహ్నానికి చేరుకున్నాం. బస్టాండులో బస్సులు ఎర్రమట్టి దిబ్బల్లో పొర్లాడే జెర్రిపోతుల్లా వస్తూ పోతున్నవి. ఇది తాలూకా సెంటరట. కాని అంతా మట్టిరోడ్లే. దాదాపు ఆరు వేల జనాభా ఉంటుందట. ఊరిచుట్టు పెద్ద అడవి. ఓ పక్క మహారాష్ట్ర. మరోపక్క మధ్యప్రదేశ్ అనుకుని ఉంది. దూరంగా గోదావరి తెల్లగా నవ్వుతోంది. అడవి ఆహ్లాదంగా గంభీరంగా ఊరంతా చుట్టుముట్టినట్లుంది. కొంత ఎర్రనేల, కొంత నల్లనేల ఎంత ముద్దొస్తుందో ఊరంతా పచ్చగా నల్లగా ఎర్రగా కలగాపులగంగా ఉంది. ప్రయాణీకులు నిలబడదానికి చిన్న షెడ్డుంది. దానికి పది గజాల్లో రెండు మూడు బెంచీలు వేసిన తడికల గుడిసెలో నుంచి చాయ్ అందిస్తు తాగుతూ మనుషులు కన్పించారు. దాని పక్కనే డబ్బా దుకాణం. దానికి సీదా ఓ కంకర రోడ్డు దాకా వెళ్ళి, "అయ్యా! ఇక్కడ కాలెజి ఎటువైపుందయ్యా?" అని అడిగాను. "ఈ రోడ్డు పొంటి కొంచెం ముందలికి పోతే ఎడమ సెయ్ దిక్కు గేటుంటుంది. బోడు గూడ రాసుంటది గదే కాలేజమ్మ" అన్నాడు. సరే మా తమ్ముడిని బస్టాండులోనే ఉంచి " నేను కాలేజికి పోయి జాయిన్ అయివస్తా సామానుతో కాలేజికి ఎట్లా వెళ్తామని" చెప్పి కాలేజికి వెళ్లా, నలుగురైదుగురు కూర్చుని ఉన్నారు. ప్రిన్సిపాల్ ఆఫీసు రూము. ( అది కాలేజీలా పక్కాగా లేదు. కూలడానికున్న పాత మట్టి గోడల్తో షెడ్లతో ఉంది) ఒకవైపు స్పెషల్‌గా ప్రత్యేకంగా కూర్చున్న వ్యక్తి ప్రిన్సిపల్ అని చెప్పకనే చెప్తుంది కుర్చీ. నమస్కారం చేసి నా గురించి నేను పరిచయం చేసుకొని జాయినింగ్ రిపోర్టు ఇచ్చా. అక్కడ కూర్చున్న వాళ్ళు కూడా లెక్చరర్స్ అని ప్రిన్సిపల్ పరిచయం చేశాడు. లేడి లెక్చరర్ సరోజ అని హిస్టరీ టీచ్ చేస్తారట. ఆమె నాలుగు రోజుల కిందటే జాయిన్ అయి మళ్ళీ ఇవ్వాల వచ్చిందట. ఏంటి ప్రాబ్లమ్ అంటే ఇళ్ళ ప్రాబ్లమ్ అని చెప్పింది. వచ్చిన లెక్చరర్స్ అంతా ఇళ్ల వేటలోనే ఉన్నారట.

నేను సామానుతో వచ్చానని, సామానుతో మా తమ్ముడు బస్టాండులో ఉన్నాడని, నాకిప్పుడో రూము కావాలని చెప్పాను, 'మేడమ్ ఇక్కడ ఇండ్లు ఎవరూ కిరాయిలకోసం కట్టుకోరట. ఒకవేళ కట్టుకున్నా బాత్రూమ్‌లు, టాయిలెట్లు ఎవరికీ ఉండవు. అవి లేకుండా మనలాంటోల్లకు కష్టం. బాత్రూమ్‌లు ఒక్క కోమటి, బాపనోల్లకే ఉంటాయి. "వాళ్ళ ఇండ్లల్ల ఏమన్నా అడగాలె. ఇప్పటికైతే సామాను మా ఇంట్లో పెట్టి, మీరు ఇంకో మేడమ్ ఇప్పటికి మా ఇంట్లోనే ఉండుండ్రి" సరోజ మేడమ్ బాగా మాట్లాడ్తుంది. ఓ అరగంటలోనే బాగా కల్సిపోయింది. నాకు పెద్ద తోడు ఈమె అనుకున్నాను. సరోజ, నేను కలిసి బస్టాండ్‌కెళ్లి తమ్ముడితో కలిసి సామాను ప్రిన్సిపల్ ఇంట్లో పెట్టి తమ్ముడికి ఇళ్ల విషయం చెప్పి వాణ్ణి బస్సెక్కించాం. ప్రిన్సిపల్ ఇంట్లో కాళ్లేతులు మొకం కదుక్కొని సాయంత్రం ఇళ్ల వేటకు బయలుదేరాం. ఎక్కడా ఇండ్లు దొరకలేదు. అన్ని పూరిండ్లు, గూన పెంకులిండ్లు కొన్నున్నయ్. దాబా ఇల్లు మచ్చుకు కూడా లేదు. అంతా దుబ్బదారే. ఎక్కడడిగినా "మాకే సరిపోతలేదు ఇల్లు మీకెక్కడిత్తం". యిల్లు బాగున్నది కాని తానాల అర్రలేదు. పాయకానకు సెంబట్టుకుని బైటికి బోవాలె" అని చెప్పుండ్రు. ఈసురోమని మళ్లీ ప్రిన్సిపాల్ ఇంటికి పోయినం. ఆయనకు కూడా రెండు గదులు పెంకుటిల్లు. అది ఒక బి.సి. ఉద్యోగిది. ఆ ఊళ్లో టాయ్‌లెట్స్ ఉన్న ఒకే ఒక బి.సి. ఇల్లది. ప్రిన్సిపల్ కూడా బి.సి.నే మాకు ఇల్లొక పెద్ద సమస్యగా మారింది. హైద్రాబాద్‌లో పద్మ చెప్పిన ఏ విషయాలు అందిరాలేదు. ఎవరూ పట్టించుకోవడంలేదు. కొత్తగా వచ్చిన లెక్చరర్లని కనీసం పలకరింపులు కూడా లేదు. ఆమెకు తేరగా వచ్చిన మార్యదలు, గౌరవాలు లేకుంటే పాయే తల దాచుకోడానికి ఇల్లన్నా లేదు. అనవసరంగా వచ్చిన్నేమో హాయిగా హైదరాబాద్‌లో ఉండక ఈ కొనిపెట్టుకున్న కష్టాలేంటి. "మంది మాటలిని మార్మానంబోతే మల్లచ్చెటాలకు ఇల్లు గాలిందట" అట్లనే ఉన్నది నా పరిస్థితి. పాపం సరోజ కూడా "ఇల్లు ఈరోజు దొరకలేదు రేపైనా ఇంకా బాగా తిరుగుదాం" అంది. ఆరోజు ప్రిన్సిపల్ ఇంట్లోనే తిని ఉన్నాం. తెల్లవారి మళ్లీ బయలుదేరం. దారిలో ఓ పెద్ద మనిషి కలిసి **"అమ్మా మీరు మా ఇండ్లల్ల తానాలకు సొలతులుండయిగా కోమటి, బాపనిండ్లు అడుగుండ్రి గాల్లిండ్లలనైతే మీరు సొలతిగుండొచ్చు"** అన్నాడు. తిరగనైతే తిరుగుదాం అంటూ ఇద్దరం మాట్లాడుకుంటూ తిరిగుతున్నాం. సరోజది నిజాంబాదట. తన కులం, కుటుంబ విషయాలు అన్ని చెప్పింది. ఇద్దరం వేరు వేరు గాదన్నమాట. ఒకే నేపథ్యం అయినందుకేమో చాలా దగ్గరయ్యాం. ఇట్లా మూడు రోజులు ప్రిన్సిపాల్ ఇంట్లో సామాను పెట్టి పగలంతా సగం ఇల్ల వేటలో, సగం కాలేజిలో గడపడం, రాత్రి ప్రిన్సిపాల్ రెండు రూములల్లో ఇబ్బందిగా చాలీచాలని నిద్రపోయినట్టనిపించినా ఎప్పుడెప్పుడు వెళ్లిపోదామా అని ముళ్ల మీద నించున్నట్లుంది పరిస్థితి. మా ప్రిన్సిపాల్ వాళ్లకి వీళ్ళకి కబురు పెట్టినా సీరియస్‌గా ఎవరు పట్టించుకుంటలేరు. సమస్య మాది గనుక సీరియస్‌నెస్ కూడా మాకే ఉన్నందువల్ల మాకు ఇంటి వేట జీవన్మరణ సమస్యగా వెతుకుతున్నాం. ఇప్పటికీ నాల్గురోజులు కావస్తున్నా ఇంత చిన్న గ్రామంలో ఇల్లు దొరికే స్థితిలో లేదు. ఏం చేద్దామని, మాట్లాడుకుంటూ నడుస్తుంటే పెంకుటిల్లే అయినా పెద్దగా విశాలంగా ఉండి చుట్టూ ఫెన్సింగ్ ఉన్న ఇల్లు కన్పిస్తే ఏమైనా రూములు ఖాళీ గున్నాయేమోనని లోపలికి వెళ్లాం. పెద్ద అరుగుల మీద కూర్చుని పిల్లలు చదువుకుంటున్నారు. ఫెన్సింగ్ లోపలికొచ్చిన మమ్మల్ని చూసి "ఎవరు ఏంగావాలో" అన్నారు. "మేము ఇక్కడి కాలేజి లెక్చరర్స్‌మి. మీ అమ్మ ఉందా?" అన్నాను. ఓ అబ్బాయి లోపలికెళ్ళి ఏం చెప్పాడో లోపల్నుంచి ఓ పచ్చని రంగులో ఎర్రటి బొట్టు దాని కింద మరో బొట్టుతో వెంట్రుకల్ని జారుముడి వేసుకొని టపటప మెట్టలతో 35, 45 మధ్యలో ఉన్న ఒకామె వస్తూ ఓ మారు కాస్త పరిశీలనగా చూస్తూ "ఏంటి" అంది. "మేము కాలేజి లెక్చరర్స్‌మండి మీ ఇంట్లో రెంట్‌కి ఏమైనా రూమ్ దొరుకుతుందా?" అని అడిగాం. ఎక్కన్నుంచి వచ్చారు? ఎంత మందుంటారు? ఏ వూరు గత్రాలడిగింది కాని యింకా ముందుకు బోయి ఏమడుగలేదు. కులం అడిగితే చెప్పేద్దామనుకున్నాం. కాని అడగలేదు. అట్లా అడుగుతూ కాళ్ళ నుంచి మెడ వరకు గమనిస్తూంది. మమ్మల్ని చూసి మా గురించి చెప్పాక మా భాష, బట్టలు, మనుషుల్ని చూసి బాపనోల్లని అనుకోపోయినా ఏ కమ్మ, కాపోల్లో, వెలమనో అయుంటారనుకొనేమో, "ఆ పక్క రెండు రూములు ఖాళీగా ఉన్నాయండీ కాని మీకా రూములు సరిపోతాయా, సిటీలో వున్న వాళ్ళు యీ వల్లెటూళ్లో వుంటారా...నీళ్ళు తోడుకోవాలె, పంపులుండవు". అంటూ రెండు రూములు తలుపులు

తీసిచూపించింది. ఏదో ఓ నీడ ఉంటే చాలనుకున్నాం. వెనుక బావి, దాన్ని ఆనుకుని వున్న బాత్రూమ్ చూపించి కాంపౌండంతా కలెదివ్వుతూంటే కొంచెం దూరంలో ఆరేసిన వడియాలు దబ్బాలకెత్తుతూ ఓ ముసలామె మమ్మల్ని చూసి "ఎవరే వాండ్లు" అని అడిగింది. " కాలేజికి కొత్తగా వచ్చిన లెక్చరర్లట అత్తయ్యా యిల్లు కావాలని అడుగుతున్నారు" అంటూ " మా అత్తయ్య ఆమె. మా మామగారు ఈ వూరి దేవాలయ కమిటి ప్రెసిడెంట్. మా యింటాయన టీచరు" అందామె. ఆ కాంపౌండ్‌లో ఓ పెద్దగద్దె చూపించి " మీరు కూర్చొండి మా అత్తయ్యతో మాట్లాడొస్తా" అని వెళ్లింది. నేను సరోజ ఫరవాలేదు కదా యిల్లెట్లున్నా యిస్తామంటే బంగారంలా ఉందాం. ఈ యిల్లు దొరికితే మనకంటే అదృష్టవంతులు లేరని మురుసుకుంటుండగా " మిమ్మల్ని మా నానమ్మ పిలుస్తుందంటూ" పిలుపొచ్చింది. అత్తా కోడల్లు అరుగుల మీద కూర్చొని మమ్మల్ని కూడా కూర్చోమన్నారు. "ఏమమ్మా మీకు యిల్లు నచ్చిందా...ఇంకో విషయం....... మీరు గుడ్లు మాంసాలు తినేవాళ్ళో, కాదో నాకు తెలీదు గాని అట్లాంటివి మా ఇంట్లో వండొద్దు" అంది. మా ముఖాలు పరిశీలనగా చూస్తూ, నేను స్వరోజ ఒకరి మొహాలు ఒకరం చూసుకొని "లేదండిమేము యింట్లనే తింటామండి, మీకిబ్బందిగా వుంటే అసలే వండుకోమండి అసలు మాకు అవి వండుకోవడం కూడా రాదండి" అని వుండే నీడ కోసం ఇష్టమైన తిండిన కూడా లెక్కజేయకుండా "తినమండి, వండుకోమండి" అని యిద్దరం పోటీపడి ఏక కంఠంతో నమ్మబలికాం. యిద్దరు లోపలికెల్లి మాట్లాడొచ్చారు. మీకిల్లిస్తాం గాని ఓ సారి మా యింటాయనని, మా మామగార్ని కూడా అడిగి ఏ విషయం చెప్తాం. ముసలావిడ అపనమ్మకంగా, ఆమె కోడలు అద్దె వస్తుందన్న ఆశతో మొత్తానికి యిల్లిస్తామని ఒప్పుకున్నారు. " "హమ్మయ్య" అనుకున్నాం. కొసమెరుపుగా బామ్మగారు మీ యిల్లు మీరు బాగా నచ్చారండి అద్దె విషయం కూడా చెప్తే యిప్పుడే సామాను పట్టుకొస్తామండి మూడు రోజుల్నుంచి తిరుగుతున్నామండి ఎక్కడా యిల్లు దొరకడంలేదు అని ఆడపిల్లలమని, దూరం నుంచి వచ్చామని ఎట్లయినా మాకు యిల్లిప్పించండని వాళ్ల మనసు కరగాలని చాలా చాలా చెప్పింది సరోజ. మా స్నేహితురాలు పద్మ చెప్పిన సీన్‌మాకు లేదేంటబ్బా...లోపం ఎక్కడ జరిగిందనే విషయం ఓ వైపు తొలుస్తూనే ఉంది. మాతోపాటు జాయిన్ అయిన లెక్చరర్స్‌లో ఖాజా మొహినుద్దీన్, జేమ్స్ కొమురయ్యలకు యిల్లు దొరకలేదు. వాళ్ళు రాత్రి కాలేజీలోనే నిద్ర, మిగతా స్నానపానాదులు కానిస్తూ హోటల్లో హాయిగా తింటూ వాళ్ళు బాగానే వున్నారు. అసలు యిల్లు ఓ అవసరంగానే ఫీల్ కావడంలేదు. సాఫీగానే నడుస్తుంది వాళ్ళకు. కాని వాళ్ళలా మేము కూడా వుండడానికి సామాజిక పరిస్థితులు సమానంగా లేవు. దుర్భరంగా వుంది.

మధ్యాహ్నం మల్లా యిల్లిస్తున్న వాళ్ళింటికి వెళ్లాం. అత్తాకోడల్లు " మా ఇంట్లో సరే నన్నారు. మంచి ఘడియలు చూసుకొని రండి" అన్నారు కూడబలుక్కున్నట్లుగా. యిద్దరం ఎగిరి గంతేసినట్లుగా సంతోషపడ్డాం. "ఏ ఘడియైనా ఫరవాలేదండి సాయంత్రమొస్తా" అన్నాను. కోడలు " మీ ఇష్టం వుండేది మీరు" సాయంత్రం సామాను తీసికెళ్ళి పక్కన పెట్టి రెండు గదులు కడిగి సామాను సర్దాం. నాలుగు రోజులు కాలేజి, యిల్లు బాగానే గడిచింది. 5వ రోజున సాయంత్రం క్లాసులు తీసుకుంటూ కాలేజీలో ఉన్నప్పుడు మా చప్రాసిని రమ్మన్నారట మాకిల్లు యిచ్చినోల్లు. వాళ్ళు చప్రాసితో "వాళ్ళు కదజాతోల్లంటగదా మొకాలు జూసిచ్చినం కులమడగకుండ. ముందు ఆ సామాను తీసికెళ్లమని చెప్పు. యిల్లు శుద్ధి చేయించాలన్నారట. చప్రాసి కాలేజికొచ్చి జరిగిన విషయం చెప్పాడు నొచ్చుకుంటూ. తాతల తరాలున్నట్లు మేము లేము. ఎన్నో ఉద్యమాలు చేసి చదువుకొని యీ స్థితికొచ్చినంక గూడ మా నుదుటి మీద అంటరాని గీతలు చెరిగిపోవడం లేదు. వాళ్లు చేసిన అవమానం తిరిగి మా చెవుల్లో సీసం నింపుతున్నట్లు.. మా నాలిక చీరుతున్నట్లు.వేళ్ళు నరుకుతున్నట్లుగానే వుంది. ఎప్పుడో ఎన్నో పోరాటాలు చేసి మేం పగల కొట్టిన ముంత...మళ్లీ మా మూతికి కడుతున్నట్లుగా... జారిపోయిన తాటాకును, మా మొలకు మళ్ళీముడేస్తున్నట్లే అన్పించింది.

వాళ్ల మొకాలు చూడాలంటేనే అసహ్యం పుట్టింది. అట్లాంటి యింట్ల వుండే కంటే చెట్టుకిందుండడం సుఖమేమో. 'ఛీపాడు' మనుషులనుకొని చప్రాసిని పంపించి సామాను కాలేజీలో పెట్టించాం. శుద్ధి చేయాల్సింది యిల్లును కాదు-మిమ్మల్ని మీరు శుద్ధి చేసుకోండి' అని అనుకున్నాం. ప్రిన్సిపాల్ సామాను చూసి బాధగా నాకు తెలుసండి వాళ్ల మనలాంటోల్లకు యిల్లియ్యరు అల్లబుద్దే అంత'. మనమెంత చదువుకున్నా ఎంత స్థితిమంతులమైనా అల్లు మనల్ని అల్లకిందోల్లుగానే... నీచపు మనుషులుగానే చూస్తారండి'_అన్న ప్రిన్సిపాల్ మాటలకు, పద్మజ కందిన గౌరవాలు మాకెందుకు దొరకలేదో అప్పుడదర్థమైంది.

★★★




**వ్యాపారం**

బోరుబావిలో
బాలుడి శవం
టి.వి. చానల్లో
ఎస్.ఎం.ఎస్‌ల ప్రవాహం!!

**వివక్షలేదు**

రెండుగ్లాసుల
పద్ధతి లేదెక్కడా!
గాజుగ్లాసులు నాజుగ్గా
డిస్పోజబుల్ గ్లాసులయ్యాయి!!

- సుధాకిరణ్.బి.




# అభిరుచి

✍ జి. రాజకుమారి



"స్నేహ బంధమూ ...ఎంత మధురమూ...
వాడిపోదు...వీడిపోదు జీవితాంత..." రపీమంటూ ఎఫ్.ఎమ్. గొంతు నొక్కేసింది శృతి.

'పాట ఆగిపోయిందేంటీ..పవర్ కట్ అయిందా' రేడియో వున్న గదిలోకొచ్చింది మనోరమ. అప్పటికే శృతి బాల్కనీలోనికి విసవిసా వెళ్తుండటం గమనించిందామె. 'ఓహో..దీని పనా...ఏంటో ఇవాళ ..వస్తూనే రుసరుసలు..' అనుకుంటూ కూతురు దగ్గరకెళ్లింది మనోరమ.

"ఏమైందిరా?" శృతి నుండి సమాధానం రాలేదు. కాసేపు సంశయించింది. 'కొత్తగా జాబ్‌లో చేరింది కదా... ఆఫీసులో ఏమైనా...గొడవైందా?.. అసలే వేసవి... అంత దూరం నుండి బస్సులో రావడం వల్లేమో.. రిలాక్స్ కానీ...' ఆలోచిస్తూ లోపలికెళ్లింది మనోరమ.

పావుగంటైంది. "అమ్మా...! మంచినీళ్లూ..." శృతి మాటలు పూర్తి కాకుండానే మనోరమ వాటర్‌బాటిల్ అందించింది. "నీళ్లు చల్లగా లేవమ్మా"అని శృతి అంటుంటే, "ముందు నువ్వు కూల్ కా.." అంటూ రేడియో ఆన్ చేసింది మనోరమ. "అప్పుడో...యిప్పుడో..ఎప్పుడో! కల గన్నానే చెలీ.."

"ప్లీజ్! అమ్మా...వుండనీ.. మంచి పాట" వాళ్లమ్మ రేడియో ఆఫ్ చేస్తుందేమోనని కంగారుగా అంది శృతి.

" నేనెందుకు బంద్ చేస్తాన్రా.. మంచి పాటే. మరీ.. ఇందాక నన్నడిగే రేడియో కట్టేశావా? లేదే.. అదీ నాకిష్టమైన పాటేనని ..నీకూ తెలుసుగా.." లాజిక్ పాయింట్ రైజ్ చేసింది మనోరమ.

"ప్లీజ్ మా!...మూడ్ బాగా లేదు..." హెయిర్‌బాండ్ తీసి విసిరికొట్టింది శృతి.

"ఏమైంది?" మాటవరుసకు అడిగిందేకానీ..'ఇదసలే మొండి ఘటం. ఏమి గొడవ తెస్తుందోనని' మనోరమకు లోలోన భయంగానే వుంది.

"అదే మొన్న కూడా చెప్పా కదా.. సురేఖా , సునీల్ అని ఇద్దరు వేస్ట్ కాండేట్స్ గురించి.... ఆఫీసులో.. వాళ్లు పనిచేయరు. ఒకర్ని చేయనివ్వరు. పైగా ఆ సునిల్‌గా... నన్నెప్పుడూ కమాండ్ చేయాలని చూస్తుంటాడు. ఏదో ఒక సాకుతో జోక్యం చేసుకుంటూనే వుంటాడు.. అతని పనికీ నా పనికీ సంబంధమే వుండదు. నాకు ఒళ్లు మండుతోంది. వాడికి తోడు ఆ సురేఖొకటి..;;ఛస్తున్నా..చిరాగ్గా వుందమ్మా! జాబ్ మానేస్తా.." కుర్చీలోనుండి విసురుగా లేచింది శృతి.

ఇదేమీ పట్టనట్టు,"వంట మధ్యలో ఆపాను. ఈలోగా నువ్వు రెడీకా.. అలా బజారెళ్లి రేవటికి కూరగాయలు తెద్దాం..''కూతుర్ని పురమాయించింది మనోరమ.

***

భోజనమైంది. 'దీనికిదో మంచి లక్షణం...' పుస్తకం చదువుతున్న శృతిని చూసి మురిసిపోయింది మనోరమ. " ఇటు చూద్రా..! ఎవరి అభిరుచులు వారివి. ఆడవాళ్లేమిటి..మగవాళ్లనేమిటి? శ్రమకు సంబంధించి క్రమశిక్షణ ఎవరికైనా ఒక్కటే. అందరూ సరిసమానంగా వుండాలని కోరుకుంటున్నపుడు వనిలో కూడా పోటీగానే వుండాలి..రెండోది, మహిళగా నమాజంలో లభించే కొన్ని మినహాయింపుల్ని కెరీర్‌కు సంబంధించిన స్వేచ్ఛకు జోడించటం సరైంది..కాదు.ఔనా?" తలూపింది శృతి.

''అన్నిటికంటే మించి అందరికంటే ఎక్కువగా మనమే కష్టపడిపోతున్నాం..అనుకోవడం కూడా పొరపాటు.." "అమ్మా.. నేనెప్పుడూ అలా అనుకోను.. నా ప్రాబ్లెమ్ అది కాదు. నామీద ఆర్డర్స్ జారీ చేస్తుంటే ఎలా సహించేది?" విసుగ్గా అంది శృతి .

"అలా సందర్భం లేకుండా కొలీగ్స్ ఎవరైనా ఆర్డర్స్ యిస్తే, వాటిని సున్నితంగానే తిరస్కరించాలి. కాలేజీలో ఫ్రెండ్స్‌తో పేచీ పడినట్లు కొలీగ్స్‌తో తగాదా మంచిది కాదు. సునిల్ ధోరణి వ్యక్తిగతంగా ఇబ్బంది కలిగిస్తే పట్టించుకోకు. సంస్థకు నష్టం కల్గిస్తుందని నీకనిపిస్తే, మీ ఇన్ఛార్జి దృష్టికి తీసుకెళ్లు. మనుషులంతా మూస పోసినట్లు ఒకేరీతిన వుండరు. నీలో కూడా వాళ్లకు నచ్చనివి వుంటాయని ఎందుకనుకోవు?" తల్లి నిలదీస్తుంటే, "ఏంటమ్మా..నన్ను దులిపేస్తున్నావ్.. పని విషయంలో జాగ్రత్తగానే వుంటా..ఎటొచ్చీ, ఎవరైనా అజమాయిషీ చేస్తేనే భరించలేను.."చెప్పింది శృతి.

"ఏ ఉద్యోగి అయినా ఆఫీసులో తానూ ఒకరిని అనుకోవాలే తప్ప తనో ప్రత్యేకమైన వ్యక్తిని అనుకోవడం పొరపాటు శృతీ.. ఇవన్నీ ఎందుకు చెప్తున్నానంటే, ఇప్పుడున్న స్థితితోనే సంతృప్తి పడటం మంచిది కాదు. ఇంకా పైకి ఎదిగే ప్రయత్నం చేయాలి. ప్రతీ చిన్న విషయానికీ గొడవలొద్దు. తెలిసిందా.."తన భుజంమీదున్న మనోరమ చేతిని తీస్తూ, " సరే...నిద్రపోతాన"మ్మా అంది శృతి.

'వివిధ రంగాల్లో ఏ విధంగా వృత్తి నైపుణ్యం సంపాదించాలో? వృత్తి కార్యక్రమాల్నీ, కుటుంబ బాధ్యతల్నీ ఎలా సమన్వయం చేసుకోవాలి? తదితర అంశాలను కాలేజీ స్థాయిలోనే విద్యలో చేర్చితే బావుణ్ణు!' ఆలోచిస్తూ మనోరమ కూడా నిద్రలోనికి జారుకుంది. ★★★

# జకియా జాకీ జిందాబాద్

వేములపల్లి సత్యవతి

ప్రపంచంలో ప్రతి దేశంలో, ప్రతిమతంలో, అన్ని కులాలలో మహిళలు వివక్షతకు గురవుతున్నారన్న సంగతి అందరూ ఎరిగినదే. ఇందులో చదువుకున్నవారని, చదువుకోనివారని తేడా లేదు. ఇంటా-బయటా మహిళలు రకరకాల సమస్యలనెదుర్కొంటున్నారు. వేధింపులకు గురవుతున్నారు. ముస్లిం మహిళలయితే పరదాచాటున బురఖాలో మగ్గిపోవలసిందే. నిరక్షరాస్యత, అధిక సంతానం, బహు భార్యాత్వం, తల్లాక్ వంటి వాటితో అల్లాడిపోతున్నారు. బురఖాను వదలివేయవలెనని ప్రతిభా పాటిల్ ముస్లిం సోదరీమణులకు విజ్ఞప్తి చేసింది. దానికి హైదరాబాద్‌లోని మతపెద్దలను ఆగ్రహావేశాలు చుట్టు ముట్టినవి. 19.06.07వ తేదీన ముషీరాబాద్‌లోని ఏక్‌మీనార్ వద్ద ముస్లిం ఎంబిటి పార్టీ ఆధ్వర్యంలో మత సంరక్షకులంతా సమావేశమయ్యారు. ప్రతిభాపాటిల్ దిష్టిబొమ్మను దహనంచేసి తమ నిరసనను వ్యక్తం చేశారు.



అఫ్ఘనిస్తాన్‌లో 1907 జూన్ నెల మొదటి వారంలో జకియాజాకీ అనే మహిళా జర్నలిస్టు తాలిబాన్ మిలిట్లెంట్ల చేతిలో అతిదారుణంగా హత్యకు గురయింది. మొన్నటి వరకు ఆఫ్ఘానిస్తాన్ ప్రజలు కరుడు గట్టిన తాలిబాన్ మిలిటెంట్ల పాలనలో నరకయాతనలు అనుభవించారు. ఇక మహిళల సంగతి చెప్పనక్కర లేదు. వర్ణించనలవిగాని మత సాంప్రదాయాలలో నరకాన్నే అనుభవించారు. తాలిబాన్ల చెరనుండి విముక్తి చెందిన మహిళలు పాఠశాలలకెళ్ళి చదువుకోవటం మొదలు పెట్టారు. అర్హతలున్నవారు అన్ని రంగాలలోను ప్రవేశించి పని చేస్తున్నారు. కొద్దిమంది మహిళా జర్నలిస్టులు కూడా వున్నారు. వారిలో చెప్పుకోదగిన సాహస మహిళా జర్నలిస్టు జకియాజాకీ. "గృహహింసను ఎదుర్కొనేలాగ మహిళల్ని తయారు చేయాలని, తుపాకుల నీడలో నడుస్తున్న ప్రభుత్వంలో ఆడవాళ్లకు బ్రతకటమెలాగో నేర్పాలని, నా ప్రయత్నం. అందుకు రేడియో ద్వారా కృషి చేస్తున్నాను. రేడియో ప్రసారాల ద్వారానే చైతన్యం తొందరగా వస్తుందని నా విశ్వాసం". అని చెప్పిన జకియా తన ఆకాంక్షలు పూర్తవకుండానే తాలిబాన్ మిలిటెంట్ల ఆటోమేటిక్ రైఫిళ్లకు, పిస్టళ్ళకు గురయ్యింది. ఆ నరహంతకులు ఆమెను అతి దారుణంగా కాల్చి చంపారు. జకియా మహిళల కోసం స్వతంత్రంగా ఒక ప్రయివేట్ రేడియో స్టేషన్‌ను నడిపింది. 'ఫర్వాన్' అనే చోట ఈ ప్రసార వ్యవస్థను ఏర్పాటు చేసింది. రేడియో ప్రసారాలలో మానవ హక్కుల గురించి, మహిళల హక్కులను గురించి, చదువుకు సంబంధించిన కార్యక్రమాలు ప్రసారం చేసేవారు. ఈ రేడియో ప్రసారాలు కాబూల్, కపిసా, ఫర్వాన్ ప్రాంతాలలో విరివిగా కొనసాగించారు. రేడియో స్టేషన్ నిర్వహణతోపాటు జకియా ఒక పాఠశాలకు ప్రధానోపధ్యాయినిగా కూడ పని చేసింది. తాలిబాన్ల హెచ్చరికలను బేఖాతరు (ఏ మాత్రము లెక్క చేయలేదు) చేసింది. బెదిరింపులకు భయపడలేదు. వెనకడుగు వేయలేదు. రేడియో స్టేషన్‌ను మూసివేయమని, పద్దతులు మార్చుకొమ్మని లేకపోతే చంపేస్తామని పలుమార్లు తాలిబాన్లు హెచ్చరికలు చేశారు. ఆమె యిసుమంత కూడ చలించలేదు. రెట్టింపు వుత్సాహంతో పని చేయసాగింది. స్వేచ్ఛా, శాంతి సందేశాలను గురించిన కార్యక్రమాలు రూపొందించి ప్రసారం చేయనారంభించింది. పరదాచాటున పడివుండవలసిన ఆడవాళ్లు అన్ని రంగాలతోపాటు మీడియారంగంలో కూడ ప్రవేశించి పనిచేయటం కరుడుగట్టిన తాలిబాన్ మీలిటెంట్లు, మతదురహంకారులు సహించలేక పోయారు. జీర్ణించుకోలేకపోయారు. ఎన్నిసార్లు హెచ్చరికలు చేసినా, బెదిరించినా లెక్కజేయని జకియాను ఈ లోకంలో నుండి లేపి వేయాలని నిశ్చయించుకున్నారు. దానికి అనుగుణంగా ప్రణాళికను రూపొందించుకున్నారు.

ఒక రోజు రాత్రిపూట సాయుధులైన మిలిటెంట్ల దుండగులు ఆమె యింటిలోనికి ప్రవేశించారు. ఆ సమయంలో జకియా ఎనిమిది నెలల కొడుకుని పక్కలో పడుకోపెట్టుకుని నిద్రపోతున్నది. ఆ నరహంతకులు అతి సమీపం నుండి పిస్టళ్ళను,ఆటోమాటిక్ రైఫిళ్ళను ఉపయోగించి ఏడు రౌండ్లు కాల్పులు జరిపి పారిపోయారు. ఈ అసాధారణ జర్నలిస్టు కనిన కలలు, ఆకాంక్షలు పూర్తిగా నెరవేరకుండానే ఆమె ప్రాణాలు గాలిలో కలసిపోయాయి. జకియాను అంతమొందించక ముందు ఆమె ఇంటిలోనే షాకియాసంగా అమాజ్ అనే మహిళా జర్నలిస్టును (ఆమె వయస్సు అప్పుడు 22 సంవత్సరాలు) ఇదే విధంగా మిలిటెంట్లు అంతమోదించారు. 'ఇఫ్ ఐ స్టాండప్' అనే పేరుతో నలుగురు జర్నలిస్టుల మీద యునెస్కో రూపొందించిన డాక్యుమెంటరీలో జకియా జాకీకి కూడ స్థానం దక్కింది. జకియాను గురించి కూడా రాశారు. ఈ కార్యక్రమాన్ని 2005 మార్చిలో అంతర్జాతీయ మహిళా దినోత్సవం నాడు ప్రసారం చేశారు. జకియాజాకీ జిందాబాద్ అనే నినాదంతోపాటు విషణ్ణ హృదయాలతో మనం కూడ ఆమెకి అశ్రుతర్పణం అర్పిద్దాం.

★★★

# ఆధునిక యుగంలో ఆటవికం

# తస్లీమా నస్రీన్ పై దాడి

ఎం. సుధ



మనది ప్రజాస్వామ్య దేశం. భిన్న మతాలు, జాతులు, సంస్కృతులతో కూడిన ఈ లౌకిక భారతంలో తనకు భద్రత దొరుకుతుందనే ఆశతో టూరిస్ట్ వీసాపై మనదేశంలోకి అడుగుపెట్టిన సంచలన బంగ్లాదేశ్ రచయిత్రి తస్లీమా నస్రీన్‌కు అత్యంత చేదు అనుభవం హైదరాబాద్‌లో ఇటీవల ఎదురైంది. ఏ విదేశీయులైనా మన రాష్ట్రాన్ని పర్యటిస్తే సర్వమత సమ్మేళనం గల మన రాష్ట్రంలో సొంత ఇంట్లో ఉన్న అనుభూతిని పొందుతారు. అటు వంటి వ్యాఖ్యలతో ఆనందంగా తిరిగి వెళ్ళిన ప్రముఖులు చాలామంది ఉన్నారు. కానీ ఆగస్టు 8న హైదరాబాద్ మహానగరం నడిబొడ్డున ఉన్న ప్రెస్‌క్లబ్‌లో జరిగిన సంఘటనతో దేశం, రాష్ట్రం ఉలిక్కి పడింది. మత ఛాందసం తలకెక్కిన మదాంధులు, ప్రజలకు ఆదర్శంగా ఉండవలసిన ప్రజాప్రతినిధులు మూకుమ్మడిగా దాడిచేయడమే గాక ఆమెను చంపుతామని బెదిరిస్తూ వీరంగం చేశారు.

బంగ్లాదేశ్‌లో మైనారిటీగా ఉన్న హిందువులు పడుతున్న బాధలను లోకానికి తెలుపుతూ నస్రీన్ రాసిన 'లజ్జ' పుస్తకం సంచలనం సృష్టించింది. దీన్ని ఆ దేశం నిషేధించింది. స్వదేశంలో ఆమెను హత్య చెయ్యాలన్న బెదిరింపులు ఎక్కువ కావటంతో స్వదేశాన్ని విడిచి ఐదేళ్ళు అజ్ఞాత వాసంలో ఉన్నారు. తరువాత వివిధ దేశాల్లో తలదాచుకున్నారా ముస్లిం స్త్రీలు అంధకారంలో ఉన్నారని, అణగదొక్కబడుతున్నారని, వీరంతా చైతన్యవంతులు కావలసిన అవసరం ఎంతైనా ఉందని తన రచనల ద్వారా లోకానికి తెలిపినందులకు, ఖురాన్‌కు వ్యతిరేకంగా ఆమె రచనలు చేస్తుందని ఒక అపవాదు వేసి ఆమెపై ఫత్వా జారీ చేశారు ముస్లిం మత పెద్దలు. ఆమె భావ ప్రకటనా స్వేచ్ఛను అణచివేసేందుకు, రచనలు చేయకుండా భయోత్పాతాన్ని సృష్టించేందుకు ఆమెను ఉరితియ్యాలని ఫత్వా జారీ చేశారు. మత ఛాందసం ముదిరిన మత నాయకులు ఆమె తలకు వెల కట్టారు. ముఖానికి రంగు పూసిన వారికి నగదు బహుమతి ప్రకటించారు. అటువంటి కోవకే చెందిన హైదరాబాద్ పాతబస్తీలోని మత ఛాందస వాద పార్టీ నాయకులు ఆమెపై దాడిచేసి చంపాలని ప్రయత్నించారు. ఈ ఘటనను సర్వత్రా (అన్ని వర్గాలు, కవులు, మేధావులు, మహిళా సంఘాలు) వ్యతిరేకించారు.

ఇటువంటి దాడులు ఈ గడ్డపై గతంలోనూ జరిగాయి. ఆమె రచనలు కొన్ని వివాదాస్పదమై ఉండవచ్చు. అంత మాత్రాన ఆమెను చంపేస్తామనడం ఆటవిక చర్యే అవుతుంది. ఆమె అభిప్రాయాలతో ఎవరైనా విభేదిస్తే వారు తమ అభిప్రాయాలను ప్రజాతంత్రయుతంగా తెలుపవచ్చు. ఆమె భావ ప్రకటనా స్వేచ్ఛను గౌరవిస్తూ భారత ప్రభుత్వం టూరిస్ట్ వీసాపై వుండేందుకు అనుమతించింది. నస్రీన్ రాసిన 'ద్విఖండిత' పుస్తకంలో ముస్లిం మతస్తుల మనోభావాలను గాయపరిచే అంశాలున్నాయని ఆందోళన వ్యక్తం కావడంతో ఆ పుస్తకంపై పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం నిషేధం విధించింది. చాలా కాలంగా ఆమె అక్కడ ఉంటున్నా ఎన్నడూ ఎలాంటి దాడి జరగలేదు అనే విషయం గమనించాలి. మన రాష్ట్రంలో అటువంటి సామరస్య వాతావరణం ఉందా? రాతలను రాతలతోనే ఖండించే పద్ధతిపోయి దాడులకు దిగడం, చంపేస్తామని బెదిరించడం అమానుషం. అరవై ఏళ్ళ క్రిందట పత్రికా స్వేచ్ఛ కోసం పోరాడిన షోయబుల్లాఖాన్‌ను అతి కిరాతకంగా నరికి చంపారు రజాకార్లు. కొద్ది రోజుల క్రితం సియాసత్ పత్రికాధిపతి జాహెదాలిఖాన్‌పైన కూడా అత్యంత జుగుప్సాకరమైన రీతిలో దాడి చేశారు. ఇప్పుడు తస్లీమా నస్రీన్‌పై కూడా దాడికి దిగారు. ఇంటెలిజెన్స్ విభాగం, పోలీసులు కూడా ఆమె వచ్చే సంగతే తమకు తెలియదనటం వారి నిర్లక్ష్యాన్ని చాటుతుంది.

ప్రశాంతంగా జరుగుతున్న కార్యక్రమాలకు వందలాది పోలీసులను తరలించే పోలీసు అధికారులు ఒక మత నాయకులు, రాజకీయ ప్రతినిధులు ప్రెస్‌క్లబ్‌ను ధ్వంసం చేసి రచయిత్రిపై దాడి చేసిన ఘటనలో మాత్రం మీన మేషాలు లెక్కించడం శోచనీయం. అరెస్ట్ చేశామంటే చేశామనే పేరుకు వారిని అరెస్ట్ చేసి వెంటనే విడుదల చేశారు. ఘటనకు బాధ్యత వహించవలసిన ముఖ్యమంత్రి, హోం మంత్రి ఖండించి తమ పని అయిపోయిందన్నట్లు వ్యవహరించారు.

ఈ వ్యవహారం వెనుక రాజకీయ ప్రయోజనం పొందాలనే కుటిల ప్రయత్నాలు జనం పసిగడుతూనే ఉన్నారు. పాతబస్తీలో ఇన్నాళ్ళు ఏకఛత్రాధిపత్యం చలాయించిన ఎంఐఎం ఇపుడు తన అడుగు జారిపోతున్న పరిస్థితుల్లో ముస్లిం ప్రజానీకాన్ని రెచ్చగొట్టేందుకు, తమ ఉనికిని నిలుపుకునేందుకు ఇటు వంటి దాడులకు పాల్పడుతోంది. అధికార పక్షం కూడా దానితో జతకట్టేందుకే దాడికి పాల్పడ్డ ఎంఐఎం ఎమ్ఎల్ఏలు, కార్యకర్తలపై చర్య తీసుకోకుండా నాన్పుతుంది.

ఒక ప్రక్క పేదవారు జానెడు జాగా కోసం ప్రభుత్వ భూముల్లో గుడిసెలు వేసుకుంటే వారిపై లాఠీచార్జి జరిపి దొరికిన వారిని దొరికినట్లు అరెస్ట్ చేసి నాన్‌బెయిలబుల్ కేసులు పెట్టి జైళ్ళపాలు చేసే ప్రభుత్వం ఇంత పబ్లిక్‌గా దాడి చేసిన వారిని ఉపేక్షించడం దాని ద్వంద్వ ప్రమాణాలకు నిదర్శనం.

రచయిత్రి తస్లీమా నస్రీన్‌పై దాడి చేసిన వారు ఘనకార్యం చేసినట్లు సన్మానించుకోవడం చూస్తుంటే ఆశ్చర్యం వేస్తుంది. ఒక రాజకీయ పార్టీ ఇంతగా దిగజారడం దాని దివాళాకోరుతనాన్ని తెలుపుతుంది.

ఈ ఘటనపై హైకోర్టు స్పందిస్తూ "ఎవరి అభిప్రాయాలు వారికి వుండవచ్చు. మనకు నచ్చనంత మాత్రాన నిరాయుధురాలైన ఓ మహిళపై ఇలా దాడి చేస్తారా? మనతో విభేదిస్తున్నారంటూ ఇంట్లో చెల్లి, తల్లిపైనా ఇలానే చేస్తామా? సామాన్యుల్ని రక్షించాల్సిన పోలీసులు నిశ్శబ్దంగా ఉండిపోతే ఎలా? ఇది మారుతున్న సామాజిక పరిస్థితులకు అత్యంత ప్రమాదకర సంకేతం. ఏ పార్టీ ఈ పనిచేసిందన్నది కాదు. రాజ్యాంగపరమైన ప్రశ్నలకు ఇక్కడ సమాధానం కావాలి" అంటూ వ్యాఖ్యానించింది.

ప్రభుత్వం ఇప్పటికైనా తన సంకుచిత దృక్పథాన్ని వీడి భావ ప్రకటనా స్వేచ్ఛపై దాడికి పాల్పడ్డ వారిని కఠినంగా శిక్షించాలి. చట్టం ముందు అందరూ సమానులేనని చాటిచెప్పాలి.

★★★

# పిల్లలను ఎలా పెంచాలి?

✍ ఎన్.ఎస్. లక్ష్మీదేవమ్మ

పిల్లల పెంపకమనేది నా దృష్టిలో ఒక కళ! మొక్కై వంగనిది మ్రానైవంగునా అనే సామెత దృష్టిలో పెట్టుకొని అతి జాగ్రత్తగా, ఓపికతో, ప్రేమతో పెంచాలి. అలాగే చిన్న పాటి మందలింపులు గూడా వుండాలి.

పిల్లలు చేసే తప్పులకు మనం స్పందించకుండా రియాక్ట్ కాకుండా వాళ్ళు ఆ తప్పుల ఎడల రియలైజ్ అయ్యేటట్లు చూడాలి.

మనకు3,4 సం॥రాల పిల్లలుంటారనుకొండి వాళ్ళు మనను ఏ పని పాటా చేసుకోకుండా వంట ఇంట్లో మన వెంటతోకలాగ తిరుగుతుంటే మనం సహనం కోల్పోయి వాళ్ళను దబదబా బాదకుండా వాళ్ళ దృష్టి మరల్చడానికి చిన్నపాటి పనులు చెప్పాలి. ఇదేంటి చిన్న పిల్లలకు పని జెప్పాలంటుందేమిటి ఈవిడ అని అనుకుంటున్నారా? అదేం కాదు. బుడిబుడి అడుగులేస్తూ ఎంత చక్కగా పని జేస్తారో మీకే తెలుస్తుంది.

వంట ఇంట్లో అయితే వాళ్ళు చూడకుండ బుట్టలో నుండి ఉల్లిగడ్డలను క్రింద పారపోయండి. క్రిందపడ్డ ఉల్లి గడ్డలను బుట్టలో వేయమ్మా అని బుజ్జగిస్తూ చెప్పండి. ఏడుపు టపీమని ఆపి ఒక్కొక్క ఉల్లిగడ్డను చిన్నారి చేతులతో బుట్టలో వేస్తూ వుంటారు. ఈ పనిలో పడి ఏడుపు ఎప్పుడో ఆగి పోయింది. హాయిగా మన పని మనం చేసుకోవచ్చు. ఈ విధంగా వాళ్ళను బుట్టలో పడేయడమే కాక (మస్క కొట్టడం) దీని వల్ల వాళ్ళకు 'సహాయపడే' లక్షణం అబ్బుతుంది. ఇలా ఎన్నో చిన్నచిన్న చిట్కాలు పిల్లల మీద ప్రయోగం చేసి మన దారికి తీసుకురావచ్చు.



తర్వాత స్కూలుకెళ్ళే పిల్లలైతే చాలా జాగ్రత్తగా పెంచాలి. మనం పాకెట్ మనీ అని ఇస్తుంటాం. పిల్లలకు స్కూలుకు వెళ్ళేటప్పుడు అదివాళ్ళ కెంత అవసరమో అంతే ఇవ్వాలి. వీలైతేదాంట్లో మిగుల్చుకొని తెమ్మనాలి. ఈ విధంగా పొదుపు నేర్పించొచ్చు. వాళ్ళు అలా చేస్తే చిన్నచిన్న పొగడ్తలతో పిల్లలను ముంచెయవచ్చు. అది వారిని మరింత బలపరుస్తుంది. అంతెగాని ఎవరో ధనవంతుల పిల్లలు విచ్చల విడిగా డబ్బులు ఖర్చు చేస్తుంటే ఆ ప్రభావం మన పిల్లల మీదపడి మన డబ్బుల కొరకు సతాయిస్తుంటే పిల్లలను కోప్పడకూడదు, కొట్టాలని ప్రయత్నించకూడదు. పిల్లలకు ఓపికతో అర్థం చేయించాలి. ధనవంతులు ఎలా కష్టపడకుండా డబ్బులు సంపాదిస్తారో, ఎంత అవినీతితో డబ్బులు సంపాదిస్తారో, ఎంత అన్యాయంగా డబ్బులు సంపాదిస్తారో పిల్లలకు చెప్పాలి. అందుకే వాళ్ళ పిల్లలు విచ్చలవిడిగా ఖర్చుపెడతారని చెప్పాలి. అలాంటి సంపాదన మనకు అక్కర్లేదని చెప్పాలి. ఆ విధంగా మన పిల్లలను రక్షించుకోవాలి.

కొంతమంది తల్లి తండ్రులు పిల్లలముందే కొట్లాడు కుంటుంటారు. ఇది పిల్లల మనస్సుపై చాలా ప్రభావం చూపుతుంది. తల్లి తండ్రులంటే నిర్లక్ష్య వైఖరి, చెప్పిన మాట వినకపోవడం,, విచ్చలవిడితనం వస్తుంది.

భార్య భర్తల మధ్య అభిప్రాయ భేదాలు వుంటాయి. ఒక సమస్య మీద తర్జన భర్జనలుంటాయి. వాదించుకోవడాలు వుంటాయి. గట్టిగా ఒకరిపై ఒకరు కేకలేసు కోవడాలు వుంటాయిక. ఇవన్నీ పిల్లలముందు ప్రదర్శిస్తే వాళ్ళపై గట్టి ప్రభావం పడుతాయి. అమ్మ నాన్న గొడవలు తాత్కాలికమే! తర్వాత గొడవలు సద్దుమణిగి అన్యోన్యంగా వుంటారని ఆ అమాయక పసి హృదయాలకు తెలువదు! కనుకనే మనం చాలా జాగ్రత్తగా పిల్లలముందు వుండాలి. మనం కోపాన్ని అదుపులో పెట్టుకోవాలి. పిల్లల భవిష్యత్తు కోసమైన లేకపోతే పిల్లలతోపాటు నష్టపోయేది మనమే.

ఇక యుక్త వయస్సు వచ్చి కాలేజిలకెళ్తున్న వారిని మనం కంట్రోల్ చేయడం కష్టమే! ఎందుకంటే వాళ్ళొక క్రొత్త ప్రపంచంలోకి అడుగుపెడుతున్నా మనుకుంటారు. ఏదో అనుభూతితో ఆనందంతో ఉరుకులు పరుగులు పెడుతుంటారు. ఇప్పుడే వేయాలి మనం బ్రేకులు. సడన్ బ్రెకులు వేశామా, నష్టపోతాం. పిల్లలు మన కంట్రోల్‌లో వుండడం కష్టమే ఎందుకంటే వాళ్ళమీద బయట ప్రపంచ ప్రభావం చాలా ఎక్కువగా వుంటుంది. అయినా మనం మరింత పట్టుదలగా బిడ్డలను గమనిస్తూ పెంచాలి. అంతేగాని మనమాట వినరులే అని విడిచిపెట్టకూడదు.

ఇక పాకెట్ మనీ విషయంలో వందలు సరిపోవు. కాని వాళ్ళు అడిగినట్లు ఇస్తేవాళ్ళను చెడగొట్టిన వాళ్ళ మౌతాం.

ఇంట్లో అమ్మ చేసిన టిఫిన్లు తినరు. బయట అడ్డమైన గడ్డికి అలవాటు పడుతారు. పిజ్జాలని, బర్గర్లని, థమ్స్ అప్‌లు, పెప్సీలు

త్రాగడం, తినడం ఫ్రెండ్స్‌తోపాటు హోటల్స్‌కు వెళ్ళడం, జేబులు ఖాళీ చేసుకోవడం జుట్టు పీక్కొని ఇంటికి రావడం, అమ్మ నాన్నలతో తిట్లు తినడం, పిల్లలకు అలవాటుగా మారుతుంది. ఇలా అలవాటుగా మారకుండా ఆలోచించేలా మన కృషి వుండాలి. బాధ్యతాయుతంగా ప్రవర్తించడానికి మనం తోడ్పడాలి. పిల్లలకు మనం ఎటువంటి సమాజంలో జీవిస్తున్నామో వాళ్ళకు చెప్పాలి. ఎంతో కష్టపడి చదివిన మెరిట్ స్టూడెంట్‌కు సీటు దొరకదు డబ్బుతో కొనేసేవాళ్ళు వున్నంత వరకు. ఎంతో తారతమ్యాలతో, ధన స్వామ్యం తెగబలిసి గుండాగిరీలతో రాజ్యమేలుతున్నది. ఇటుంటి దుష్ట సమాజంలో మనమున్నాం. ఈ దుష్ట సమాజం మంచిగా బ్రతకనివ్వదు. ప్రలోభాలకు లోను చెయ్యడం, దిగజార్చడం దాని పని. కనుక మన బిడ్డలు ఈ దుష్ట సమాజం పతనం కావడానికి తమవంతు కృషి చెయ్యాలి.

సమాజం ఎడల, కుటుంబం ఎడల బాధ్యతాయుతంగా ప్రవర్తించేలా మనం తీర్చిదిద్దాలి. కాని ఎంతమంది తల్లితండ్రులు తమ పిల్లలముందు తమ కోర్కెలను అదుపులో పెట్టుకుంటారు?

స్టైల్‌గా సిగరెట్టు త్రాగుతున్న తన తండ్రిని చూస్తుంటే తనుకూడా అలా స్టైల్‌గా సిగరెట్లు ఎప్పుడెప్పుడు కాల్చుదామా అనే కొర్కె పిల్లవాడిలో కలిగితే తప్పేమిటి?

అడిగిందే తడవుగా డబ్బులందించే అమ్మలుండగా పిల్లలు ఎందుకు సిగరెట్లు కాల్చరు? చెత్తా సినిమాలకు, షికార్లకు ఎందుకెళ్ళారు?

నాకు తెలిసిన కుటుంబంలో తండ్రి చైతన్యవంతుడు, సామాజిక స్పృహకలిగినవాడు. మానవసేవయే మాధవసేవ అని నమ్మేవాడు నిజం చెప్పాలంటే నాస్తికుడు. ఇలాంటివి గల ఆయనింట్లో ఆయన పిల్లలు మూఢభక్తులుగా మారిపోవడమేగాక గుళ్ళు గోపురాలకు వెళ్ళడం, గుండు గొరి గించుకోవడం, స్వాముల వార్ల చుట్ట తిరగడం చూస్తూ తెగ బాధపడి పోతున్నాడు. రాయిరప్పకు చెప్పనా నాగోడు నేనే రాయైపోదునా? అంటూ ఆవేదన చెందుతుంటాడు. ఎక్కడుందీ లోపం?

పిల్లలకు టైం ఇచ్చి వాళ్ళను చైతన్య పరచదానికి కృషి చెయ్యలేదు. ఎంతసేపు నేను సామాజిక స్పృహ వున్నవాడినని సంతృప్తి చెందుతాడు కానీ ఆ స్పృహను పిల్లలకు కలిగించలేక పోయాడు. ఎందుకంటే టైం లేక పోవడం అంటాడు. ఎందుకంటే తల్లిదండ్రులే మొదటి ఉపాధ్యాయులు, నీతి నిజాయితీగా జీవించడం నేర్పాలి. పదిమంది జీవితాలలో వెలుగు నింపడానికి కృషి చెయ్యాలి అని చెప్పాలి.

ఒక ఆశయంతో బ్రతుకడం నేర్పాలి. సొంత లాభం కొంతమానుకుని పొరుగువాడికి తోడ్పడే విధంగా జీవించాలి.

మన బిడ్డలను మనం తీర్చిదిద్దుకుంటే ఈ సమాజం మార్పుకు మనవంతు కృషి చేసినవాళ్ళ మౌతాం.

నేను సైతం ప్రపంచానికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను అనే శ్రీశ్రీ సూక్తిని స్మరిస్తూ మంచి పౌరులుగా మన బిడ్డలను తీర్చిదిద్దుకుంటూ ఈ దుష్ట సమాజాన్ని పతనం చేద్దాం.

★★★

# మొన్న ముదిగొండ నేడు వాకపల్లి

✍ బి. ప్రభావతి

పచ్చని కొండల నడుమ ప్రశాంతంగా జీవిస్తున్న ఆదివాసీ గిరిజన మహిళలపై ఖాకీల కౌర్యం కరాళనృత్యం చేసింది. సభ్యసమాజం సిగ్గుతో తలవంచింది. మావోయిస్టుల కూంబింగ్ పేరుతో వాకపల్లి గ్రామంపై దాడిచేసి ప్రజలను భీతావహులను చేసి 11 మంది మహిళలపై సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు. ఘటన జరిగి 3 రోజులైన పోలీస్ భయోత్పాతం నుండి ప్రజలు తేరుకోలేదు. ప్రస్తుతం గ్రామంలో పుట్టకొకరు, చెట్టుకొకరు వెళ్ళగా గ్రామంలో నిశ్శబ్ధవాతావరణం నెలకొంది. ఐద్వా ఈ ఘటనపై ఆగ్రామం వెళ్ళి బాధిత మహిళల కుటుంబాలను పరామర్శించింది. జరిగిన వాస్తవాలను వెలుగులోకి తెచ్చింది.



జి.మాడుగుల మండలం నూర్మితి అనే పంచాయితీ పరిధిలో గల వాకపల్లి మండల హెడ్‌క్వార్టర్‌కు 18 కిలోమీటర్ల దూరంలో ఉన్నది. పంచాయితీకి 3 కి.మీ దూరంలో వాకపల్లి గ్రామం వుంది. ఆగ్రామంలో 78 కుటుంబాలు ప్రియేటివ్‌కొండజాతి (పి.టి.జి) వీరు కోయి తెగకు చెందిన గిరిజనలు వీరు ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడి ఉన్నారు. వీరికి నాగరికత అంటే ఏమిటో తెలీయదు. వీరికి భాషరాదు. వీరు మాట్లాడే బాషకు లిపిలేదు. తెల్లటివన్నీ పాలు, నల్లటివన్నీ నీళ్ళు అని అనుకొనే అమాయక గిరి పుత్రులు.

అటువంటి అమాయక గిరిజనులపై గ్రేహౌండ్స్ దళాలు కూంబింగ్ పేరుతో ఆగస్టు 20న గ్రామంపై పడి సభ్య సమాజం తలదించుకొనే విధంగా కీచకుల్లా ప్రవర్తించారు. వీరు రక్షకభటులా!

ఉదయం 6 గంటలకు గ్రామం చుట్టూ పోలీస్ పహరా కాసింది. ఇంకొంత మంది ఊరుపై పడి దొరికిన వారిని దొరికినట్లు చిదగొట్టారు. మగవాళ్ళు పొలాలకు వెళ్ళిన సమయంలో ఆడవాళ్ల నీళ్ళు తెచ్చుకొనే ఊటగెడ్డలపై పడి వారిని బెదర గొడుతూ పరుగులు పెట్టించారు. (మగవాళ్ళు పొలాలకు, వెళ్ళిన సమయంలో, ఆడవాళ్ళు నీళ్ళు తెచ్చుకొనే ఊటగెడ్డలపై పడి వారిని బెదరు గొడుతూ పరుగులు పెట్టించారు. కొంతమంది మహిళలు పారిపోగా దొరికిన మహిళలను ప్రక్కనే ఉన్న పసుపు తోటల్లోకి ఈడ్చుకొని వెళ్ళి అరిస్తే కాల్చేస్తాం అని వారిపై తుపాకులు ఎక్కుపెట్టి తమ కామాన్ని తీర్చుకున్నారు. నెల బాలింత కూడా ఈఘటనకి బలైంది. ఇది చాలదన్నట్లు ఇళ్ళల్లో దూరి వస్తువులను చిందరవందరగా విసిరేసి విధ్వంసం సృష్టించారు. వస్తువులను ద్వంసం చేసారు. ఆ ఘటన జరిగి 3 రోజులైన గిరిజనులు ఇంకా భయంతోనే వణికిపోతున్నారు. సాయంత్రం 4 గంటలకు పాడేరు సబ్ కలెక్టర్‌కి బాధితులు ఫిర్యాదు చేశారు.ఫిర్యాదు నమోదు చేయడానికి రాత్రి 7:30 గంటలకు డి.ఎస్.పి.రాలేదని ఎం.పి.పి. ఎస్వీ రమణ చెప్పారు. నమోదైన తరువాత రెండున్నర గంటల తరువాత బాధితులను పాడేరులోనే ఉంచారు. బాధిత మహిళలను వైద్య పరీక్షల నిమిత్తం విశాఖలో ఉన్న కె.జి.హెచ్‌కు పాడేరు మెడికల్ ఆఫీసర్ రిఫర్ చేసారు. అయినా కె.జి.హెచ్‌కు తీసుకువెళ్ళకుండా రాత్రి 11 గంటల 45 నిమిషాలకు అనకాపల్లి ప్రాంతీయ ఆసుపత్రికి తీసుకెళ్ళారు. అక్కడ తెల్లవారు జాము వరకు ఉంచి తరువాత విశాఖ కె.జి.హెచ్‌కు తీసుకొచ్చారు. తేది 21.08.2007 ఉదయం 11 వరకు పరీక్షలు చేసారు. సంఘటన జరిగాక 24 గంటలు వరకు వైద్య పరీక్షలు జరపకుండా పోలీసులు తాత్సారం చేసారు. పోలీసులు మళ్ళీ వచ్చి ఏం చేస్తారోనన్న దడవారిలో ఇంకా వ్యక్తమవుతోంది.

ఘటన జరిగిన రోజు హోంశాఖా మంత్రి, డిజిపి ఇది నిరాధారమని అటువంటి ఘటనలు ఏమి జరగలేదని తప్పుడు ప్రకటనలు ఇవ్వడం హాస్యాస్పదంగా ఉంది. బాధిత గిరిజన మహిళలు మాపై అత్యాచారం జరిగింది మాకు న్యాయం చేయమంటే వాళ్ళను కించపరిచే విధంగా ప్రకటనలు చేయడం ఎంత వరకు సబబు. ఏ స్త్రీ అయినా తనపై అత్యాచారం జరిగింది. అని చెప్పుకొనే సందర్భాలు అరుదుగా ఉంటాయి. అటువంటి స్త్రీలను ప్రభుత్వం ఆదుకొని రక్షణ కల్పించాలి తప్ప ఈరకమైన ప్రతిదాడి చేయకూడదు. ఎం.ఎల్.సి. శర్మ గిరిజన సంఘం నాయకులతో ఐద్వా సభ్యులు నిజనిర్ధారణ కోసం వాకపల్లి వెళ్ళిబాధితులతో పరామర్శించాం. చిన్నమ్మ మాట్లాడుతూ ప్రాణభయం తో చెట్టు, చేమ, పుట్టలంట పరుగులంకించుకున్నాం అని చెప్పి ఏడ్చేసింది. 'అడవి మృగాలతో ప్రాణాలొడ్డి పోరాడుతున్న మేము అంతకన్న కర్కశంగా ప్రవర్తించిన పోలీసులను ఎదుర్కొన లేకపోయినామని' మల్లి అనే అమ్మాయి చెప్పి వాపోయింది. సంఘటన జరిగి ఇన్ని రోజులైన ఏ ఒక్క జిల్లా అధికారి కూడా సంఘటనా స్థలం వద్దకు వెళ్ళలేదు. దీన్ని బట్టి ప్రభుత్వానికి గిరిజనులు అంటే ఎంత చిత్తశుద్ధి ఉందో తెలియవస్తుంది. మహిళాసంఘాలు, ప్రజాసంఘాలు నిరసన ప్రదర్శనలు, కలెక్టరేట్ ముట్టడి వంటి కార్యక్రమాలు నిర్వహించాయి.

సిట్టింగ్ జడ్జితో దర్యాప్తు జరిపించాలి. ఎస్.సి.ఎస్టీ యాక్ట్ క్రింద కేసు నమోదు చేయాలి. వాళ్ళకి ఉపాధి అవకాశాలు కల్పించాలి. బాధిత మహిళలకు ప్రభుత్వం అన్ని విధాలుగా ఆదుకోవాలని అన్ని మహిళా సంఘాలు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశాయి.

★★★

# జన్మదిన శుభాకాంక్షలు



శ్రీ తమ్మినేని సీతారాం
మాజీ మంత్రివర్యులు

ఆ స్వరం మండుతున్న భాస్వరం,
ఆ రూపం కళింగసీమ సౌరభం, ప్రతిక్షణం
ప్రజలకోసం **సీతారాం** జీవితం ప్రజలకే అంకితం..
పదవులకంటే ప్రజలే గొప్పని, అధికారం కంటే
అభిమానం ముఖ్యమని, సంపదలకంటే స్నేహం
అమూల్యమని రాజకీయరంగంలో తనకంటూ ఒక
ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్న మాజీ మంత్రి
**తమ్మినేని సీతారాం** గారి
52 జన్మదినోత్సవం
సందర్భంగా ఇవే మా హార్ధిక
శుభాకాంక్షలు...



ఇట్లు
ఆముదాల వలస
నియోజకవర్గం
టిడిపి నాయకులు



# ఉద్యమాలతో నేస్తం... దీక్షల్లో భాగం

బి. సుధా కిరణ్

వారు సాధారణ మహిళలు. ఉదయం లేస్తే ఇంటిపని, వంటపని, వీటితో పాటు కుటుంబ భారం నిత్యకృత్యాలు. రెక్కలు ముక్కలు చేసుకున్నా రెండుపూటలా డొక్కాడని ఎందరో నిరుపేద మహిళల్లో వారు భాగమే. అయితే ప్రజా సంఘాలు నిర్వహిస్తున్న భూ పోరాటం వారిలో కొత్త స్ఫూర్తిని నింపింది. పోరుబాటన నడిపింది. 100 రోజుల క్రితం కుటుంబ జీవనం తప్ప మరేమీ తెలియని వారు ఇప్పుడు ఉద్యమ సారధులయ్యారు. ప్రజా సంఘాలు చేపట్టిన నిరవధిక దీక్షల్లో భాగస్వాములయ్యారు. జిల్లా కేంద్రమైన గుంటూరులో నిర్వహిస్తున్న నిరవధిక దీక్షల్లో 14మంది పాల్గొన్నారు. వారిలో నలుగురు మహిళలు. దీక్షా శిబిరానికి నాయకత్వం వహిస్తున్న సిపిఎం జిల్లా కార్యదర్శి డి.రమాదేవి, అఖిలభారత ప్రజాతంత్ర మహిళాసంఘం జిల్లా కార్యదర్శి వి.అనీలకు ఉద్యమాలు, నిర్బంధాలు కొత్తేమికాదు. అయితే వారితోపాటు నిరవధిక దీక్షల్లో పాల్గొంటున్న మరో ఇద్దరు మహిళలు షేక్ ప్యారీ, శెట్టి లిల్లీలకు మాత్రం పూర్తిగా కొత్తే! 52వ డివిజన్‌కు చెందిన వీరిరువురూ భూ పోరాటాలతోనే ఉద్యమాల్లోకి వచ్చారు. లాఠీ దెబ్బలు తిన్నారు. అరెస్టులయ్యారు. ఇప్పుడు నాయకులనొప్పించి నిరవధిక దీక్షల్లో భాగస్వాములయ్యారు. ఇళ్లస్థలాలను సాధించేంతవరకూ పోరాడి తీరుతామని వీరు అంటున్నారు. "పస్తులు మాకు కొత్తేమి కాదు. ఒక పూట తింటే ఇంకో పూట తినకుండా సాగే బతుకులేమావి. కూలికెళ్లితే 50 రూపాయలు ఇస్తారు. నాతో పాటు ఇద్దరు పిల్లలు. పనులు లేనప్పుడు ఎన్నో రోజులు పిల్లలతో కలిసి పస్తులు పడుకున్నాం. ఇప్పుడు నాయకులతో కలిసి, ప్రజలందరి కోసం ఇక్కడ పస్తులుంటున్నాం. నాకు చాలా ఆనందంగా ఉంది. నా పిల్లలను ఇరుగుపొరుగువాళ్లు చూసుకుంటున్నారు. పోరాటాన్ని కొనసాగిస్తా" అని ప్యారీ చెప్పారు. "వచ్చే కొద్దిపాటి డబ్బుతో బాడుగ కట్టలేక, పిల్లల్ని చదివించలేక నానా ఇబ్బందులు పడుతుండేదాన్ని. సిపిఎం వాళ్లు మా ఇళ్లకొచ్చారు. భూ పోరాటానికి రమ్మన్నారు. ఎన్నికలకు ముందు రాజశేఖర్‌రెడ్డి కూడా ఇళ్లస్థలాలు ఇస్తామని చెప్పారు కదా. వీరితో కలిసివచ్చా. పోలీసులు చితకబాదారు. నా కళ్లముందే నాయకులను ఈడ్చిపారేశారు. లాఠీలతో కొట్టారు. మా కోసం వచ్చి వాళ్లు దెబ్బలు తిన్నారు. అప్పుడు చెప్పబట్టే ఇప్పుడు అడుగుతున్నాం. చేతకానివాళ్ళు ఎన్నికల ముందు ఎందుకు చెప్పాలి? ఇప్పుడింక భూ పోరాటాన్ని ఆపం. నాకు రాజకీయాలు తెలియవు. మా కోసం సిపిఎం వాళ్ళు దెబ్బలు తిన్నారు కదా, మిగిలిన పార్టీల వాళ్ళు వచ్చారా? అందుకే ఈ దీక్షల్లో పాల్గొంటానని అడిగా" అని అన్నారు శెట్టి లిల్లీ. మాటలు చెప్పడమే కాదు. నిరవధిక దీక్షలు జరిగినన్ని రోజులు వీరు దీక్షల్లో పాల్గొన్నారు. పోలీసులు బలవంతపు అరెస్టులకొచ్చిన సమయంలో ప్రతిఘటన చూపారు. ఐదు రోజులు తిండిలేక నీరసించిపోయిన వీరిని అరెస్ట్ చేసి ఆస్పత్రికి తరలించడానికి పోలీసులు నానాతిప్పలు పడాల్సివచ్చింది. ఆస్పత్రిలో కూడా వీరిది పోరాట పంథానే. నాయకుల జోక్యంతో చివరకు దీక్షను విరమించారు. ఇప్పుడు వీరు వారి పేటలోని వారందరికి ఆదర్శంగా నిలిచారు.

★★★

## స్పర్శ అంతర రహస్య విస్ఫోటన

పాప చెక్కిళ్ళపై ముద్దు
అంతర స్పర్శానుభూతి
... ... ...

పాప అందం అంతరీకరణ పొరమీద
మమ్మీ... పాపమమ్మీ... నగ్నశరీర మాంసముద్దల
పరకాయ వాంఛ
పాప చెక్కిళ్ళ... ముద్దా?

మగ మృగ మానసిక వ్యభిచార... అందమైన పరదాలు
లోలోపలి... ప్రయోగల... ప్రయోగశాల పరికరాల
పాప చెక్కిళ్ళు...?

మమ్మీగా మారిపోయిన ఓ అమ్మా
దేవేంద్రుడి కోడికూతలు
మరో... నాగరికత సంస్కృతి రూపంలో
మళ్ళీ దాపరిస్తున్నాయి
జాగ్రత్త తల్లీ!

పాప...! ఏముద్దులో ఏ స్పర్శ.. సర్ప చర్యదాగివుందో
తెలుసుకొని
అమ్మకు కాదు మమ్మీకే చెప్పు

– జనజ్వాల

# ఉద్యమాల బాటలో....

## భూ పోరాటాలు

వరంగల్ జిల్లా వ్యాప్తంగా భూ పోరాటాలు కొనసాగుతున్నాయి. తలదాచుకోడానికి జానెడు జాగలేని పేదలు దశాబ్దాలుగా కిరాయి ఇళ్ళల్లో బతకలేక, చేద్దామంటే పనులు లేక ఇబ్బందులు ఎదుర్కొంటున్న స్థితిలో ఎడారిలో నీటి చుక్కలా, కటిక చీకట్లో క్రాంతి రేఖలా ప్రజాసంఘాలు, వామపక్షాలు భూ ఉద్యమాన్ని చేపట్టాయి.

ఆ పిలుపునందుకున్న పేదలు వెల్లువలా కదిలారు. ప్రభుత్వ స్థలాల్లోని ముళ్ళపొదలను నరికి మూల స్థంబాలుగా పేర్చి గుడిసెలు నిర్మించుకున్నారు. ఈ నీడను కాపాడుకోవాలన్న తపన మహిళల్లో పెరుగుతుంది. ఎందుకంటే పురుషులు చెట్టుకిందో ఏ అరుగు మీదో తలవాల్చుకోగలరు. కాని మహిళ ఆత్మగౌరవానికి సంబంధించిన అంశంగా ఇంటి అవసరం ఏర్పడి మహిళలు నిర్భంధాన్ని సహితం తట్టుకొని భూ పోరాటంలో నిలబడుతున్నారు. ఈ నిర్భందకాండను ఖండిస్తూ మేధావులు, ప్రజాసంఘాలతో ఐద్వా రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించడం జరిగింది.




సమావేశంలో క్రింది తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించారు. ప్రభుత్వ భూములలో గుడిసెలు వేసుకున్న పేదలపై ప్రభుత్వ నిర్భందాన్ని ఖండిస్తూ ప్రముఖులు, మేధావులతో రౌండ్ టేబుల్ సమావేశంలో ప్రవేశపెట్టిన తీర్మానం.

గత దశాబ్ది కాలంలో నిరుపేదలు ఇండ్ల స్థలాలు, సాగుభూమి కోసం ప్రభుత్వానికి అనేకసార్లు దరఖాస్తులు పెట్టుకున్నారు. అయినా ఫలితం లేకుండాపోయింది. అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ఎన్నికలముందు ఇండ్లులేని పేదలందరికి ఇండ్ల స్థలాలిచ్చి పక్కా గృహాలు నిర్మిస్తామని, భూమిలేని ప్రతి పేద కుటుంబానికి సాగు భూమి పంచుతామని వాగ్ధానం చేశారు. కాని అధికారంలోకి వచ్చి మూడేళ్ళు గడుస్తున్నా ఎలాంటి నిర్ధిష్ఠ చర్యలు చేపట్టలేదు. భూ పంపిణీ కార్యక్రమాన్ని ప్రచార నినాదంగా దిగజార్చారు. ఇలాంటి స్థితిలో గత్యంతరం లేక పేదలు ప్రభుత్వ భూమిలో గుడిసెలు వేసుకొని ప్రత్యక్ష ఉద్యమాలకు సిద్ధపడ్డారు.

వరంగల్ నగర పరిధిలో ఉర్సు శివారులో గల సర్వే నెం. 140, 142లో 18 ఎకరాలు, చింతల్‌లో సర్వే నెం. 427, 428లో కొత్తవాడ సర్వే నెం. 174-151లో హన్మకొండ పెద్దమ్మగడ్డ ప్రాంతంలో అత్యంత నిరుపేదలు సుమారు 50 ఎకరాల్లో 5 వేల గుడిసెలు వేసుకున్నారు. హసన్‌పర్తి, పరకాల, భూపాల్‌పల్లి, నర్సంపేట్, మహబూబాబాద్, కురవి, మరిపెడ, కే. సముద్రం, నెల్లికుదురు, స్టేషన్‌ఘన్‌పూర్, పాలకుర్తి, జనగామ, చేర్యాలలో, మరో 5 వేల మందితోపాటు జిల్లాలో మొత్తం 10,000 వేలమంది గుడిసెలు వేసుకున్నారు.




సానుకూలంగా స్పందించి గుడిసెలు వేసుకున్న పేదలకు పట్టాలు ఇవ్వాల్సిన ప్రభుత్వం పోలీసు బలగాలతో దాడులు చేస్తూ నిర్భందకాండను కొనసాగిస్తున్నది. బుల్డోజర్లతో పేదల గుడిసెలు కూల్చివేస్తూ పేదలపై విచక్షణా రహితంగా లాఠీచార్జీలకు పాల్పడుతూ అక్రమ కేసులు పెట్టి, మహిళలను మగ పోలీసులు లాక్కువెళ్ళడం, తలవెంట్రుకలు పట్టి ఈడ్చుకెళ్ళడం, గుండుపిన్నులతో గుచ్చడం, మహిళలు చూపించుకోలేని శరీర భాగాలపై లాఠీలు ఝుళిపించడం వంటి రజాకార్‌లను మైమరపించే తీరున నిర్భందాన్ని తెచ్చారు. అక్రమ కేసులు పెట్టి జైళ్ళలోకి పంపుతున్నారు. పోలీసులు చేసిన లాఠీ చార్జిలో ఇప్పటివరకు జిల్లాలో 60 మంది తీవ్రంగా గాయపడ్డారు. 400ల మందిపై కేసులు పెట్టారు. 1200 మంది మహిళలు లాఠిచార్జికి గురయ్యారు.

ప్రభుత్వ భూమిలో పేదలు గుడిసెలు వేసుకుంటే వాటిని తొలగించకుండా అర్హులైన వారికి పట్టాలిచ్చి రెగ్యులేషన్ చేయాలని ప్రభుత్వ జి.వోలు 508,1601, 331, 456 పేర్కొంటున్నాయి. ఇట్టి జి.ఓలకు విరుద్ధంగా ప్రజలపై ప్రభుత్వం తీవ్ర నిర్భందాన్ని కొనసాగించడాన్ని ఈ రౌండ్ టేబుల్ సమావేశం ఖండించింది.

వరంగల్ నగరంలో 4 వేల ఎకరాల ప్రభుత్వ మరియు సీలింగ్ భూములున్నాయి. వీటిని రియల్ ఎస్టేట్ వ్యాపారులు, రాజకీయ పలుకుబడి కలిగిన పెద్దలు ఆక్రమించారు. వారిపై ఏలాంటి చర్యలు గైకొనకుండా వారికి కొమ్ముకాస్తూ పేదలపై మాత్రం లాఠీలు ఝుళిపిస్తున్నారు. చట్టం ముందు అందరూ సమానులే అని ప్రభుత్వం చెబుతుంది. సమన్యాయ పాలనంటే ఇదేనా అని అడుగుతున్నాము.

కావున ప్రభుత్వ భూములలో గుడిసెలు వేసుకున్న పేదలపై అక్రమ కేసులను వెంటనే ఎత్తివేయాలని ఇప్పటి వరకు పెట్టిన కేసులను ఎత్తివేయాలని, ప్రభుత్వ స్థలంలో గుడిసెలు వేసుకున్నవారికి పట్టాలు ఇవ్వాలని, లాఠిచార్జీలో గాయాల పాలైన వారందరికి ప్రభుత్వ వైద్యం అందించాలని సమావేశం తీర్మానించింది.

## సదస్సులు



గత 100 రోజులుగా జరుగుతున్న భూపోరాటంలో మహిళలు ఎక్కువ శాతం మంది పాల్గొంటున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా 50,000 అందులో మహిళలు 22,000 పాల్గొన్నారు. వేలాది మంది మహిళలను అరెస్టులు చేయగా...18022 మందిపై కేసులు పెట్టగా 600 మంది 2 నుండి 17 రోజుల పాటు జైలులో ఉన్నారు. నెల్లూరు జిల్లాలో పోలీసుల రాక్షసత్వానికి ఐద్వా జిల్లా నాయకురాలు రమమ్మను రోడ్డుపై వదేసి పోలీసులు ముప్పేట దాడి చేశారు. చీరను లాగివేయటం కొట్టుకుంటూ పోలీసు వాహనంలోకి విసిరివేయడం వంటివి మీడియాలో చూసిన వెంటనే అన్ని జిల్లాల్లోను పోలీసుల చర్యను నిరసిస్తూ రాస్తారోకోలు, రౌండ్ టేబుల్ సమావేశాలు, సదస్సులు నిర్వహించడం జరిగింది. ఐద్వా రాష్ట్ర కమిటీ ఆధ్వర్యంలో భూ సమస్య- మహిళలు అనే అంశంపై జరిగిన సదస్సులో అస్మిత వ్యవస్థాపకురాలు శ్రీమతి వసంతా కన్నాభిరాన్ ముఖ్య వక్తగాను, భూపోరాటంలో పోలీసుల లాఠీచార్జికి గాయపడిన మహిళలు, జైళ్ళకు వెళ్ళిన మహిళలతో సదస్సు 120 మందితో జరిగింది.

విశాఖ జిల్లాలో పోలీసుల దమన కాండను నిరసిస్తూ చర్చా గోష్ఠి కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమంలో ఎం ఎల్‌సి ఎం.వి.ఎస్. శర్మ ముఖ్య అతిథిగా పాల్గొన్న ఈ కార్యక్రమంలో పోలీసు చర్యలను ముక్త కంఠంతో ఖండించారు.

## ఎ.ఆర్. కానిస్టేబుల్ ఎడ్ల రవిని డిస్‌మిస్ చేయాలి

ఎ.ఆర్ కానిస్టేబుల్ ఎడ్ల రవి ప్రేమికుల జంటను వేధించి దౌర్జన్యం చేసి, భయాందోళనకు గురిచేసి, మైనర్ బాలికపై అతి కిరాతకంగా అత్యాచారానికి పాల్పడిన ఘటనపై కానిస్టేబుల్ ఎడ్లరవిని డిస్‌మిస్ చేయాలని అఖిల భారత ప్రజాతంత్ర మహిళాసంఘం జిల్లా కమిటి ఆధ్వర్యంలో వరంగల్ హెడ్ పోస్టాఫీస్ వద్ద పెద్ద ఎత్తున రాస్తారోకో జరిగింది.

ఈ సందర్భంగా ఐద్వా జిల్లా కార్యదర్శి నలిగంటి రత్నమాల మాట్లాడుతూ కంచే చేనుమేసిన చందంగా రక్షించాల్సిన పోలీసులే కీచకుల వలె భక్షిస్తే సామాన్యుల సంగతేటని ప్రశ్నించారు. ఎడ్ల రవి గతంలో అనేకమంది మహిళలను వేధించినట్లు కేసులు కూడా ఉన్నాయి. అయినా ఏదో తెలియక చేసిన తప్పు అని సస్పెండ్ చేయడం సరియైన శిక్షకాదు. కానిస్టేబుల్‌ను డిస్‌మిస్ చేసి, కఠినంగా శిక్షించాలన్నారు. జిల్లాలో మహిళలపై పోలీసు వేధింపులను పూర్తిగా అరికట్టాలి. ఈ విధంగా జరిగిన ఘటనలకు అనేక సందర్భాలలో ప్రక్కదారి పట్టించిన చరిత్ర పోలీసు యంత్రాంగానికి ఉన్నది. జిల్లాలో కలెక్టర్, ఎస్.పి. మహిళా అధికారులు ఉన్నాగాని మహిళలు, మైనర్ బాలికలకు రక్షణ కరువవ్వడం శోచనీయం.



– మైనర్ బాలిక యాసిన్‌ను బెదిరించి పశువులా అతికిరాతకంగా అత్యాచారానికి పాల్పడిన కానిస్టేబుల్‌ను కఠినంగా శిక్షించి, ఉద్యోగం నుంచి తొలగించాలి. బాధిత కుటుంబానికి రెండు లక్షల ఎక్స్‌గ్రేషియా వెంటనే చెల్లించాలి. బాలిక వైద్యానికి అయ్యే ఖర్చు ప్రభుత్వమే భరించాలి. తీవ్ర రక్తస్రావంతో బాధపడుతున్న మైనర్ బాలికకు సరైన వైద్య సేవలు అందించాలి. ఈ ఘటనకు బాధ్యుడైన కానిస్టేబుల్‌ను వెంటనే ఉద్యోగం నుండి తొలగించాలని ఐద్వా డిమండ్ చేస్తుంది.

## అధిక ధరలపై

రాష్ట్రంలో పెరిగిపోతున్న నిత్యావసర వస్తువులు, కూరగాయల ధరలను ప్రభుత్వం అదుపుచేయాలనే ప్రధాన డిమాండ్‌తో ఐద్వా రాష్ట్ర కమిటి పిలుపు మేరకు నిరసన ప్రదర్శనలు, దిష్టిబొమ్మదగ్ధం కార్యక్రమాలు జరిగాయి. రోజు రోజుకు పెరిగిపోతున్న ధరలను అదుపుచేయాలని, 14 రకాల నిత్యావసర వస్తువులను చౌక ధరల దుకాణాల ద్వారా, రైతు బజార్లలోను ప్రజలకు అందుబాటు ధరలతో పంపిణీ చేయాలనే డిమాండ్స్‌తో సివిల్ సప్లయ్ కమీషనర్‌కు మెమోరాండమ్ ఇవ్వటం జరిగింది.



## మైక్రో ఫైనాన్స్

పార్లమెంట్ ముందుకు రాబోతున్న మైక్రోఫైనాన్స్ బిల్లును మహిళా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు, ప్రతినిధులు, మేధావులలో చర్చించిన తరువాతనే తిరిగి రూపొందించాలనే ప్రధాన డిమాండ్‌తో ఆర్థిక మంత్రి చిదంబరం గారికి సంతకాలు సేకరించి పంపే కార్యక్రమం అన్ని జిల్లాల్లో సంతకాలు సేకరించి మెమోరాండమ్ పంపడమైనది.

## జనస్వాస్థ్య అభియాన్



అందరికి ఆరోగ్యం-ప్రజారోగ్యం అనే నినాదంతో జనస్వాస్థ్య అభియాన్ (జెఎస్ఎ) ఆంధ్ర ప్రదేశ్‌లోని అన్ని జిల్లాల్లో అవేర్‌నెస్ కొరకు చర్చా గోష్టి కార్యక్రమం, సదస్సులు నిర్వహించింది. అందులో భాగంగా ఖమ్మం జిల్లాలో 'అనారోగ్యంలో ప్రజారోగ్యం' అనే అంశంపై సదస్సు జరిగింది. విజయవాడలో ప్రజారోగ్యం అనే అంశంపై 2 రోజులు సెమినార్‌లు, చర్చాగోష్టి కార్యక్రమాలు నిర్వహించి భవిష్యత్‌లో ప్రజారోగ్యం కొరకు కొన్ని నిర్ణయాలు చేయటం జరిగింది. ఈ కార్యక్రమంలో ఐద్వా సభ్యులు పాల్గొన్నారు.

## "స్నేహ" సాధించిన విజయం

ప్రకాశం జిల్లా మార్కాపురం పట్టణంలో 3 నెలలుగా చేసిన ఆందోళన ఫలితంగా స్నేహ ఇంటిపనివారల సంక్షేమ సంఘం సభ్యులు తమ జీతాలు పెంచుకున్నారు.

మొదటిగా తమ డిమాండ్స్‌తో కూడిన అర్జీని ఆర్.డి.ఓ. గారికి సమర్పించారు. తరువాత పట్టణంలో 1200 మందితో సదస్సు జరుపుకొని తమ జీతాలు ఏవిధంగా పెంచుకోవాలో చర్చించుకొని ఒక పథకాన్ని రూపొందించుకున్నారు. రూపొందించుకున్న ప్రకారం యజమానులకు విజ్ఞాపనా పత్రాలను అందచేశారు. ఒక వ్యక్తి బట్టలు ఉతికినందుకు రూ. 25 వున్న జీతాన్ని రూ. 50లు చేయమని, గిన్నెలు తోమినందులకు ప్రస్తుతం ఇచ్చే మొత్తాన్ని రూ. 50 పెంచాలని డిమాండ్ చేస్తూ అప్పీలు చేసుకున్నారు. వీరి శ్రమను గుర్తించిన యజమానులు సానుకూలంగా స్పందించి అందుకు అంగీకరించారు. ఆ విధంగా మార్కాపురం పట్టణంలో వున్న దాదాపు 1500 మంది స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘ సభ్యులు తమ జీతాలు పెంచుకొని విజయం సాధించారు.

## తస్లీమా నస్రీన్ పై దాడిని ఖండన

ప్రముఖ రైటర్ తస్లీమా నస్రీన్‌పై ఎమ్.ఐ.ఎమ్‌కు సంబంధించిన ముగ్గురు ఎమ్.ఎల్.ఎ.లు, కార్యకర్తలు దాడి చెయ్యటాన్ని అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) పై దాడిని ఖండిస్తూ ఐద్వా అధ్వర్యంలో ర్యాలీ జరిగింది. బాగ్‌లింగంపల్లి సుందరయ్య పార్క్ నుండి చిక్కడపల్లి మీదుగా ఆర్‌టిసి క్రాస్‌రోడ్స్ వరకు జరిగిన ఈ ర్యాలీలో 500 మంది మహిళలు పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో ఐద్వాకార్యదర్శి స్వరూపరాణి, ప్రజానాట్యమండలి అధ్యక్షురాలు పి.ఎ. దేవి పాల్గొని ఈ ఘటన ఎంతో తీవ్రమైనదని కారకులను అరెస్ట్ చేసి కఠినంగా శిక్షించాలని కోరారు.




ప్రజాస్వామ్య దేశంలో ప్రజలకు తమ అభిప్రాయాలను వ్యక్తం చేసే భావ ప్రకటన స్వేచ్ఛ వుంది. తస్లీమా నస్రీన్ వ్రాసిన 'లజ్జ' నవలకు వ్యతిరేకంగా ఎమ్ఐఎమ్ నాయకులు దాడిచెయ్యటం దుర్మార్గమైన చర్య. నగరంలో ఒక పుస్తక ఆవిష్కరణకు హాజరైన ఆమెపై భౌతిక దాడి చెయ్యటాన్ని, అవమానపరచటాన్ని ఐద్వా తీవ్రంగా నిరసిస్తోంది. మహిళలపై దాడికి పాల్పడిన వారిపై కఠిన చర్యలు తీసుకోవాలని ప్రభుత్వాన్ని ఐద్వా డిమాండ్ చేసింది.

## క్లాసులు



వరంగల్ టౌన్‌లో 120 మందికి 2 రోజులు, వరంగల్ జిల్లా క్లాసులు 6 డివిజన్‌ల నుండి 80 మందికి 2రోజులు ముఖ్య కార్యకర్తలకు, హైదరాబాద్-500, 2 రోజులు, కడప-120 మంది 2 రోజులు, విశాఖ-100, 2 రోజులు, ప్రకాశం-20 మందికి 1రోజు, ఆదిలాబాద్-50 మందికి 1 రోజు, స్టడీ సర్కిల్స్: విశాఖ-250, తూ॥ గోదావరి-210 మందితో స్టడీ సర్కిల్ నిర్వహించారు.



## మహాసభలు




గడచిన 3 ఏళ్ళ కాలంలో ఐద్వా చేసిన కార్యక్రమాలను సమీక్ష చేసుకుని భవిష్యత్ కార్యాచరణ కొరకు జరుగుతున్న మహాసభలు ఊపందుకుంటున్నాయి. డివిజన్ మహాసభలు, జోన్ మహాసభలు జరుగుతున్నాయి. ఈ కాలంలో 11 జిల్లాల్లో 444 వార్డు కమిటీలు, 6 జిల్లాలో 80 గ్రామ కమిటీలు, 5 జిల్లాల్లో 39 మండల కమిటీలు, 3 జిల్లాల్లో 28 డివిజన్ కమిటీలు, 8 పట్టణ కమిటీలు కొత్తగా ఏర్పడినవి. నెల్లూరు జిల్లా మహాసభ 250 మంది ప్రతినిధులతో ఆగస్టు 12వ తేదీ జరిగింది. శ్రీమతి అరిగెల రమమ్మ, డి. అన్నపూర్ణమ్మ అధ్యక్ష కార్యదర్శులుగా, జక్కా శేషమ్మ గౌరవాధ్యక్షులుగా 30 మందితో కమిటీ ఏర్పడింది.

## ముదిగొండ ఫండ్

ముదిగొండ ఘటనలో మరణించిన వారికి, గాయపడిన వారికి ఆర్థిక సహాయం అందించేందుకు ఐద్వా రాష్ట్ర కమిటీ చందాలు వసూలు చేయాలని అన్ని జిల్లా కమిటీలకు ఇచ్చిన పిలుపు మేరకు హైదరాబాద్-7,000, విశాఖ-10,000, కృష్ణా జిల్లా -10,812, ప్రకాశం 4037 కర్నూలు-3400, నిజామాబాద్-2,000 రంగారెడ్డి-5400, కడప-5,000, ఆదిలాబాద్-2500, వరంగల్-2380, నెల్లూరు-2000, తిరుపతి-5000, నల్గొండ-3,000 వసూలు చేసాయి. దీనికి సంబంధించి 52,000 కరపత్రాలు పంపిణీ చేయడం జరిగింది.



## సారాపై

మద్యం అమ్మకాలను పెంచిన వారికి ప్రోత్సాహకాలు అంటూ ఎక్సైజ్ శాఖ ప్రకటించింది. దీనిపై మద్యం అమ్మకాల్ని నిలిపివేయాలి. బెల్టు షాపులను మూసివేయాలనే డిమాండ్‌తో ప్రకాశం జిల్లా మహిళా సంఘం పోరాటం చేస్తుంది. ఎక్సైజ్ శాఖ రికార్డుల ప్రకారం ప్రకాశంజిల్లాలో 331 లైసెన్స్ దుకాణాల ద్వారా మద్యం అమ్మకాలు సాగుతున్నాయి. మొత్తంగా 2600 బెల్టు షాపులున్నాయని ప్రకటించింది. అయితే ఆ సంఖ్య 4000 వరకు వుందని మహిళా సంఘాల వాదన. సంవత్సరానికి ఒక్క జిల్లాలోనే 118కోట్ల రూపాయల మద్యం వ్యాపారం సాగుతుంది. అంటే ప్రతి ఒక్క కుటుంబం దీని బారిన పడి అనారోగ్యం పాలవుతున్నారు. దీన్ని ఎదుర్కొనేందుకు ప్రకాశం జిల్లాలో కొండపి మండలం నేతివారి పాలెం లో నెల రోజుల క్రితం ఈ పోరాటం ప్రారంభమయింది. ప్రస్తుతం అన్ని గ్రామాలలో ఈ ఉద్యమం కొనసాగుతుంది.





పోలీసుల పైశాచికత్వం



రక్తసిక్తమైన దీక్షా శిబిరం



ఖమ్మం కలెక్టరేట్ వద్ద నిరసన



లాఠీదెబ్బలకు సొమ్మసిల్లిన మహిళ



గాయపడిన వారిని పరామర్శిస్తున్న ఐద్వా బృందం



ముదిగొండలో ఈ జనాన్ని చెదరగొట్టడానికే
పోలీసుల కాల్పులు



తలకు గాయంతో మహిళ

స్నేహ ఇంటి పనివారల సంక్షేమ సంఘం

# ఇంటి ముత్యాలు




జీవమ్మ, పూలమ్మ, యాదమ్మ
పేరేదైతేనేం?
అమ్మానాన్నలు ముద్దుగా పెట్టుకున్న పేర్లేవీ
అవసరం లేని 'పని' మనుషులు.

తొలిపొద్దు చుక్కను తోడుచేసుకుని
పిన్నీసులు గుచ్చుకున్న రబ్బరు చెప్పుల్తో
రాలినపూలూ రేగిన జుట్టును ముడేసుకుంటూ
స్కేటింగ్ వీల్స్‌తో పోటీపడుతూ
ఒకటే పరుగు, ఒకటే వేగం

సూర్యుడు పన్నెండు అంకెల మీదకొచ్చేసరికి
ఆరేడిళ్ళు చుట్ట బెట్టుకుని
ఫ్రిజ్జులొచ్చి ఇళ్ళల్లో పడ్డ తర్వాత
కూరానారలు పెట్టే సంస్కృతిపోయాక
పాచిపోయిన మరీ పాడై పోయిన కూరల్ని
ప్లాస్టిక్ సంచుల్లోకి సర్దుకుని
గుడిసెకు తిరిగొచ్చేసరికి
ఆగమాగమై వున్న ఇల్లు

అన్నీ సవరిచ్చుకుని పన్లూ చేసుకుని
అరికాళ్ళకూ, అరిచేతులకు భేదం లేకుండా
పగుళ్ళు బారిన నెర్రెలు విచ్చిన బీటలుబడ్డ మనసుల్తో
నడుము నెప్పినీ, ఒళ్ళంతా మంటల్నీ
అరిగిన ఎముకల్నీ మోసుకుంటూ
ఖాళీ గిన్నెల్లో కష్టాలు కూరుకుంటూ
నాలుగయ్యేసరికి మళ్ళీ రోజులో రెండో పోరాటం మొదలు

ఇళ్ళను అద్దాలు చేసి
తుడిచిందే తుడిచి
మసి బారిన గిన్నెల్ని మెరిపించేసి
మురికోడుతున్న దుస్తుల్ని తళతళ లాడించి
చిన్నా చితకా పనుల్ని లెక్కెట్టు కోకుండా చేసి
నెలకోసారి చంద్రుడిలా వచ్చే జీతాల్ని
రోజూ కోతలేకుండా రావాలని తలుచుకుంటూ
చుక్కలు ఆకాశాన్ని చుట్టు ముడుతుంటే
గుడిసెకు నిస్సత్తువతో
అలవాటైన కాళ్ళు వేస్తున్న అడుగుల్తో
గ్యాస్ నూనె దీపాన్ని వెలిగిస్తూ, ఆమె, ఆమెలు

మండని కట్టెల్తో ముసురుతున్న పొగల మధ్య
కుతకుత ఉడుకుతున్న అన్నంలా ఆమె
ఆకలి కళ్ళతో, అమ్మ లాలింపును కోల్పోయి
నాన్న ప్రేమ తెలీని, సర్కారీ బళ్ళ చదువుల్తో
పెద్దయ్యాకన్నా బతుకు పూలు పూయువా అన్న ఆశతో
కొడిగట్టిన దీపాల్లాంటి పిల్లలు.

పగలల్లా పని దొరికిందనీ, దొరకలేదని పెత్తనం చేస్తూ
సాయంత్రమయ్యే సరికి
అధికారపు సారా దుకాణాల్లో పడి
యిరగతాగి, జేబుకు చిల్లులు పడ్డాక.
గుడిసె కొచ్చిన మగమహారాజైన మొగుడి గార్కి
ఒకప్పటి పల్లెలోని ఇల్లుకాక
పట్నాని కొచ్చాక మారిన గుడిసె నచ్చక
రైతు భార్యలా బతికిన పెళ్ళాం
పాచి మనిషి రూపాన్ని భరించలేక
అరుపులు, కేకలూ, తన్నులు, తిట్లూ
ఉచితంగా ఉదారంగా కుటుంబానికిచ్చి,
లేని కోడి కూరనూ,
రాని ఆరోగ్యాన్నీ
మానుకోలేని వ్యసనాన్నీ
మారని బతుకు బండినీ
మరిచిపోయి నిద్దరోయే ఇంటి దొర

ఇల్లెక్కి కూయలేని ఆమె
పిల్లల్నీ, కుటుంబాన్నీ మోస్తూ, మోస్తూ
మన ఇళ్ళల్లో, మన మధ్యనే
కొట్టు మిట్టాడుతూ
అవమానాల, అవహేళనల బ్రతుకునీడుస్తోంది.

జాతీయదాయాల్లో మహిళల ఇంటి చాకిరీ మూడొంతులున్నా
లెక్కకురాని, లేని, శ్రమ విలువలేని జీతాల్తో వీళ్ళు
వాళ్ళూ మనుషులే
వాళ్ళ సమస్యలు కొంతవరకన్నా మనవే
మానవత్వంతో వ్యవహరిస్తే
'స్నేహ' లాంటి వాళ్ళ 'సంక్షేమ సంఘాల' కృషి విజయమై
వాళ్ళందరి జీవితాల్లో వెలుతురు పూలు పూయాలి.

డా॥ శిలాలోలిత



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CmV01A 181 |
| పుస్తకం పేరు | చెలిని విరహిణి |
| తారీఖు | 2/18/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |